## A JOYOUS CHRISTMAS.

The Purest Joy
Your heart fulfil
Like scents that
Summer suns distil
From fragrant
Summer flowers
And of this happy
Christmas tide
May Sweetest memories abide
To cheer the future's hours.

## A BRIGHT NEW YEAR TO YOU.

తే॥ గీ॥ మన యెడల దేవ దేవుని - కనుదినంబు ।
ప్రేమ క్రొత్తగ బుట్టునన్ - వేదవాక్య ।
మంపుచున్నాను సంవత్స - రాది కొరకు ।
ఇరిమియా విలాపము మూడు - స్మరణ లేఖ ॥

# CHURCH BOOK

FOR THE USE OF

# ANDHRA EVANGELICAL UTHERAN CONGREGATION

ABRIDGED EDITION

# సంఘారాధన పుస్తకము

ఇది

ఆంధ్ర ఎవాంజెలికల్

లూథరన్ సంఘమువారి యనుమతి చొప్పున

ప్రచురింపబడినది

మూడవ కూర్పు 8,000 ప్రతులు

రాజమండ్రి

బ్రౌన్ క్రిస్టియన్ ముద్రాశాలయందు ముద్రితము

1930

సమస్తమును మర్యాదగాను క్రమముగాను
జరుగనియ్యుడి.  I కొరింతి 14:40.

# పీ ఠి క

ఈ యారాధన క్రమము క్రొత్తది కాదు. ఇది ఎవాంజెలికల్ లూథరన్ సంఘము చిర కాలమునుండి ఉపయోగించుచున్నదియే. ఇటీవల అమెరికా దేశమునందు ఐక్యపడిన లూథరన్ సంఘపు బోర్డువారు ఆంగ్లేయ భాషలో ప్రచురించిన సంఘారాధన పుస్తకము ననుసరించి ఆంధ్ర ఎవాంజెలికల్ లూథరన్ సంఘమువా రేర్పరచిన కమిటీ వారిచే నిది తర్జుమా చేయబడెను. సభికు లందఱును గ్రహింపనట్లు కమిటీ వారు సాధ్యమైనంత సులభశైలి నుపయోగించుటకు ప్రయత్నించిరి.

దీనిలోని కీర్తనలు, ముఖ్యముగా రాజమండ్రి-గుంటూరు మిషనుల యందు వాడుకలో నున్న గ్రంథముల నుండియు, కొన్ని మాత్రము ఇతర గ్రంథముల నుండియు ఎత్తి వ్రాయబడినవి. కీర్తనలను రచించిన వారి పేరులు తెలిసినంత మట్టుకు కీర్తనల పుస్తకము చివర నుదహరింపబడినవి. తాము రచించినట్టియు, తర్జుమా చేసినట్టియు కీర్తనలను ఈ గ్రంథమున వాడుకొన నిచ్చిన వారికి మా హృదయపూర్వక వందనములు.

ఈ యారాధన క్రమము మానవ హృదయములందు భక్తి, ఆవేశములను కలిగించు ననుటకు సందియ ముండదు. మన సంఘము లీ గ్రంథమును సద్వినియోగము చేసికొనుచు ఆత్మీయ జీవనమునందు పెంపొంది సర్వ విధముల వృద్ధి నొందునట్లు దేవు డనుగ్రహించు గాక!



# ఆరాధన క్రమముల విషయ సూచిక

# ముఖ్యారాధన క్రమము.

———o:o———

¶ సభ నిలువబడి యుండగ బోధకుడు చెప్పవలసినది :

తండ్రి యొక్కయు, కుమారుని యొక్కయు, పరిశుద్ధాత్మ యొక్కయు నామమున.

¶ సభ చెప్పవలసినది లేక పాడవలసినది :

ఆమేన్.

## పాపపు టొప్పుదల.

¶ బోధకుడు చెప్పవలసినది :

ప్రభువునందు ప్రియులారా! యథార్థహృదయముతో మన తండ్రియైన దేవుని సమీపించి, ఆయన యెదుట మన పాపముల నొప్పుకొని, మన ప్రభువైన యేసు క్రీస్తు పేరిట మనకు క్షమాపణ దయచేయుమని వేడుకొందము.

¶ అందఱు మోకరించి లేక నిలువబడి యీ క్రింది వాక్యములు చెప్పవలెను లేక పాడవలెను.

బోధకుడు—ప్రభువు నామము వలననే మనకు సాహాయ్యము కలుగుచున్నది.

సభ—భూమ్యాకాశములను సృజించినవాడు ఆయనే.

బో—ప్రభువు సన్నిధిని నా యతిక్రమములు నే నొప్పుకొందు ననుకొంటిని.

సభ—నీవు నా పాపదోషమును పరిహరించి యున్నావు.

¶ అంతట బోధకు డిట్లు చెప్పవలెను:

మా సృష్టికర్తవు విమోచకుడవు నైన సర్వశక్తిగల దేవా! బీదపాపుల మగు మేము స్వాభావికముగా పాపుల మనియు, అపవిత్రులమనియు తలంపువలన మాటవలన క్రియ వలన నీకు విరోధముగా పాపము చేసితిమనియు, నీ యెదుట ఒప్పుకొనుచున్నాము; కావున, మేము మా ప్రభువైన యేసు క్రీస్తు నిమిత్తమున నీ కృపను వెదకుచు వేడుకొనుచు మితిలేని కనికరము గల నీ యొద్దకు ఆశ్రయమునకై వచ్చుచున్నాము.

¶ సభ బోధకునితో కలసి ఇట్లు చెప్పవలెను

మా కొఱకు చనిపోవుటకై నీ జనితైక కుమారుని నిచ్చిన మిగుల కరుణగల దేవా! మమ్మును కనికరించి ఆయన నిమిత్తమున మా సమస్త పాపములకు క్షమాపణ దయ చేయుము. మేము నీ కృపచేత నిత్యజీవము పొందునట్లు నిన్ను గూర్చియు నీ చిత్తమును గూర్చియు సరియైన జ్ఞానమును నీ వాక్యమునకు తగిన విధేయతను మాయందు నీ పరిశుద్ధాత్మవలన వృద్ధిపొందింపుమని మా ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ అంతట బోధకుడిట్లు చెప్పవలెను :

మన పరలోకపు తండ్రియగు సర్వశక్తిగల దేవుడు మనలను కనికరించి మనకొరకు చనిపోవుటకై తన యేక కుమారునిచ్చి ఆయన మూలమున మన పాపము లన్నిటిని క్షమించుచున్నాడు. ఆయన నామమందు విశ్వాస ముంచువారికి దేవుని కుమారులగుటకు అధికార మిచ్చుచు వారికి తన పరిశుద్ధాత్మ ననుగ్రహించును. నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షింపబడును. ఓ ప్రభువా, ఈ రక్షణను మా యందరికి దయచేయుము.

¶ సభ యిట్లు చెప్పవలెను లేక పాడవలెను :

ఆమేన్.

¶ ప్రారంభ గీతము మొదలుకొని సంగ్రహ ప్రార్థనాంతమువరకు సభ నిలువబడి యుండవలెను

## ప్రారంభ గీతము.

¶ ప్రారంభ గీతము తరువాత గ్లోరియ పాట్రి పాడవలెను లేక చెప్పవలెను

## *Gloria Patri.*

## త్రైకుని మహిమ.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును ఆదియందు, ఇప్పుడు, ఎల్లప్పుడు, యుగయుగములందుండునట్లు మహిమ కలుగు గాక. ఆమేన్.

¶ అంతట కిరియె పాడవలెను లేక చెప్పవలెను.

## *Kyrie.*

## ప్రభుని కనికరము.

బో—ప్రభువా! మమ్మును కనికరింపుము.

స—ప్రభువా! మమ్మును కనికరింపుము.

బో—క్రీస్తూ! మమ్మును కనికరింపుము.

స—క్రీస్తూ! మమ్మును కనికరింపుము.

బో—ప్రభువా! మమ్మును కనికరింపుము.

స—ప్రభువా! మమ్మును కనికరింపుము.

¶ అంతట గ్లోరియ ఇన్ ఎక్సెల్‌సిస్ అనునది పాడవలెను.

## *Gloria in Excelsis.*

## సర్వోన్నతుని మహిమ.

¶. బోధకుడు చెప్పవలసినది :

సర్వోన్నతమైన వానిలో దేవుని మహిమ.

¶ సభ పాడవలసినది :

సర్వోన్నతమైన వానిలో దేవునికి మహిమయు భూమి మీద సమాధానమును మనుష్యులయందు కటాక్షమును కలుగుగాక. ఓ ప్రభువైన దేవా! పరలోకపు రాజా! సర్వ శక్తిగల తండ్రివగు దేవా! మేము నిన్ను స్తుతించు చున్నాము. మేము నిన్ను అభినందించు చున్నాము.

మేము నిన్ను ఆరాధించు చున్నాము. మేము నిన్ను మహిమపరచు చున్నాము. నీ గొప్ప మహిమనుబట్టి మేము నీకు వందనములు చేయుచున్నాము.

ఓ ప్రభువా! జనితైక కుమారుడవైన యేసు క్రీస్తూ! ఓ ప్రభువైన దేవా! దేవుని గొఱ్ఱెపిల్లా! తండ్రియైన దేవుని కుమారుడా! లోకపాపమును మోసికొనిపోవు నీవు మమ్మును కనికరింపుము. లోకపాపమును మోసికొనిపోవు నీవు మా ప్రార్థన నంగీకరింపుము. తండ్రియగు దేవుని కుడిచేతివైపున కూర్చుండి యుండు నీవు మమ్మును కనికరింపుము.

నీవే పరిశుద్ధుడవు. నీవే ప్రభుడవు. ఓ క్రీస్తూ! నీవే పరిశుద్ధాత్మతో తండ్రియగు దేవుని మహిమలో సర్వోన్నతుడవై యున్నావు. ఆమేన్.

¶ అంతట బోధకుడు చెప్పవలసినది :

ప్రభువు మీతో నుండుగాక.

¶ సభ పాడవలసినది లేక చెప్పవలసినది :

మీ యాత్మతో నుండుగాక.

¶ బోధకుడు చెప్పవలసినది :

ప్రార్థింతము.

¶ అంతట బోధకుడు ఆ దినమునకయిన సంగ్రహ ప్రార్థన చేయవలెను.

## సంగ్రహ ప్రార్థన.

¶ ప్రార్థన ముగియగానే సభ పాడవలసినది లేక చెప్పవలసినది :

ఆమేన్.

¶ అంతట బోధకుడు ఆ దినమునకయిన పత్రిక పాఠమును గూర్చి యిట్లు తెలుపవలెను :

(ఇచట దినము యొక్క పేరు చెప్పవలెను)........కు ఏర్పఱుపబడిన పత్రిక పాఠము..............వ్రాసిన పత్రిక ..........వ అధ్యాయము.......వ వచనము మొదలుకొని వ్రాయబడి యున్నది.

## పత్రిక పాఠము.

¶ పత్రిక పాఠము చదివి ముగింపగానే బోధకుడు చెప్పవలసినది :

ఇంతటితో పత్రిక పాఠము ముగిసెను.

¶ అంతట ఉన్నతాసన గీతము (*Gradual*) పాడవచ్చును

లేక హల్లెలూయా అను గీతము పాడవలెను.

## హల్లెలూయా *

ప్రభుని శ్రమ (లెంటు) కాలములో హల్లెలూయా పాడకూడదు.

¶ అంతట బోధకుడు ఆ దినముకొరకైన సువార్త పాఠమునుగూర్చి యిట్లు తెలుపవలెను :

.............కు ఏర్పరుపబడిన సువార్త పాఠము పరిశుద్ధుడైన......వ్రాసిన సువార్త.......వ అధ్యాయము .......వ వచనము మొదలుకొని వ్రాయబడి యున్నది.

---

* 16 వ పుట చూడుము

¶ అంతట సభ నిలువబడి ఈ క్రింది వచనము పాడవలెను లేక చెప్పవలెను :

ఓ ప్రభువా ! నీకు మహిమ కలుగుగాక.

¶ అంతట బోధకుడు ఆ దినమునకైన సువార్త పాఠమును చదువవలెను.

¶ సువార్త పాఠమును చదివి ముగింపగానే బోధకుడు చెప్పవలసినది

ఇంతటితో సువార్త పాఠము ముగిసెను.

¶ అంతట సభ ఈ క్రింది వచనము పాడవలెను :

ఓ క్రీస్తూ ! నీకు స్తోత్రము కలుగుగాక.

¶ అంతట అందరు విశ్వాస ప్రమాణము చెప్పవలెను.

## విశ్వాస ప్రమాణము.

### నికేయ విశ్వాస ప్రమాణము.

భూమ్యాకాశములను దృశ్యాదృశ్యములగు సమస్తమును సృజించిన సర్వశక్తిగల తండ్రియగు ఏకదేవుని నేను నమ్ముచున్నాను.

ఆయన జనితైక కుమారుడును అద్వితీయుడునగు ప్రభువైన యేసు క్రీస్తును నమ్ముచున్నాను. ఈయన జగములన్నిటికి ముందు తండ్రినుండి కలిగినవాడును దేవునినుండి దేవుడును వెలుగునుండి వెలుగును నిజమైన దేవునినుండి నిజమైన దేవుడును సృజింపబడక జన్మించిన వాడును తండ్రితో ఏక తత్వము గలవాడును సమస్తమును కలుగజేసినవాడునయి యున్నాడు. ఈయన మానవుల మగు మనకొరకును మన రక్షణకొరకును

పరలోకమునుండి దిగి కన్యయగు మరియనుండి పరిశుద్ధాత్మ వలన అవతరించి పుట్టి మనుష్యుడాయెననియు పొంతి పిలాతు అధికారము క్రింద మనకొఱకు సిలువవేయబడి శ్రమ నొంది సమాధి చేయబడెననియు లేఖనముల ప్రకారము మూడవ దినమున తిరిగి లేచి పరలోకమున కెక్కి తండ్రియొక్క కుడి చేతి వైపున కూర్చుండియున్నాడనియు సజీవులకును మృతుల కును తీర్పుచేయుటకు తిరిగి మహిమతో వచ్చుననియు ఆయన రాజ్యమునకు అంతము లేదనియు నమ్ముచున్నాను.

తండ్రినుండియు కుమారునినుండియు బయలువెడలుచు తండ్రితోను కుమారునితోను ఏకముగా ఆరాధింపబడుచు మహిమపఱుపబడుచు ప్రవక్తల ద్వారా మాట్లాడినవాడును జీవమునకు దాతయు ప్రభువునగు పరిశుద్ధాత్మను నమ్ము చున్నాను. మఱియు పరిశుద్ధమైన క్రైస్తవ అపొస్తలుల యేక సంఘమును నమ్ముచున్నాను. పాపపరిహారమునకైన ఒకే బాప్తిస్మము నొప్పుకొనుచు మృతుల పునరుత్థానము కొఱకును రాబోవు లోకసంబంధమగు బ్రతుకు కొఱకును నిరీక్షించుచున్నాను. ఆమేన్.

## అపొస్తలుల విశ్వాస ప్రమాణము.

భూమ్యాకాశములను సృజించిన సర్వశక్తిగల తండ్రి యగు దేవుని నేను నమ్ముచున్నాను.

ఆయన ఏక కుమారుడును మన ప్రభువు నైన యేసు క్రీస్తును నమ్ముచున్నాను. ఈయన పరిశుద్ధాత్మ వలన గర్భమున ధరింపబడి కన్యయైన మరియకు పుట్టి, పొంతి పిలాతు అధికారముక్రింద శ్రమపడి సిలువ వేయబడి చనిపోయి సమాధి చేయబడెననియు, అస్పృశ్యలోకములోనికి దిగెననియు, చనిపోయిన వారిలోనుండి మూడవ దినమున లేచి పరలోకమున కెక్కి సర్వశక్తిగల తండ్రియగు దేవుని కుడిచేతి వైపున కూర్చుండి యున్నాడనియు, సజీవులకును మృతులకును తీర్పు చేయుటకు అక్కడనుండి వచ్చుననియు నమ్ముచున్నాను.

పరిశుద్ధాత్మను నమ్ముచున్నాను. పరిశుద్ధ క్రైస్తవ సంఘమును పరిశుద్ధుల సహవాసమును, పాపక్షమాపణయు, శరీర పునరుత్థానమును, నిత్య జీవమును, ఉన్నవని నమ్ముచున్నాను. ఆమేన్.

¶ అంతట కీర్తన పాడవలెను

### కీర్తన.

¶ దీనికి తరువాత ప్రసంగము చేయవలెను.

### ప్రసంగము.

¶ ప్రసంగము ముగింపగానే సభ నిలువబడి యుండగా బోధకు డిట్లు చెప్పవలెను :

సమస్త జ్ఞానమునకు మించిన దేవుని సమాధానము యేసు క్రీస్తువలన మీ హృదయములకును మీ తలంపులకును కావలి యుండును గాక.

¶ అంతట సభ ఈ దిగువ యర్పణ కీర్తనలలో నొకదానిని లేక తగిన మరి యే యర్పణ కీర్తన నైనను పాడి కూర్చుండవలెను

## అర్పణ కీర్తనలు.

### I

విరిగిన మనస్సే దేవుని కిష్టమైన బలులు. దేవా, విరిగి నలిగిన హృదయమును నీవు అలక్ష్యము చేయవు.

నీ కటాక్షము చొప్పున సీయోనుకు మేలుచేయుము. యెరూషలేము యొక్క గోడలను కట్టించుము.

అప్పుడు నీతి యుక్తములైన బలులును దహన బలులును సర్వాంగ హోమములును నీకు అంగీకృతము లగును.

### II

దేవా, నాయందు శుద్ధ హృదయము కలుగ జేయుము.

నా అంతరంగములో స్థిరమైన మనస్సును నూతనముగా పుట్టించుము.

నీ సన్నిధిలోనుండి నన్ను త్రోసివేయకుము.

నీ పరిశుద్ధాత్మను నా యొద్దనుండి తీసివేయకుము.

నీ రక్షణానందము నాకు మరల పుట్టించుము.

సమ్మతిగల మనస్సు కలుగజేసి నన్ను దృఢపరచుము.

¶ అంతట కానుకలను సమకూర్చిన పిమ్మట బోధకుడు వాని నందుకొని వేదికపైన ఉంచవలెను

## కానుకలు.

¶ అంతట ముఖ్య ప్రార్థన చేయవలెను. దీనిలోని ప్రతిభాగము చివరను సభ:
“దయగల ప్రభువా! మా ప్రార్థన నాలకించుమని నిన్ను వేడుకొనుచున్నాము” అని చెప్పవచ్చును. బోధకుడు “ప్రార్థింతము” అని చెప్పవలెను

## ముఖ్య ప్రార్థన.

సర్వశక్తియు మిగుల కనికరమునుగల దేవా! మా ప్రభువైన యేసు క్రీస్తు యొక్క తండ్రీ! నీవు మా కనుగ్రహించుచున్న మేళ్ళన్నిటి నిమిత్తమును మాయెడల నీకు గల కరుణా వాత్సల్యము నిమిత్తమును నిన్ను స్తుతించుచున్నాము. ముఖ్యముగా నీ ప్రియకుమారుని మాకొఱ కిచ్చినందుకును నీ చిత్తమును కృపను మాకు బయలుపరచినందుకును నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాము. మేము యథార్థమైన మంచి హృదయములతో నీ వాక్యమును అంగీకరించి భద్రపరచుకొని సత్క్రియను ఓపికతో చేయుచు ఫలమిచ్చునట్లు దానిని మాలో నాటింపుమని నిన్ను వేడుకొనుచున్నాము.

రక్షణ కలిగించెడు నీ వాక్యమందలి పవిత్రమైన బోధయందు నీ సార్వత్రిక సంఘమును కాపాడి యేలుమనియు, అందువలన నీయందు మాకు గల విశ్వాసము

బలపడి, సకల జనుల యెడల మాలో ప్రేమ వృద్ధి పొందున ట్లనుగ్రహింపుమనియు మిగుల మనఃపూర్వకముగా నిన్ను వేడుకొనుచున్నాము.

నీ వెలుగును నీ సత్యమును భూదిగంతముల వరకు వ్యాపింపజేయుము. మా స్వజనులకును సకల జనాంగములకును నీ సువార్తను ప్రకటించుటకు సమర్థులైన గురువులను బోధకులను ప్రతిష్ఠించి వారి పను లన్నిటియందును వారిని నడిపించి కాపాడి అభివృద్ధి కలుగ జేయుము.

సంఘమునకు సంబంధించిన శాస్త్ర పాఠశాలలను, వేదాంత పాఠశాలలను, ఇతర పాఠశాలలను దీవించుము. వానినుండి వాక్యసేవయందును, రోగులకు కష్టములలో నుండువారికి బీదలకు పరిచర్య చేయుటయందును, జీవనోపాయము లన్నిటియందును నిన్ను సేవించు స్త్రీ పురుషులు బయలువెడలున ట్లనుగ్రహింపుమని వినయముతో వేడుకొనుచున్నాము.

నీ వాక్యమను వెలుగు మా గృహములయందు నిరంతరము ప్రకాశింప నిమ్ము. పరిశుద్ధ బాప్తిస్మమునందు నీవు బిడ్డలతో చేసిన యొడంబడికను వారు నిలుపుకొనునట్లు సంఘపు బిడ్డలందరిని కాపాడుము. వారిని నీయందు విశ్వాసము గల వారినిగను నీ చిత్తము ననుసరించి నడుచుకొను వారినిగను పెంచునట్లు తలిదండ్రు లందరికి నీ కృప ననుగ్రహింపుము.

అధికారులు లంకతికి ముఖ్యముగా ఏలిన జార్జి చక్రవర్తి గారికిని, రాజప్రతినిధిగారికిని, గవర్నర్లకును, శాసన నిర్మాణ సభకును, న్యాయాధిపతులు, మేజస్ట్రీటులు వీరి కందరికిని క్షేమమును ఆరోగ్యమును అనుగ్రహించుము. మేము సంపూర్ణ దైవభక్తియు యథార్థతయు కలిగి సమాధానముతో నెమ్మదిగ జీవించునట్లు వారు దుర్మార్గుల నాటంకపరచి శిక్షించి, నీతి న్యాయములను నిలువబెట్టి దివ్యమైన నీ చిత్త పరికారము ఏలునట్లు వారికి నీ కృప ననుగ్రహింపుము.

ఓ దేవా! ఇబ్బంది, రోదన, వ్యాధి, పరిస్థితి, మరణాపాయము అను హానిలోనైనను మరి యే విధమైన ఆపదలోనైన నున్న వారందఱును, ముఖ్యముగా నీ నామము నిమిత్తమును నీ సత్యము నిమిత్తమును శ్రమపడుచున్నా వారు తమ బాధలు తండ్రి భావముగల నీ చిత్తము ననుసరించి కలిగినవేయని తెలిసికొని సహించుకొనునట్లు వారిని నీ పరిశుద్ధాత్మచేత ఆదరింపుము.

ఓ మిగుల కరుణగల తండ్రీ! నీ న్యాయమైన కోపమునకును అనేక దండనలకును మేము పాత్రులమైనను మా బాల్యకాల పాపములను గాని అనేకములగు మా యతిక్రమములను గాని జ్ఞాపక ముంచుకొనక శరీరాత్మలకు కలుగు హానినుండియు, అపాయమునుండియు చెప్పశక్యముకాని నీ

దయను కృపను కనికరమును బట్టి మమ్మును కాపాడుమని నిన్ను వేడుకొనుచున్నాము.

నాశకరమైన తప్పు బోధన నుండియు, యుద్ధము, తెగులు, అగ్నివలన నీటివలన కలుగు ఉపద్రవము, వడగండ్లు, గాలివాన, పంటనష్టము, కరవు, మనోవేదన, దుర్మరణము అను వానినుండియు మమ్మును కాపాడి, నీ కృపను గూర్చి నిరాశ జెందకుండునట్లు మమ్మును నడిపించుము. కష్టకాలమందెల్లను సకల జనులకు ముఖ్యముగా నిన్ను నమ్మువారికి తాత్కాలిక సహాయకుడవుగాను రక్షకుడవుగాను కనబఱచుకొనుము.

యుక్తకాలమందు ఆవశ్యకమైన భూఫలములను మేమనుభవించునట్లు వానిని వృద్ధి పొందింపుము. భూమిమీదను నీటిమీదను జరుగు న్యాయమైన వృత్తులన్నిటిని, పవిత్రమైన విద్యలన్నిటిని, ఉపయోగకరమైన జ్ఞానమును వికసింపజేసి యాశీర్వదింపుము.

[ ఇచట విశేష మనవులు, ఇతరుల కొఱకయిన మనవులు, ప్రార్థనలు చేయవచ్చును

ఓ దేవా! ఈ మా మనవులను ఇంకను మేము నీ చిత్తప్రకారము నిన్ను అడుగవలసిన వాటిని నీతోను పరిశుద్ధాత్మతోను సదా ఏక దేవుడై యుగయుగములు జీవించుచు పరిపాలించుచు నుండు నీ అద్వితీయ కుమారుడును

మా ప్రభువును రక్షకుడునైన యేసు క్రీస్తు యొక్క ఘోర శ్రమ మరణములను బట్టి మాకు దయచేయుమని నిన్ను వేడుకొనుచున్నాము.

¶ అంతట బోధకుడును సభయు కలిసి ప్రభువు ప్రార్థన చెప్పవలెను.

## ప్రభువు ప్రార్థన.

పరలోకమందున్న మా తండ్రీ, నీ నామము పరిశుద్ధపరచబడుగాక; నీ రాజ్యము వచ్చుగాక. నీ చిత్తము పరలోకమందు నెఱవేఱుచున్నట్లు భూమియందును నెఱవేఱుగాక. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. మా యెడల అపరాధములను చేసిన వారిని మేము క్షమించియున్న ప్రకారము మా యపరాధములను క్షమించుము. శోధనలోకి తేక కీడునుండి మమ్ములను తప్పించుము. రాజ్యమును బలమును మహిమయు నిరంతరము నీవియై యున్నవి. ఆమేన్.

¶ అంతట ఒక కీర్తన పాడవలెను.

## కీర్తన.

¶ ప్రభు భోజన సంస్కారము జరిగింపని యెడల బోధకుడు వేదికయొద్ద నిలువబడి దీవన నుచ్చరింపవలెను

## దీవెన.

ప్రభువు నిన్ను ఆశీర్వదించి నిన్ను కాపాడుగాక.
ప్రభువు నీకు తన సన్నిధిని ప్రకాశింపజేసి నిన్ను కరుణించుగాక.
ప్రభువు నీమీఁద తన సన్నిధి కాంతి నుదయింపజేసి నీకు
సమాధానము కలుగ జేయు గాక.

¶ అంతట సభ యిట్లు పాడవలెను లేక చెప్పవలెను.

ఆమేన్

## * హల్లెలూయా పాటయును వచనములును

క్రీస్తు రాకడ

హల్లెలూయా ! ఓ ప్రభువా ! యుగయుగములనుండి యుండిన నీ జాలిగల కనికరములను జ్ఞప్తికి తెచ్చుకొనుము. హల్లెలూయా !

క్రీస్తు జననము

ప్రభువు సన్నిధని ఆకాశము సంతోషించు గాక. భూమి ఆనందించు గాక. ఎందుకనిన యెహోవా తన రక్షణ వెల్లడిచేసియున్నాడు.

ప్రత్యక్షత (ఎపిఫానియ)

హల్లెలూయా ! సకలరాష్ట్రములారా, ప్రభువును స్తుతించుడి. ప్రజలారా, ఆయనను కొనియాడుడి.

మనయెడల నున్న ఆయన కృప అధికము. ఆయన సత్యము నిరంతర ముండును. హల్లెలూయా !

### శ్రమ కాలము

మరణము పొందునంతగా అనగా సిలువ మరణము పొందునంతగా విధేయత చూపినవాడై క్రీస్తు తన్ను తాను తగ్గించుకొనెను.

### పునరుత్థానము

హల్లెలూయా! మన పస్కా-యగు క్రీస్తు మనకొరకై యర్పింపబడెను. హల్లెలూయా!

### పరిశుద్ధాత్ముని రాకడ

హల్లెలూయా! నీవు నీ యాత్మను పంపుచున్నావు: అవి సృజింపబడెను. మరియు నీవు భూముఖమును నూతనపరతువు. హల్లెలూయా!

### త్రైకత్వము

హల్లెలూయా! ఓ ప్రభువా, నీ కృప చొప్పున నీ సేవకుని యెడల జరిగింపుము. నీ కట్టడలు నాకు బోధింపుము.

నేను నీ సేవకుడను నీ విధులను తెలిసికొనుటకై నాకు బుద్ధిని దయచేయుము. హల్లెలూయా!

### లేక

హల్లెలూయా! దేవుడగు యెహోవా వందింపబడును గాక. ఆయనను స్తుతించి నిరంతరము ఆయనను మిగుల ఘనపరచుడి. హల్లెలూయా!



# ప్రభు రాత్రి భోజన సంస్కారము.

—— o:o ——

¶ ప్రభు రాత్రి భోజన సంస్కారము సాగించు సమయమున కీర్తన పాడుచుండగా బోధకుడు వేదిక యొద్దకు వెళ్లి నిశ్శబ్దముగ ప్రార్థన చేసికొని పాత్రలపై వస్త్రమును తీసి పరిశుద్ధ సంస్కారము జరుపుటకు భక్తిపూర్వకముగ సిద్ధపరచవలెను

¶ సభ లేచి దేవుని గొఱ్ఱెపిల్ల అను గీతము ముగియువరకు నిలువబడి యుండవలెను

## ప్రారంభము.

¶ బోధకుడు చెప్పవలసినది:

ప్రభువు మీతో నుండును గాక.

¶ సభ పాడవలసినది లేక చెప్పవలసినది:

మీ యాత్మతో నుండును గాక.

బో—మీ హృదయములను పైకెత్తుడి.

స—ప్రభువు తట్టు మేము వాటిని ఎత్తుచున్నాము.

బో—మన దేవుడైన ప్రభువునకు కృతజ్ఞతా స్తోత్రములు చెల్లింతము.

స—ఆలాగు చేయుట తగినదియు సరియైనదియునై యున్నది.

‖ అంతట బోధకుడు వేదికవైపు తిరిగి చెప్పవలసినది:

ఓ ప్రభువా! పరిశుద్ధుడవైన తండ్రీ! సర్వశక్తిగల నిత్యుడవైన దేవా! మేము సర్వదా సర్వత్ర నీకు కృతజ్ఞతా స్తుతులు చెల్లించుట నిజముగా తగినదియును సరియును హితమునై యున్నది.

¶ ఇచ్చట ఆయా సమయములకు కొరకు ఏర్పరచబడిన ప్రారంభ వాక్యములను వాడవలెను.

## ప్రారంభ వాక్యములు.

### క్రీస్తు జననము

మాకొరకు నీ వాక్యము శరీరధారియైన మర్మమందు నీ మహిమను నూతనముగ బయలుపరచితివి గనుక నీ కుమారుని స్వరూపమందు నిన్ను మేము చూచి గోచరముకాని విషయములను మేము ప్రేమించి వాటివలన ఆకర్షింపబడగలము. కాబట్టి దూతలతోను మొ॥

### క్రీస్తు ప్రకటన కాలము.

మాకొరకు నీ జనితైక కుమారుని పంపినందుకును ఆయనయందు మానవుడవుగా కనబడి నీ పూర్ణ మహిమను బయలుపరచినందుకును నీకు స్తోత్రములు చెల్లించుచున్నాము. కాబట్టి దూతలతోను మొ॥

### క్రీస్తు శ్రమ కాలము.

దేనివలన మరణము కలిగెనో దానివలననే జీవము కలుగునట్లును, ఒకప్పుడు మ్రానిచేత జయించిన వానిని మ్రానిచేతనే జయింపబడునట్లును సిలువ మ్రానిమీద మా ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా మానవులకు రక్షణ క్రియ చేసినావు. కాబట్టి ఆయన ద్వారా దూతలతోను మొ॥

### క్రీస్తు పునరుత్థానము

ముఖ్యముగా నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తుయొక్క మహిమగల పునరుత్థానమునుబట్టి నిన్ను స్తుతించుటకు బద్ధులమై యున్నాము. ఎందుచేత ననిన మా కొఱకై అర్పింపబడి లోక పాపములను మోసికొని పోయిన పస్కా గొఱ్ఱెపిల్ల ఆయనే. ఆయన తన మరణమువలన మరణమును నశింపజేసి తన పునరుత్థానమువలన మాకు నిత్య జీవమును దయచేసి యున్నాడు. కాబట్టి దూతలతోను మొ॥

### ఆరోహణ పండుగ

మా ప్రభువైన యేసు క్రీస్తుద్వారా యీ కృతజ్ఞత స్తుతులు చెల్లించుచున్నాము. ఆయన చనిపోయి లేచిన తరువాత తన శిష్యులందరికి బాహాటముగా కనబడి తన దేవ స్వభావమునందు మమ్మును పాలివారలనుగా జేయు నిమిత్తము వారు చూచుచుండగా పరలోకమున కెక్కి పోయెను. కాబట్టి దూతలతోను మొ॥

పరిశుద్ధాత్మని రాకడ.

నీ ప్రియకుమారుడును మా ప్రభువును రక్షకుడునైన యేసుక్రీస్తుద్వారా ఈ కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాము. ఆయన పరలోకమున కెక్కి నీ కుడిచేతివైపున కూర్చుండి తాను వాగ్దానము చేసిన ప్రకారముగా ఏర్పరచుకొనిన శిష్యులమీద ఈ దినముననే పరిశుద్ధాత్మను కుమ్మరించెను. అందువలన సర్వలోకమును అత్యధికముగా ఆనందించుచున్నది. కాబట్టి దూతలతోను మొ

త్రిత్వపు పండుగ.

నీవు నీ జనితైక కుమారునితోను పరిశుద్ధాత్మతోను ఏక దేవుడవును ఏక ప్రభుడవునై యున్నావు నిజమైన దేవుడొక్కడే యని మేమొప్పుకొనుచు తత్వమునందొక్కడవుగాను మహిమయందు భేదము లేకను పురుషత్వమునందు ముగ్గురుగా నున్నవాడవైన నిన్ను ఆరాధించుచున్నాము. కాబట్టి దూతలతోను మొ॥

ప్రారంభ వాక్యము ముగిసిన వెంటనే ఈ క్రింది వచనము చెప్పవలెను

కాబట్టి దూతలతోను ప్రధానదూతలతోను పరలోకసైన్య సమూహములతోను నీ మహిమగల నామమును మేము కొనియాడి, ఘనపరచి సదా నిన్ను ఇట్లు స్తుతించుచున్నాము.

¶ అంతట ‚‚పరిశుద్ధము,, అను గీతము పాడవలెను లేక చెప్పవలెను.

పరిశుద్ధము.

పరిశుద్ధుడా! పరిశుద్ధుడా!! పరిశుద్ధుడా!!! సైన్యముల ప్రభుడవగు దేవా! ఆకాశమును భూమియు నీ మహిమతో నిండియున్నవి. సర్వోన్నతమైన వానిలో హోసన్నా, ప్రభువు పేరిట వచ్చువాడు స్తుతింపబడుగాక. సర్వోన్నతమైనవానిలో హోసన్నా.

## ప్రభువు ప్రార్థన.

¶ అంతట బోధకుడు (మాత్రము) ఇట్లు చెప్పవలెను:

ప్రార్థింతము.

పరలోకమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధపఱచబడుగాక. నీ రాజ్యము వచ్చుగాక. నీ చిత్తము పరలోకమందు నెఱవేఱుచున్నట్లు భూమియందును నెఱవేఱుగాక. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. మా యెడల అపరాధములను చేసిన వారిని మేము క్షమించి యున్న ప్రకారము మా యపరాధములను క్షమించుము. శోధనలోనికి తేక కీడునుండి మమ్ములను తప్పించుము. రాజ్యమును బలమును మహిమయు నిరంతరము నీవియై యున్నవి.

¶ అంతట సభ ఇట్లు పాడవలెను లేక చెప్పవలెను.

ఆమేన్.

¶ అంతట బోధకుడు సంస్కారాగ నియమపు వాక్యములను చెప్పవలెను.

## నియమపు వాక్యములు.

మన ప్రభువైన యేసు తా నప్పగింపబడిన రాత్రి రొట్టెను తీసికొని† స్తోత్రము చేసి, దానిని విరిచి తన శిష్యుల కిచ్చి, మీరు పుచ్చుకొని తినుడి. ఇది మీకొఱ కియ్యబడుచున్న నా శరీరమై యున్నది. నన్ను జ్ఞాపకము చేసికొనుటకు దీని చేయుడని చెప్పెను.

† ఇచ్చట రొట్టెయున్న పళ్ళెము తన చేతితో పట్టుకొనవలెను

ఆ ప్రకారమే భోజనమైన పిమ్మట ఆయన పాత్రను తీసికొని† స్తోత్రము చేసి, దాని వారి కిచ్చి, దీనిలోనిది మీరందఱు త్రాగుడి. ఈ పాత్ర పాపపరిహారము కలుగుటకై మీకొఱకును అనేకుల కొఱకును చిందింపబడుచున్న నా రక్తము వలననైన క్రొత్త నిబంధనమై యున్నది. మీరు దీని త్రాగు నప్పుడెల్ల నన్ను జ్ఞాపకము చేసికొనుటకు దీని చేయుడని చెప్పెను.

† ఇచట పాత్రను తన చేతితో పట్టుకొనవలెను.

¶ అంతట బోధకుడు సభవైపు తిరిగి ఇట్లు చెప్పవలెను:

ప్రభువుయొక్క సమాధానము ఎల్లప్పుడు మీతో నుండుగాక.

¶ సభ ఇట్లు పాడవలెను లేక చెప్పవలెను:

ఆమేన్.

## సంఘారాధన పుస్తకము

¶ అంతట "దేవుని గొఱ్ఱెపిల్ల" అను గీతము పాడవలెను లేక చెప్పవలెను:

దేవుని గొఱ్ఱెపిల్ల

లోకపాపమును మోసికొని పోవు దేవుని గొఱ్ఱెపిల్ల
వైన ఓ క్రీస్తూ! మమ్మును కనికరింపుము.
లోకపాపమును మోసికొని పోవు దేవుని గొఱ్ఱెపిల్ల
వైన ఓ క్రీస్తూ! మమ్మును కనికరింపుము.
లోకపాపమును మోసికొని పోవు దేవుని గొఱ్ఱెపిల్లవైన
ఓ క్రీస్తూ! నీ సమాధానము మాకు దయచేయుము. ఆమేన్

¶ అంతట ప్రభు భోజనము పుచ్చుకొను వారు వేదికయొద్దకు వచ్చి పరిశుద్ధ సంస్కారములో పాలు పొందుదురు.

### పరిశుద్ధ సంస్కారాచరణము.

¶ బోధకుడు రొట్టె నిచ్చునపు డిట్లు చెప్పవలెను:

పుచ్చుకొని తినుము. ఇది నీ కొరకు కియ్యబడిన క్రీస్తు శరీరము

¶ బోధకుడు పాత్ర నిచ్చునపు డిట్లు చెప్పవలెను:

పుచ్చుకొని త్రాగుము. ఇది నీ పాపములకై చిందింప
బడిన క్రొత్త నిబంధన రక్తము.

¶ రొట్టెను పాత్రను ఇచ్చినపిమ్మట బోధకు డిట్లు చెప్పవలెను:

మన ప్రభువైన యేసు క్రీస్తు శరీరమును ఆయన వె
లేని రక్తమును మిమ్మును నిజమైన విశ్వాసమునందు బలపరి
నిత్య జీవము కలుగుటకై సంరక్షించుగాక.

¶ అంతట సభ నిలువబడి ‹‹సెలవు గీతము›› పాడవలెను లేక చెప్పవలెను.

సెలవు గీతము.

నాథా! ఇప్పుడు నీ మాటచొప్పున సమాధానముతో నీ దాసుని పోనిచ్చుచున్నావు. అన్యజనులకు నిన్ను బయలు పఱచుటకు వెలుగుగాను నీ ప్రజలైన ఇశ్రాయేలునకు మహిమ గాను నీవు సకల ప్రజల యెదుట సిద్ధపఱచిన నీ రక్షణ నేను కన్నులార చూచితిని.

తండ్రికిని కుమారునికి పరిశుద్ధాత్మకును ఆదియందు, ఇప్పుడు, ఎల్లప్పుడు, యుగయుగములందు నుండునట్లు మహిమ కలుగుగాక. ఆమేన్.

¶ అంతట ‹‹వందనార్పణము›› చెప్పవలెను

వందనార్పణము.

బో—యెహోవా దయాళుడు, ఆయనకు కృతజ్ఞతా స్తుతులను చెల్లింపుడి.

స—ఆయన కృప నిరంతరముండును.

బో—సర్వశక్తిగల దేవా! శ్రేయస్కరమైన ఈ దానము వలన మా యాత్మల సేద దీర్చినందుకై నీకు వందనములను చెల్లించుచున్నాము. మఱియు దీనివలననే నీ యందు మాకుగల విశ్వాసమును మాలో ఒకరియం దొకరి కుండవలసిన సంఘ ప్రేమను నీ కృపనుబట్టి బలపఱచుమని నీతోను పరిశుద్ధాత్మతోను సదా ఏక దేవుడై యుగయుగ

ములు జీవించుచు పరిపాలించుచు నుండు నీ ప్రియ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తు ద్వారా నిన్ను వేడుకొనుచున్నాము.

¶ అంతట సభ యిట్లు పాడవలెను లేక చెప్పవలెను:

ఆమేన్.

¶ అంతట మంగళవచనమును స్తుతిగీతమును పాడవచ్చును లేక చెప్పవచ్చును.

బో---ప్రభువు మీతో నుండునుగాక.

స---మీ యాత్మతో నుండునుగాక.

బో---మనము ప్రభువును సన్నుతించెదము.

స---దేవునికి స్తోత్రము కలుగునుగాక.

¶ అంతట బోధకుడు దీవెన నుచ్చరించవలెను.

దీవెన.

ప్రభువు నిన్ను ఆశీర్వదించి కాపాడునుగాక.
ప్రభువు నీకు తన సన్నిధి ప్రకాశింపజేసి నిన్ను కరుణించునుగాక.
ప్రభువు నీ మీద తన సన్నిధి కాంతి నుదయింపజేసి
నీకు సమాధానము కలుగ జేయునుగాక.

¶ అంతట సభ పాడవలసినది లేక చెప్పవలసినది.

ఆమేన్.

---

# ఉదయారాధన.

¶ పరిశుద్ధాత్మను వేడుకొను కీర్తనగాని మరియొక కీర్తనగాని పాడవచ్చును.

¶ "ఉత్సాహగానము" ముగియువరకు అందరు నిలువవలెను. ఈ దిగువ వచనమును "త్రియేకుని మహిమ"ను పాడవలెను లేక చెప్పవలెను.

## వచనము.

బో—ఓ ప్రభువా, మా పెదవులను తెరువుము:

స—అప్పుడు మా నోరు నీ స్తోత్రమును బైలుపరచును.

బో—ఓ దేవా, మమ్ము రక్షించుటకు త్వరపడుము:

స—ఓ ప్రభువా, నాకు సహాయము చేయుటకు త్వరపడుము.

బో—తండ్రికిని, కుమారునికిని, పరిశుద్ధాత్మకును ఆదియందు:

స—ఇప్పుడు, ఎల్లప్పుడు, యుగయుగములందుండునట్లు మహిమ కలుగుగాక.

ఆమేన్. హల్లెలూయా.

¶ ప్రభుని శ్రమ కాలములో హల్లెలూయా అనునది పాడగూడదు.

¶ అంతట 'ఆహ్వానము'ను 'ఉత్సాహగానము'ను వచ్చును.

## ఆహ్వానము

బో—రండి ప్రభువును ఆరాధింతము:

స—ఎందుకనిన, మనలను సృజించినవాడు ఆయనే.

## ఉత్సాహ గానము.

రండి, యెహోవానుగూర్చి ఉత్సాహధ్వని చేయుదము:
మన రక్షణ దుర్గమునుబట్టి సంతోషగానము చేయుదము.
కృతజ్ఞతాస్తుతులతో ఆయన సన్నిధికి వచ్చెదము:
కీర్తనలు పాడుచు ఆయన పేరట సంతోషగానము చేయుదము.
యెహోవా మహాదేవుడు:
దేవతలందరికి పైన మహాత్మ్యముగల మహారాజు.
భూమ్యగాధ స్థలములు ఆయన చేతిలో నున్నవి:
పర్వతశిఖరములు ఆయనవే.
సముద్రము ఆయనది, ఆయన దాని కలుగ జేసెను:
ఆయన హస్తములు భూమిని నిర్మించెను.
ఆయన మన దేవుడు:
మనము ఆయన పాలించు ప్రజలము. ఆయన మేపు గొఱ్ఱెలము.
రండి, నమస్కారము చేసి సాగిలపడుదము:
మనలను సృజించిన యెహోవా సన్నిధిని మోకరించెదము.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును ఆదియందును, ఇప్పుడును, ఎల్లప్పుడును, యుగయుగములందుండునట్లు, మహిమ కలుగుగాక. ఆమేన్.

¶ అంతట కీర్తన పాడవలెను

## కీర్తన.

¶ అంతట నియమింపబడిన దావీదు కీర్తనలలో నొకటిగాని అంతకన్న నెక్కువ గాని పాడవలెను లేక చదువవలెను.

ఉదయారాధన క్రమము

## దావీదు కీర్తన.

¶ ప్రతి దావీదు కీర్తన ‹‹త్రైక్యమునకు మహిమ,,తో ముగింపవలెను.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును ఆదియందును, ఇప్పుడును, ఎల్లప్పుడును, యుగయుగములందుండునట్లు మహిమ కలుగుగాక. ఆమేన్.

## పాఠము.

¶ ప్రతి పాఠము తరువాత ఈ క్రింది దానిని పాడవలెను లేక చెప్పవలెను.

¶ అంతట ఒకటిగాని ఎక్కువగాని బైబిలు పాఠములను చదువవలెను.

బో—ఓ ప్రభువా, మమ్మును కనికరింపుము:

స—దేవునికి వందనములు.

¶ పాఠము తరువాత ఒక కీర్తన పాడవచ్చును.

¶ అంతట చిన్న ప్రసంగము చేయవచ్చును.

## స్తోత్ర గీతము.

¶ అందరును నిలువబడి స్తోత్ర గీతము పాడవలెను లేక చెప్పవలెను.

### దేవా నిన్ను స్తుతించుచున్నాము.

ఓ దేవా నిన్ను స్తుతించుచున్నాము: నీవు ప్రభుడవని ఒప్పుకొనుచున్నాము.

నిత్యుడవైన తండ్రీ: లోకమంతయు నిన్ను ఆరాధించుచున్నది.

దేవదూతలందరును, పరలోకములును, అందలి అధికారములందరును: నిన్ను కంఠమెత్తి కొనియాడుచున్నారు.

పరిశుద్ధుడా! పరిశుద్ధుడా! పరిశుద్ధుడా: సైన్యముల ప్రభుడవైన దేవా,
ఇహపరలోకములు: నీ మహిమాతిశయముతో నిండియున్నవని
కెరూబులును సెరూపులును: మానకుండ నిన్ను కీర్తించుచున్నారు.

అపొస్తలుల మహిమగల సమూహము, నిన్ను స్తుతించుచున్నది.
ప్రవక్తల ఉత్తమసంఘము: నిన్ను స్తుతించుచున్నది.

అపరిమిత మహాత్మ్యము గల తండ్రివైన నిన్నును: పూజ్యుడగు నీ సత్యైక పుత్రుని, ఆదరణకర్తయైన పరిశుద్ధాత్మను: పరిశుద్ధ సంఘము లోకమంతట ఒప్పుకొనుచున్నది.

ఓ క్రీస్తూ, నీవే మహిమగల రాజవు: నీవే తండ్రికి నిత్యకుమారుడవు.
నీవు నరుని రక్షింప బూనినప్పుడు: కన్యవలన పుట్టుటను తృణీకరించ లేదు. మరణవేదనను జయించిన వెనుక: విశ్వాసు లందరికి పరలోక రాజ్యము తెరచినావు.

నీవు దేవుని కుడిచేతివైపున: తండ్రి మహిమయందు కూర్చుండియున్నావు.
నీవు మాకు న్యాయాధిపతివై: వచ్చెదవని నమ్ముచున్నాము:

కాబట్టి నీ అమూల్యరక్తము వలన నీవు విడిపించిన నీ సేవకులకు: సహాయము చేయుమని నిన్ను ప్రార్థించుచున్నాము.
నిత్యమహిమయందు వారిని: నీ పరిశుద్ధులతో కూడ లెక్కించుము.
ఓ ప్రభువా, నీ జనమును రక్షించి: నీ స్వాస్థ్యమును దీవించుము.
వారిని పాలించి: ఎల్లప్పుడు లేవనెత్తుము.
ఓ ప్రభువా, మేము నేడు పాపము చేయకుండునట్లు: దయతో కాపాడుము.

ఓ ప్రభువా, మమ్ము కరుణింపుము: మమ్ము కరుణింపుము.
ఓ ప్రభువా, మేము నిన్ను నమ్మినందున నీ కరుణ మామీద నుండనిమ్ము.
ఓ ప్రభువా, నిన్ను నమ్మినాను: ఎప్పటికిని నన్ను సిగ్గుపడనియకుము.

## ప్రభువు స్తోత్రింపబడును గాక.

ఇశ్రాయేలు ప్రభువైన దేవుడు స్తోత్రింపబడును గాక: ఆయన తన ప్రజలకు దర్శన మిచ్చి వారికి విమోచన కలుగ జేసెను.

తన సేవకుడైన దావీదు వంశమునందు: మన కొరకు రక్షణ శృంగమును అనగా మన శత్రువులనుండియు, మనలను ద్వేషించు వారందరి చేతినుండియు తప్పించి రక్షణ కలుగ జేసెను.

దీనిగూర్చి ఆయన ఆదినుండి: తన పరిశుద్ధ ప్రవక్తల నోట పలికించెను.

ఆయన మన పితరులను కనికరించుటకును: తన పరిశుద్ధ నిబంధనను అనగా మన తండ్రియైన అబ్రాహాముతో: తాను చేసిన ప్రమాణ మును జ్ఞాపకము చేసికొనుటకును.

మనము శత్రువుల చేతినుండి విడిపింపబడి: మన జీవితకాల మంతయు నిర్భయులమై ఆయన సన్నిధిని పరిశుద్ధముగాను నీతిగాను ఆయనను: సేవింప ననుగ్రహించుటకును ఈ రక్షణ కలుగ జేసెను.

మరియు ఓ శిశువా: నీవు సర్వోన్నతుని ప్రవక్త వనబడుదువు.

మన దేవుని మహావాత్సల్యమును బట్టి: వారి పాపములను క్షమించుట వలన తన ప్రజలకు రక్షణ జ్ఞానము ఆయన అనుగ్రహించునట్లు: ఆయన మార్గములను సిద్ధపరచుటకై నీవు ప్రభువునకు ముందుగా నడుతువు.

మన పాదములను సమాధాన మార్గములోనికి నడిపించునట్లు; చీకటిలోను మరణచ్ఛాయలోను కూర్చుండు వారికి వెలుగిచ్చుటకై ఆ మహావాత్సల్యమును బట్టి: పైనుండి ఆయన మనకు అరుణోదయ దర్శన మనుగ్రహించెను.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును ఆదియందు, ఇప్పుడును, ఎల్లప్పుడు యుగయుగములందు నుండునట్లు మహిమ కలుగునుగాక. ఆమేన్.

## ప్రార్థన.

¶ అంతట ప్రార్థనము చేయవలెను.

బో—ప్రభువా, మమ్మును కనికరింపుము:

స—ప్రభువా, మమ్మును కనికరింపుము.

క్రీస్తూ, మమ్మును కనికరింపుము.

ప్రభువా, మమ్మును కనికరింపుము.

¶ అంతట అందరు కలిసి ప్రభువు ప్రార్థన చెప్పవలెను:

పరలోకమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధపరచబడుగాక; నీ రాజ్యము వచ్చుగాక; నీ చిత్తము పరలోకమందు నెరవేరుచున్నట్లు భూమియందును నెరవేరుగాక: మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము: మా యెడల అపరాధములు చేసిన వారిని మేము క్షమించి యున్నప్రకారము మా యపరాధములను క్షమించుము. శోధనలోకి తేక కీడునుండి మమ్మును తప్పించుము. రాజ్యమును బలమును మహిమయును సర్వదా నీవియై యున్నవి. ఆమేన్.

¶ అంతట ఈ క్రిందివి వాక్యములు లేక చెప్పవలెను

బో—ప్రభువు మీతో నుండునుగాక;

స—మీ యాత్మతో నుండునుగాక.

## ప్రార్థింతము.

¶ అంతట ఆ దినమునకైన సంగ్రహ ప్రార్థన చేయవలెను.

ఆమేన్.

¶ ఇతర సంగ్రహ ప్రార్థనలను చేయవచ్చును. తర్వాత పగటి కాపుదలకొరకు కృపాసంగ్రహ ప్రార్థన చేయవచ్చును

## కృపకొరకైన సంగ్రహ ప్రార్థన.

ఓ ప్రభువా, మా పరలోకపు తండ్రీ, సర్వశక్తిగల నిత్యదేవా, ఈ దినారంభమువరకు మమ్ము సురక్షితముగా నీవే కాపాడియున్నావు. నీ మహాశక్తితో మమ్ము సంరక్షించి యే పాపములోను పడనియ్యక, సమస్తమైన విపత్తులనుండి తప్పించుము. మా క్రియలన్నియు నీ చేతనే నడిపించబడి, నీ దృష్టిలో నీతిమయములై యుండునట్లు కృప ననుగ్రహింపుమని నీతోను పరిశుద్ధాత్మతోను సదా ఏకదేవుడై యుండు మా ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ ఈ క్రిందిది పాడవలెను లేక చెప్పవలెను

బో—ప్రభువును స్తుతింతము.

స—దేవునికి స్తోత్రము కలుగును గాక.

¶ అంతట ఈ క్రింది దీవెన చెప్పవలెను.

మన ప్రభువు యేసు క్రీస్తు కృపయు, దేవుని ప్రేమయు, పరిశుద్ధాత్మ సహవాసమును మీ యందరితో నుండునుగాక.

ఆమేన్.

# సాయంత్ర నారాధన

—:o:—

¶ పరిశుద్ధాత్మను వేడుకొను కీర్తనగాని మరియొక కీర్తనగాని పాడవచ్చును.

¶ దావీదు కీర్తన ముగియువరకు అందరు నిలువబడి, దిగువ వచ్చు వచనమును ''త్రియేకుని మహిమ'' అను దానిని పాడవలెను లేక చెప్పవలెను.

## వచనము.

బో—ఓ ప్రభువా, మా పెదవులను తెరువుము:

స—అప్పుడు మా నోరు నీ స్తోత్రమును బైలుపరచును.

బో—ఓ దేవా, నన్ను రక్షించుటకు త్వరపడుము:

స—ఓ ప్రభువా, నాకు సహాయము చేయుటకు త్వరపడుము.

బో—తండ్రికిని, కుమారునికిని, పరిశుద్ధాత్మకును ఆదియందు:

స—ఇప్పుడు, ఎల్లప్పుడు, యుగయుగములందుండునట్లు మహిమ కలుగుగాక. ఆమేన్. హాల్లెలూయా.

¶ ప్రభుని శ్రమకాలములో హాల్లెలూయా అనునది పాడకూడదు.

¶ అంతట దావీదు కీర్తనలలో నొకటిగాని అంతకన్న నెక్కువగాని పాడవలెను లేక చదువవలెను.

## దావీదు కీర్తన.

¶ ప్రతి దావీదు కీర్తన ''త్రియేకుని మహిమ'' అను దానితో ముగియవలెను.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును ఆదియందు, ఇప్పుడు, ఎల్లప్పుడు, యుగయుగములందుండునట్లు, మహిమ కలుగుగాక. ఆమేన్.

¶ అంతట ఒకటిగాని అంతకన్న నెక్కువగాని బైబిలు పాఠములను చదువవలెను.

## పాఠము

¶ చివరిది తప్ప ప్రతి పాఠము తరువాత ఈ క్రిందిది పాడవలెను లేక చెప్పవలెను

బో—ఓ ప్రభువా, మమ్మును కనికరింపుము:

స—దేవునికి వందనములు.

¶ అంతట ఒక కీర్తన పాడవచ్చును.

¶ అంతట ప్రసంగము చేయవచ్చును.

## ప్రసంగము.

¶ అంతట కానుకలను సమకూర్చి బల్లమీద నుంచవలెను.

¶ అంతట సంఘము పాడవలసినది:

## కీర్తన.

¶ అంతట ప్రార్థన మొగియువరకు అందరు నిలువబడి, ఈ క్రింది వచనము పాడవలెను లేక చెప్పవలెను.

## వచనము.

బో—నా ప్రార్థన నీ సన్నిధిని పరిమళ వాసనార్థమైన కానుకగా నుండును గాక:

స—నా చేతు లెత్తుట నీకు సాయంతన యాగముగా నుండునుగాక.

¶ అంతట ఈ క్రిందివానిలో నొక దానిని పాడవలెను.

## మహిమా స్తవము

నా ప్రాణము ప్రభుని ఘనపరచుచున్నది, ఆయన తన దాసురాలి దీనస్థితి
కటాక్షించెను: నా యాత్మ నా రక్షకుడైన దేవునియందు
ఆనందించెను.

సర్వశక్తిమంతుడు నాకు గొప్ప కార్యములు చేసెను: గనుక ఇది మొదలు
కొని అన్ని తరములవారు నన్ను ధన్యురాలని యందురు.

ఆయన నామము పరిశుద్ధము: ఆయనకు భయపడువారిమీద ఆయన కని
కరము తరతరములవరకుండును.

ఆయన తన బాహువు బలముతో పరాక్రమము చూపెను: వారి హృద
యముల ఆలోచన విషయమై గర్విష్ఠులను చెదరగొట్టెను.

సింహాసనముల నుండి బలవంతులను పడద్రోసి దీనుల నెక్కించెను
ఆకలిగొనిన వారిని మంచి పదార్థములతో సంతృప్తిపరచి ధనవంత
లను వట్టి చేతులతో పంపివేసెను.

అబ్రాహామునకును ఆతని సంతానమునకును యుగాంతము వరకు, తన
కనికరము చూప జ్ఞాపకము చేసికొందునని. మన పితరులతో సెలవిచ్చి
నట్లు: ఆయన తన సేవకుడైన ఇశ్రాయేలునకు సహాయము చేసెను.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును ఆదియందు, ఇప్పుడు, ఎల్లప్పుడు, యుగయుగములందుండునట్లు మహిమ కలుగు గాక. ఆమేన్.

## సెలవు గీతము

నాథా! ఇప్పుడు నీ మాట చొప్పున సమాధానముతో నీ దాసుని పోనిచ్చు
చున్నావు.

అన్య జనులకు నిన్ను బయలుపరచుటకు వెలుగుగాను నీ ప్రజలయిన
ఇశ్రాయేలుకు మహిమగాను నీవు సకల ప్రజలయెదుట సిద్ధపరచిన
నీ రక్షణ నా కన్నులు చూచినవి.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును ఆదియందు, ఇప్పుడు, ఎల్లప్పుడు, యుగయుగములందుండునట్లు మహిమ కలుగు గాక.

¶ అంతట ఈ క్రింది ప్రార్థనల నయినను అనుమతి ప్రార్థనల నయినను లిటనీ నయినను ఇతర ప్రార్థనల నయినను చేయవలెను.

## ప్రార్థన

బో.—ప్రభువా, మమ్మును కనికరింపుము.

స.—ప్రభువా, మమ్మును కనికరింపుము.

క్రీస్తూ, మమ్మును కనికరింపుము.

ప్రభువా, మమ్మును కనికరింపుము.

¶ అంతట అందరు కలిసి ఇట్లు చెప్పవలెను

పరలోకమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధపరచబడుగాక ; నీ రాజ్యము వచ్చుగాక ; నీ చిత్తము పరలోకమందు నెఱవేఱు చున్నట్లు భూమియందును నెఱవేఱుగాక. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. మా యెడల అపరాధములను చేసినవారిని మేము క్షమించి యున్నప్రకారము మా యపరాధములను క్షమించుము. శోధనలోకి తేక కీడునుండి మమ్ములను తప్పించుము. రాజ్యమును బలమును మహిమయు నిరంతరము నీవియై యున్నవి. ఆమేన్.

¶ అంతట ఈ క్రిందిది పాడవలెను లేక చెప్పవలెను.

బో.—ప్రభువు మీతో నుండుగాక

స.—మీ యాత్మతో నుండుగాక.

సర్వశక్తిమంతుడు నాకు గొప్ప కార్యములు చేసెను: కనుక ఇది మొదలు
కొని అన్నితరములవారు నన్ను ధన్యురాలని యందురు.

ఆయన నామము పరిశుద్ధము: ఆయనయందు భయపడువారిమీద ఆయన కని
కరము తరతరములవరకుండును.

ఆయన తన బాహువు బలముతో పరాక్రమము చూపెను: వారి హృద
యముల ఆలోచన విషయమై గర్విష్ఠులను చెదరగొట్టెను.

సింహాసనముల నుండి బలవంతులను పడద్రోసి దీనుల నెక్కించెను:
ఆకలిగొనిన వారిని మంచి పదార్థములతో సంతృప్తిపరచి ధనవంతు
లను వట్టి చేతులతో పంపివేసెను.

అబ్రాహామునకును ఆతని సంతానమునకును యుగాంతము వరకు, తన
కనికరము చూప జ్ఞాపకము చేసికొందునని. మన పితరులతో సెలవిచ్చి
నట్లు: ఆయన తన సేవకుడైన ఇశ్రాయేలునకు సహాయము చేసెను.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును ఆదియందు, ఇప్పుడు, ఎల్లప్పుడు, యుగయుగములందుండునట్లు మహిమ కలుగు గాక. ఆమేన్.

## సెలవు గీతము

నాథా! ఇప్పుడు నీ మాట చొప్పున సమాధానముతో నీ దాసుని పోనిచ్చు
చున్నావు.

అన్యజనులకు నిన్ను బయలుపరచుటకు వెలుగుగాను నీ ప్రజలయిన
ఇశ్రాయేలునకు మహిమగాను నీవు సకల ప్రజలయెదుట సిద్ధపరచిన
నీ రక్షణ నా కన్నులు చూచినవి.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును ఆదియందు, ఇప్పుడు, ఎల్లప్పుడు, యుగయుగములందుండునట్లు మహిమ కలుగు గాక.

¶ అంతట ఈ క్రింది ప్రార్థనల నయినను అనుమతి ప్రార్థనల నయినను లిటనీ నయినను ఇతర ప్రార్థనల నయినను చేయవలెను.

## ప్రార్థన

బో.—ప్రభువా, మమ్మును కనికరింపుము.

స.—ప్రభువా, మమ్మును కనికరింపుము.

క్రీస్తూ, మమ్మును కనికరింపుము.

ప్రభువా, మమ్మును కనికరింపుము.

¶ అంతట అందరు కలిసి ఇట్లు చెప్పవలెను

పరలోకమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధపరచబడుగాక; నీ రాజ్యము వచ్చుగాక; నీ చిత్తము పరలోకమందు నెఱవేఱుచున్నట్లు భూమియందును నెఱవేఱుగాక. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. మా యెడల అపరాధములను చేసినవారిని మేము క్షమించి యున్నప్రకారము మా యపరాధములను క్షమించుము. శోధనలోకి తేక కీడునుండి మమ్ములను తప్పించుము. రాజ్యమును బలమును మహిమయు నిరంతరము నీవియై యున్నవి. ఆమేన్.

¶ అంతట ఈ క్రిందిది పాడవలెను లేక చెప్పవలెను.

బో.—ప్రభువు మీతో నుండుగాక:

స.—మీ యాత్మతో నుండుగాక.

# ప్రార్థింతము

¶ అంతట ఆ దినమునకైన సంగ్రహ ప్రార్థన చేయవలెను.

¶ శుక్రవారమువరకు ఆ యాదివారమునకైన సంగ్రహ ప్రార్థనయు శనివారమున ఆ తరువాతి యాదివారమునకైన సంగ్రహ ప్రార్థనయు చేయవలెను.

¶ ఆ యాదివారమున కయిన సంగ్రహ ప్రార్థన చేసిన పిమ్మట ఇతర సంగ్రహ ప్రార్థనలను చేయవచ్చును. ఆ తరువాత ఈ క్రింది వచనము చెప్పి సమాధాన సంగ్రహ ప్రార్థన చేయవలెను.

## వచనము

బో—ప్రభువు తన జనులకు బలము నిచ్చును.

స—ప్రభువు తన జనులను సమాధానముతో నాశీర్వదించును.

## సమాధాన సంగ్రహ ప్రార్థన.

సకల పరిశుద్ధేచ్ఛలు అన్ని మంచి ఆలోచనలు సర్వ న్యాయకార్యములు కలిగించెడు ఓ దేవా! మా హృదయములు నీ యాజ్ఞానుసారముగా నిలుపబడి మేము సకలమైన శత్రువుల భయమునుండి నీ వలన కాపాడబడి మా కాలము సమాధానములోను నెమ్మదిలోను గడుపునట్లు లోకము ఈయనేరని ఆ సమాధానము నీతోను పరిశుద్ధాత్మతోను సదా యేక దేవుడై యుగయుగములందు జీవించుచు ఏలుచు నుండు మా రక్షకుడైన యేసు క్రీస్తు నీతిమూలమున నీ సేవకులకు అనుగ్రహింపుము. ఆమేన్.

¶ అంతట ఈ క్రిందిది పాడవలెను లేక చెప్పవలెను.

బో—ప్రభువును స్తుతింతము.

స—దేవునికి స్తోత్రము కలుగును గాక.

¶ దీనితో ఆరాధన ముగియవచ్చును. లేదా ఒక కీర్తన పాడిన తరువాత ఈ క్రింది దీవన చెప్పవలెను.

మన ప్రభువు యేసుక్రీస్తు కృపయు దేవుని ప్రేమయు పరిశుద్ధాత్మ సహవాసమును మీ యందరితో నుండునుగాక. ఆమేన్.

---

# చిన్నపిల్లల బాప్తిస్మక్రమము.

—:o:—

¶ బాప్తిస్మము బహిరంగ ఆరాధన సమయమున ఆచరింపబడవలయును. అవసరమున్న యెడల ఏకాంతముగాను ఆచరింపవచ్చును గాని, దానిగూర్చి తరువాత బహిరంగముగా ప్రకటింపవలెను.

¶ తమ బిడ్డలకు బాప్తిస్మ మిప్పించుటలో ఆలస్యము చేయకుండునట్లు తలిదండ్రులను ప్రేరేపింపవలెను.

¶ తల్లిదండ్రుల పేరులు, జ్ఞాన తలిదండ్రుల (లేక జవాబుదారుల,) పేరులు బిడ్డ పేరు, ఆతని లేక ఆమె పుట్టుక తేది, పుట్టిన స్థలము, బాప్తిస్మము పొందిన స్థలముల పేరులతో కూడా సంఘ రిజిస్టరులో నెక్కించి తగిన యోగ్యతా పత్రిక నియ్యవలెను.

¶ సంఘములోని సభికులు మాత్రమే జ్ఞానతలిదండ్రులు (జవాబుదారులు)గా నుండవచ్చును.

¶ క్రమమైన ఆరాధనలలో నొకదానియందు లేక ప్రత్యేకముగా నేర్పాటు చేయబడిన ఆరాధనయందు బాప్తిస్మము నాచరింపవచ్చును. ఆరాధన సమయమున బాప్తిస్మమిచ్చిన యెడల విశ్వాస ప్రమాణమునకు లేక ముఖ్యప్రార్థనకు ముందు ఈ క్రింది క్రమమును వాడవచ్చును. సాయంకాలపు ఆరాధన సమయమున బాప్తిస్మ మిచ్చిన యెడల పాఠములకు లేక ప్రసంగమునకు ముందు ఈ క్రమమును వాడవచ్చును; ప్రత్యేకముగ నేర్పాటు చేయబడిన ఆరాధనయందు బాప్తిస్మ మిచ్చినయెడల ఒక కీర్తన పాడిన పిమ్మట ఈ క్రమమును వాడవచ్చును.

ప్రథమ ప్రార్థనను చెప్పుచున్నప్పుడు గురువు తన చేతిని బిడ్డ తల మీద నుంచ వచ్చును.

గురువు చెప్పవలసినది.

తండ్రియొక్కయు, కుమారునియొక్కయు, పరిశుద్ధాత్మ యొక్కయు నామమున. ఆమేన్.

మిక్కిలి ప్రియులారా! మనుష్యులందరు పాపము నందు గర్భమున ధరింపబడి జన్మించి యున్నందునను మన రక్షకుడైన యేసు క్రీస్తు—"ఒకడు నీటిమూలముగాను ఆత్మ మూలముగాను జన్మించితేనేగాని దేవుని రాజ్యములో ప్రవేశింపలేడని" చెప్పియున్నందునను ఈ బిడ్డను దేవుడు తన దయవల్లను కనికరము వల్లను బాప్తిస్మముద్వారా విమోచకుని సంఘములోనికి చేర్చికొని దానిలో నొక జీవముగల అవయవమునుగా చేయునట్లు మన ప్రభువైన యేసు క్రీస్తు మూలముగ తండ్రియైన దేవుని వేడుకొనవలెనని మిమ్మును బ్రతిమాలుకొనుచున్నాను.

## ప్రార్థింతము.

సర్వశక్తిగల నిత్యుడవైన దేవా! మా ప్రభువైన యేసు క్రీస్తుయొక్క తండ్రీ! ఈ బిడ్డకొరకు నీ యొద్దకు వచ్చి ప్రార్థిస్తున్న సంబంధమైన స్నానముద్వారా ఇతనికి (లేక ఈమెకు) బాప్తిస్మ నర ప్రసాదమును నిత్యకృపను అనుగ్రహింపవలెనని నిన్ను బ్రతిమాలి వేడుకొనుచున్నాము. ఓ ప్రభువా!

అడుగుడి మీకియ్యబడును; వెదకుడి మీకు దొరకును; తట్టుడి మీకు తీయబడును; అని నీ ప్రియకుమారునిద్వారా నీవు వాగ్దత్తము చేసియున్నావు గనుక ఈ బిడ్డను నీ బిడ్డనుగా అంగీకరింపుమని నీ కుమారుడును మా ప్రభువునైన ఆ యేసు క్రీస్తు ద్వారానే వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ అంతట గురువు ఇట్లు చెప్పవలెను.

పరిశుద్ధ సువార్త వాక్యములను వినుడి:

తమ చిన్నపిల్లలను ముట్టవలెనని కొందరాయన యొద్దకు వారిని తీసికొని వచ్చిరి ; అయితే శిష్యులు (వారిని తీసికొని వచ్చిన) వారిని గద్దించిరి: యేసు అది చూచి కోపపడి—చిన్నపిల్లలను నా యొద్దకు రానియ్యుడి, వారి నాటంకపరచవద్దు ; దేవుని రాజ్యము ఈలాటివారిదే. చిన్నపిల్లలవలె దేవుని రాజ్యము నంగీకరింపనివాడు అందులో ప్రవేశింపడని మీతో నిశ్చయముగా చెప్పుచున్నానని చెప్పి ఆ పిల్లలను ఎత్తి కౌగలించుకొని వారిమీద చేతులుంచి ఆశీర్వదించెను.

మన ప్రభువైన యేసు క్రీస్తు—"పరలోకమందును భూమిమీదను నాకు సర్వాధికార మియ్యబడియున్నది. కాబట్టి మీరు వెళ్ళి సమస్త జనులను శిష్యులనుగా చేయుడి; తండ్రియొక్కయు కుమారునియొక్కయు పరిశుద్ధాత్మ యొక్కయు నామములోనికి వారికి బాప్తిస్మ మిచ్చుచు నేను మీ కే యే సంగతుల నాజ్ఞాపించితినో వాటి నన్నిటిని

గై కొనవలెనని వారికి బోధించుడి. ఇదిగో నేను యు సమాప్తిపర్యంతము మీతోకూడ నున్నాను. నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షింపబడును'' అని చెప్పెను

|| అంతట అందరు కలిసి ప్రభుని ప్రార్థన చెప్పవలెను:

పరలోకమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధ పఱచబడునుగాక. నీ రాజ్యము వచ్చునుగాక. నీ చిత్తము పరలోకమందు నెఱవేఱుచున్నట్లు భూమియందును నెఱ వేఱునుగాక. మా అనుదినాహారము నేడు మాకు దయ చేయుము. మా యెడల అపరాధములను చేసిన వారిని మేము క్షమించి యున్న ప్రకారము మా యపరాధములన క్షమించుము. శోధనలోనికి తేక కీడునుండి మమ్ములను తప్పించుము. రాజ్యమును బలమును మహిమయు నిరంత రము నీవియై యున్నవి. ఆమేన్.

|| అంతట బాప్తిస్మము కొఱకు బిడ్డను తెచ్చిన వారితో గురువు చెప్పవలసినది:

మన ప్రభువుయొక్క ఆజ్ఞానుసారముగ మీరీ బిడ్డను పరిశుద్ధ బాప్తిస్మము కొరకు తెచ్చియున్నారు: కాబట్టి నేను మీలో ప్రతివారిని అడుగున దేమనగా:

నీవు సాతానును వాని సర్వకార్యములను వాని సరళ మార్గములను విడిచి పెట్టుచున్నావా ?

ఉ: అవును, విడిచిపెట్టుచున్నాను.

¶ అంతట గురువు చెప్పవలసినది:

మన మందిరము దేని నొప్పుకొని బాప్తిస్మము పొందితిమో ఇప్పు డీ బిడ్డ దేనిలోనికి బాప్తిస్మ మొందవలయునో ఆ విశ్వాసము నొప్పుకొందము.

¶ అంతట అందరు కలసి అపొస్తలుల విశ్వాస ప్రమాణము చెప్పవలెను.

భూమ్యాకాశములను సృజించిన సర్వశక్తిగల తండ్రియైన దేవుని నేను నమ్ముచున్నాను.

ఆయన ఏక కుమారుడును మన ప్రభువునైన యేసు క్రీస్తును నమ్ముచున్నాను. ఈయన పరిశుద్ధాత్మవలన గర్భమున ధరింపబడి కన్యయైన మరియకు పుట్టి, పొంతి పిలాతు అధికారము క్రింద శ్రమ పడి సిలువ వేయబడి చనిపోయి సమాధి చేయబడెననియు, అదృశ్యలోకము లోనికి దిగెననియు చనిపోయిన వారిలోనుండి మూడవ దినమున లేచి పరలోకమున కెక్కి సర్వశక్తిగల తండ్రి యగు దేవుని కుడిచేతివైపున కూర్చుండి యున్నాడనియు సజీవులకును మృతులకును తీర్పుచేయుటకు అక్కడనుండి వచ్చుననియు నమ్ముచున్నాను.

పరిశుద్ధాత్మను నమ్ముచున్నాను. పరిశుద్ధ క్రైస్తవ సంఘమగు పరిశుద్ధుల సహవాసమును, పాపక్షమాపణయు, శరీర పునరుత్థానమును, నిత్యజీవమును, ఉన్నవని నమ్ముచున్నాను. ఆమేన్.

గైకొనవలెనని వారికి బోధించుడి. ఇదిగో నేను యుగ సమాప్తిపర్యంతము మీతోకూడ నున్నాను. నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షింపబడును” అని చెప్పెను.

¶ అంతట అందరు కలిసి ప్రభువు ప్రార్థన చెప్పవలెను:

పరలోకమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధపఱచబడునుగాక. నీ రాజ్యము వచ్చునుగాక. నీ చిత్తము పరలోకమందు నెఱవేఱుచున్నట్లు భూమియందును నెఱవేఱుగాక. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. మా యెడల అపరాధములను చేసిన వారిని మేము క్షమించి యున్న ప్రకారము మా యపరాధములను క్షమించుము. శోధనలోనికి తేక కీడునుండి మమ్ములను తప్పించుము. రాజ్యమును బలమును మహిమయు నిరంతరము నీవియై యున్నవి. ఆమేన్.

¶ అంతట బాప్తిస్మము కొఱకు బిడ్డను తెచ్చిన వారితో గురువు చెప్పవలసినది:

మన ప్రభువుయొక్క ఆజ్ఞానుసారముగ మీరీ బిడ్డను పరిశుద్ధ బాప్తిస్మము కొరకు తెచ్చియున్నారు: కాబట్టి నేను మీలో ప్రతివారిని అడుగున దేమనగా:

నీవు సాతానును వాని సర్వకార్యములను వాని సర్వమార్గములను విడిచి పెట్టుచున్నావా ?

ఉ: అవును, విడిచిపెట్టుచున్నాను.

‖ అంతట గురువు చెప్పవలసినది!

మన మందరము దేని నొప్పుకొని బాప్తిస్మము పొందితిమో ఇప్పు డీ బిడ్డ దేనిలోనికి బాప్తిస్మ మొందవలయునో ఆ విశ్వాసము నొప్పుకొందము.

¶ అంతట అందఱు కలసి అపొస్తలుల విశ్వాస ప్రమాణము చెప్పవలెను.

భూమ్యాకాశములను సృజించిన సర్వశక్తిగల తండ్రియైన దేవుని నేను నమ్ముచున్నాను.

ఆయన ఏక కుమారుడును మన ప్రభువునైన యేసు క్రీస్తును నమ్ముచున్నాను. ఈయన పరిశుద్ధాత్మవలన గర్భమున ధరింపబడి కన్యయైన మరియకు పుట్టి, పొంతి పిలాతు అధికారము క్రింద శ్రమ పడి సిలువ వేయబడి చనిపోయి సమాధి చేయబడెననియు, అదృశ్యలోకము లోనికి దిగెననియు చనిపోయిన వారిలోనుండి మూడవ దినమున లేచి పరలోకమున కెక్కి సర్వశక్తిగల తండ్రి యగు దేవుని కుడిచేతివైపున కూర్చుండి యున్నాడనియు సజీవులకును మృతులకును తీర్పుచేయుటకు అక్కడనుండి వచ్చుననియు నమ్ముచున్నాను.

పరిశుద్ధాత్మను నమ్ముచున్నాను. పరిశుద్ధ క్రైస్తవ సంఘమగు పరిశుద్ధుల సహవాసమును, పాపక్షమాపణయు, శరీర పునరుత్థానమును, నిత్యజీవమును, ఉన్నవని నమ్ముచున్నాను. ఆమేన్.

¶ అంతట బాప్తిస్మము పొందుటకు బిడ్డను తెచ్చినవారితో గురువు చెప్పవలసినది:

ఈ క్రైస్తవ విశ్వాసమునందు బాప్తిస్మము పొందుటకు ఈ బిడ్డను తెచ్చియున్నారా?

ఉ: అవును, తెచ్చియున్నాను.

ఈ బిడ్డకు దేవుని వాక్యము నేర్పించి ప్రభువుయొక్క బోధలోను శిక్షలోను పెంచెదమని వాగ్దానము చేయుచున్నారా?

ఉ: అవును, వాగ్దానము చేయుచున్నాను.

¶ అప్పుడు గురువు- ఈ బిడ్డకు ఏ పేరు పెట్టవలెను? అని యడిగి శిశువు తలమీద ముమ్మారు నీళ్లు పోయుచు లేక చిలకరించుచు చెప్పవలసినది:

శిశువును పేరుతో పిలిచి) నేను తండ్రియొక్కయు కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మ యొక్కయు నామమున నీకు బాప్తిస్మ మిచ్చుచున్నాను. ఆమేన్.

మన ప్రభువైన యేసు క్రీస్తుయొక్క తండ్రియగు సర్వశక్తిగల దేవుడు నీటి మూలముగాను పరిశుద్ధాత్మ మూలముగాను నిన్ను మరల జన్మింపజేసి నీ పాపము లన్నిటిని క్షమించెను: ఆయన తన కృప చేత నిత్యజీవమునకై నిన్ను బలపఱచు గాక. ఆమేన్.

నీకు సమాధానము కలుగుగాక.

¶ అంతట గురువు చెప్పవలసినది:

## ప్రార్థింతము.

సర్వశక్తియు మిగుల కనికరమును గల దేవా! తండ్రీ! నీవు నీ సంఘమును అనుగ్రహముతో కాపాడి వృద్ధి నొందించుచున్నావు గనుకను, పరిశుద్ధ బాప్తిస్మము మూలముగా ఈ బిడ్డకు క్రొత్త జన్మమును దయచేసి, నీ బిడ్డనుగాను నీ రాజ్యమునకు వారసుని (వారసురాలిని) గాను అంగీకరించి నందుకును నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించు చున్నాము. ఈ బిడ్డ యెన్నటికి నీ యొద్దనుండి తొలగిపోక, ఎల్లప్పుడును నీ చిత్తానుకూలముగ జీవించుచు తుదకు నీ నిత్యరాజ్యములో నీ వాగ్దత్తమును సంపూర్ణముగ పొందునట్లు ఇతనిని (ఈమెను) ఈ కృపయందు కాపాడి సంరక్షింపుమని నీతోను పరిశుద్ధాత్మతోను సదా ఏక దేవుడై యుగయుగములు జీవించుచు పరిపాలించుచు నుండు నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తు ద్వారా వినయముగా బ్రతిమాలి వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ అంతట గురువు బాప్తిస్మము కొఱకు బిడ్డను తెచ్చిన వారితో నిట్లు చెప్పవలెను:

ఈ బిడ్డకు బాప్తిస్మ మిప్పించుట వలన ఇంతటి ధర్మకార్యమును చేసిన మీరు ఇతనికి (ఈమెకు) పది యాజ్ఞలను విశ్వాస ప్రమాణమును ప్రభువు ప్రార్థనను శ్రద్ధతోను నమ్మకముగాను నేర్పించవలయును ; మఱియు ఇతడు (ఈమె)

పెరిగి పెద్దవాడు (పెద్దది) అగుచుండగా పరిశుద్ధ లేఖనములను చదువుకొనునట్లు చేసి, దేవాలయములో జరుగు ఆరాధనలకు తీసికొని రావలయుననియు తాను తన బాప్తిస్మమున చేసిన యొడంబడికె యందును సంఘ సహవాసము నందును నిలిచి యేసు క్రీస్తు రాకడ దినమువరకు దైవభక్తితో జీవించుటకై పెంచబడులాగున క్రైస్తవ విశ్వాసమునందు నేర్పు పొందునట్లు చేయవలెననియు మిమ్మును హెచ్చరించుచున్నాను.

¶ అంతట గురువు చెప్పవలసినది:

తండ్రి కుమారుడు పరిశుద్ధాత్మ యను సర్వశక్తిగల దేవుని దీవెన ఎల్లప్పుడు మీతో నుండునుగాక. ఆమేన్.

---

# పెద్దవారి బాప్తిస్మ క్రమము

¶ చిన్నతనమందు బాప్తిస్మము పొందనివా రెవరైనను క్రీస్తునందు తమకు గల విశ్వాసము నొప్పుకొని పరిశుద్ధ బాప్తిస్మము పొంద గోరిన యెడల అట్టివారికి మొదట చిన్న ప్రశ్నోత్తరిలో నున్న రీతిగా క్రైస్తవ విశ్వాసమును గూర్చి బోధింపవలెను.

¶ పెద్దల బాప్తిస్మము మిక్కిలి అవసరమైన విషయములలో తప్ప తక్కిన సమయములయందు దేవాలయములో సర్వవారి యెదుట ఆచరింపబడవలయును. ఏకాంతముగ నాచరించు బాప్తిస్మములను గూర్చి సంఘముయొక్క తరువాతి ఆరాధన కాలమందు బహిరంగముగ ప్రకటింపవలెను.

¶ బాప్తిస్మము పొందవలసినవారు ముందరకు వచ్చియుండగా గురువు సభవారితో నిట్లు చెప్పవలెను.

మిక్కిలి ప్రియులారా! మనుష్యులందరు పాపము నందు గర్భమున ధరింపబడి పుట్టుచున్నారు గనుకను, తలంపు వలనను మాట వలనను క్రియవలనను దేవుని పరిశుద్ధ చట్టమును మీరుచున్నారు గనుకను, ఒకడు నీటిమూలము గాను ఆత్మమూలముగాను జన్మించితేనే గాని దేవుని రాజ్యములో ప్రవేశింపలేడని మన రక్షకుడైన యేసు క్రీస్తు చెప్పియున్నాడు గనుకను ఈయనను (ఈమెను) దేవుడు తన దయాదాక్షిణ్యముల వలన బాప్తిస్మము మూలముగా విమోచకుని సంఘములోనికి చేర్చికొని దానిలో జీవముగల యొక అవయవమునుగా చేయునట్లు మన ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా దేవుని వేడుకొనవలయునని మిమ్మును బ్రతిమాలుచున్నాను.

## ప్రార్థింతము.

సర్వశక్తిగల నిత్యుడవైన దేవా! మా ప్రభువైన యేసు క్రీస్తు యొక్క తండ్రీ! మేము ఈ నీ సేవకుని (సేవకురాలి) నిమిత్తము నీ యొద్దకు వచ్చి పునర్జన్మ సంబంధమైన స్నానము ద్వారా నీ బాప్తిస్మ వరప్రసాదమును నీ నిత్యకృపను ఈయనకు (ఈమెకు) అనుగ్రహింపవలెనని నిన్ను వేడుకొనుచున్నాము. ఓ ప్రభువా! అడుగుడి మీకు కియ్యబడును; వెదకుడి మీకు దొరకును; తట్టుడి మీకు తీయబడునని నీ ప్రియకుమారుని ద్వారా నీవు వాగ్దానము చేసియున్నావు గనుక ఈయనను

(ఈమెను) నీ బిడ్డనుగా అంగీకరింపుమని నీ కుమారుడును మా ప్రభువునైన ఆ యేసు క్రీస్తు ద్వారా వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ అంతట గురువు చెప్పవలసినది:

మన ప్రభువైన యేసు క్రీస్తు చెప్పిన మాటలు వినుడి:

"పరలోకమందును భూమిమీదను నాకు సర్వాధికారమియ్యబడియున్నది. కాబట్టి మీరు వెళ్ళి సమస్త జనులను శిష్యులనుగా చేయుడి. తండ్రియొక్కయు కుమారునియొక్కయు పరిశుద్ధాత్మయొక్కయు నామములోనికి వారికి బాప్తిస్మమిచ్చుచు నేను మీ కే యే సంగతుల నాజ్ఞాపించితినో వాటి నన్నిటిని గైకొనవలెనని వారికి బోధించుడి. ఇదిగో నేను యుగ సమాప్తి పర్యంతము సదా కాలము మీతోకూడ నున్నాను. నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షింపబడును."

¶ తరువాత అందరు కలసి చెప్పవలసినది:

పరలోకమందున్న మా తండ్రీ! నీ నామము పరిశుద్ధపరచబడుగాక. నీ రాజ్యము వచ్చుగాక. నీ చిత్తము పరలోకమందు నెరవేరుచున్నట్లు భూమియందును నెరవేరుగాక: మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. మా యెడల అపరాధములను చేసిన వారిని మేము క్షమించి యున్న ప్రకారము మా యపరాధములను క్షమించుము. శోధనలోకి తేక కీడునుండి మమ్ములను

తప్పించుము. రాజ్యమును బలమును మహిమయు నిరంతరము నీవియై యున్నవి. ఆమేన్.

¶ అంతట గురువు, బాప్తిస్మము పొందుటకు వచ్చినవారిని ఇట్లు అడుగవలెను:

నీవు సాతానును వాని సర్వకార్యములను వాని సర్వ మార్గములను విడిచిపెట్టుచున్నావా?

ఉ: అవును, విడిచి పెట్టుచున్నాను.

నీవు భూమ్యాకాశములను సృజించిన సర్వశక్తిగల తండ్రియైన దేవుని నమ్ముచున్నావా?

ఉ: అవును, నమ్ముచున్నాను.

ఆయన ఏక కుమారుడును మన ప్రభువునైన యేసు క్రీస్తును నమ్ముచున్నావా?

ఉ: అవును, నమ్ముచున్నాను.

ఈయన పరిశుద్ధాత్మవలన గర్భమున ధరింపబడి కన్యయైన మరియకు పుట్టి, పొంతి పిలాతు అధికారము క్రింద శ్రమపడి సిలువవేయబడి చనిపోయి సమాధిచేయబడెననియు, అదృశ్యలోకములోనికి దిగెననియు, చనిపోయిన వారిలోనుండి మూడవ దినమున లేచి పరలోకమున కెక్కి సర్వశక్తిగల తండ్రియగు దేవుని కుడిచేతివైపున కూర్చుండి యున్నాడనియు, సజీవులకును మృతులకును తీర్పుచేయుటకు అక్కడనుండి వచ్చుననియు నమ్ముచున్నావా?

ఉ: అవును, నమ్ముచున్నాను.

పరిశుద్ధాత్మను నమ్ముచున్నావా

ఉ: అవును, నమ్ముచున్నాను.

పరిశుద్ధ క్రైస్తవ సంఘమును పరిశుద్ధుల సహవాసమును, పాపక్షమాపణయు, శరీర పునరుత్థానమును, నిత్యజీవమును ఉన్నవని నమ్ముచున్నావా?

ఉ: అవును, నమ్ముచున్నాను.

ఈ క్రైస్తవ విశ్వాసములోకి బాప్తిస్మము పొందవలెనని కోరుచున్నావా?

ఉ: అవును, కోరుచున్నాను.

నీ వీ విశ్వాసమందు నిలిచి యుందునని వాగ్దానము చేయుదువా?

ఉ: అవును, దేవుని సహాయమువల్ల ఆలాగే చేయుదును.

ఎవాంజెలికల్ (సువిశేష) లూథరన్ సభికుడవైన నీవు దాని బోధనలయందు నమ్మకముగ నుండి కృపాసాధనములను శ్రద్ధతో నుపయోగించుకొందునని వాగ్దానము చేయుదువా?

ఉ: అవును, దేవుని సహాయమువల్ల ఆలాగే చేయుదును.

¶ అంతట బాప్తిస్మము పొందవచ్చినవారు (లేక ఆమె) మోకరించగా గురువు ఆయన (లేక ఆమె) తలమీద ముమ్మారు నీళ్లు పోయుచు ఈలాగు చెప్పవలెను:

(బాప్తిస్మము పొందువారిని పేరుతో పిలిచి) నేను తండ్రి యొక్కయు, కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మ యొక్కయు నామమున నీకు బాప్తిస్మ మిచ్చుచున్నాను.

¶ అంతట గురువు బాప్తిస్మము పొందిన ఆయన (లేక ఆమె) తలమీద తన చేతి నుంచి యీలాగు చెప్పవలెను:

మన ప్రభువైన యేసు క్రీస్తుయొక్క తండ్రియగు సర్వశక్తిగల దేవుడు నీటిమూలముగాను పరిశుద్ధాత్మ మూలముగాను నిన్ను మరల జన్మింపజేసి నీ పాపము లన్నిటిని క్షమించెను. ఆయన తన కృపచేత నిత్యజీవమునకై నిన్ను బలపరచును గాక. ఆమేన్.

నీకు సమాధానము కలుగు గాక.

¶ అంతట సంఘము నిలువబడగా గురువు చెప్పవలసినది:

## ప్రార్థింతము.

సర్వశక్తిగల నిత్యుడవైన దేవా, నీవు కరుణతో ఈ నీ సేవకుని (సేవకురాలిని) నీటిమూలముగాను ఆత్మ మూలముగాను మరల జన్మింపజేసి ఈయన (లేక ఈమె) పాపము లన్నిటిని క్షమింప ననుగ్రహించి యున్నావు. ఆదరణకర్త యగు పరిశుద్ధాత్మతో ఈయనను (లేక ఈమెను) బలపరచి, జ్ఞాన వివేకముల కాధారమగు ఆత్మను ఆలోచన బలముల కాధారమగు ఆత్మను తెలివిని యెహోవా యెడల భయ భక్తులను పుట్టించు ఆత్మను ఇప్పుడును నిరంతరమును అనుగ్రహించి వివిధములగు కృపావరములను ఈయన (లేక ఈమె) యందు దినదినము పెంపొంద జేయుమని నీతోను పరిశుద్ధాత్మతోను సదా ఏక దేవుడై యుగయుగములు జీవించుచు

పరిపాలించుచు నుండు నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తుద్వారా వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ అంతట బాప్తిస్మము పొందిన ఆయన (లేక ఆమె) నిలువబడగా గురువు తన కుడిచేతి నందించి ఈలాగు చెప్పవలెను:

నీవు ఎవరిని ఒప్పుకొని సేవించుటకు వాగ్దానము చేసి యుంటివో ఆ ప్రభువైన యేసు నామమున నీవు ఈ సంఘములో నొక సభికుడవై (లేక సభికురాలవై) యున్నావని యిందుమూలముగా నేను ప్రకటించుచున్నాను. మరియు ప్రభువు రాత్రి భోజనము పుచ్చుకొనుటకును ఈ సంఘమునకు చెందిన ఆత్మీయ హక్కు లన్నిటియందు పాలు పుచ్చుకొనుటకును నీకు అధికార మిచ్చుచున్నాను.

¶ అంతట గురువు సభవారితో నిట్లు చెప్పవలెను:

ఈ సంఘపు సభికులైన మీరు మీ తోడి సభికుని (సభికురాలిని) గాను మీ సహోదరుని (సహోదరి) గాను, క్రీస్తు యేసు నందు వారసుని (వారసురాలిని) గాను అంగీకరించి దేవుడు తన పరిశుద్ధాత్మ మూలమున ఈయన (లేక ఈమె) యం దారంభించిన కార్యమును సంపూర్తి చేయునట్లు ఎల్లప్పుడు ప్రార్థింప వలెనని మిమ్మును హెచ్చరించుచున్నాను.

¶ అంతట బోధకుడు చెప్పవలసినది:

తండ్రి కుమారుడు పరిశుద్ధాత్మ యను సర్వశక్తి గల దేవుని-దీవెన ఎల్లప్పుడు నీతో నుండును గాక. ఆమేన్.

# అభిషిక్తులు కాని వారిచ్చు బాప్తిస్మ క్రమము.

—:O:—

¶ ఒక శిశువుగాని, పురుషుడు లేక స్త్రీ గాని, మరణాపాయకరమైన జబ్బులోనుండగా సంఘ గురువును పిలిపించుటకు సమయములేని యెడల క్రైస్తవులలో నెవరైనను సరే పురుషుడు గాని స్త్రీ గాని బాప్తిస్మ మియ్యవచ్చును. వారు నీళ్ళు ఉపయోగింపవలెను. మరియు శిశువును లేక పురుషుని లేక స్త్రీని పేరుతో పిలిచి—"నేను తండ్రియొక్కయు కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మ యొక్కయు నామమున నీకు బాప్తిస్మ మిచ్చుచున్నాను. ఆమేన్." అను మాటలను తప్పకుండ చెప్పవలెను. తరువాత ప్రభుని ప్రార్థనను చెప్పవచ్చును.

¶ అటువంటి బాప్తిస్మమును గూర్చి అన్ని విషయములలో సంఘ గురువునకు తెలియ జేయవలెను. ఆయన అట్టి శిశువుకు లేక పురుషునికి లేక స్త్రీకి నీళ్ళతో, తండ్రియొక్కయు కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మయొక్కయు నామమున బాప్తిస్మమిచ్చినారా? అని యడుగవలెను. ఆలాగు జరిగినదని ఆయనకు రుజువైన యెడల అది నిజమైన క్రైస్తవ బాప్తిస్మమని, దానిని సభ యొక్క జ్ఞాపకార్థపు గ్రంథములో నెక్కించవలెను. అయితే అట్టి బాప్తిస్మమును గూర్చి సంఘ గురువునకు సందేహ మున్నయెడల ఆయన అట్టి వారికి సామాన్య క్రమము చొప్పున బాప్తిస్మ మియ్యవలెను.

---

# అభిషిక్తులు కాని వారిచ్చు బాప్తిస్మమును స్థిరపరచు క్రమము.

¶ అభిషేకము పొందని వారిచ్చిన బాప్తిస్మము, తరువాత నొక సంఘారాధనయందు బహిరంగముగ స్థిరపరచబడవచ్చును. అట్టి సమయమున ఆ శిశువును (లేక పురుషుని లేక స్త్రీని) దేవాలయమునకు తీసికొని రావలయును. ఆ బాప్తిస్మము నిచ్చిన వారును సాక్షులును కూడ అప్పుడు హాజరు కావలయును.

¶ గురువు ఈ దిగువ ప్రశ్నల నడుగవలెను:

ఈ బాప్తిస్మము నెవ రిచ్చిరి?

ఆ కాలమందు అచట నుండిన వారెవరు?

ఈ శిశువుకు (పురుషునికి లేక స్త్రీకి) నీళ్లతో బాప్తిస్మ మిచ్చినారా?

తండ్రియొక్కయు కుమారునియొక్కయు పరిశుద్ధాత్మ యొక్కయు నామమున అను మాటల నుపయోగించి బాప్తిస్మ మిచ్చినారా?

¶ ఈ ప్రశ్నలకు తృప్తికరమైన ప్రత్యుత్తరములు పొందిన యెడల గురువు చెప్పవలసినది:

మీరు మన ప్రభువైన యేసు క్రీస్తు ఆజ్ఞానుసారముగ దీని నాచరించియున్నారు కావున, ఈ బాప్తిస్మము క్రమ ముగా నాచరింపబడినదని నేను ప్రచురము చేయుచున్నాను.

## ప్రార్థింతము.

¶ అంతట గురువు బిడ్డ (లేక పురుషుడు లేక స్త్రీ) తలమీద తన చేతినుంచి ప్రభువు ప్రార్థన చెప్పవలెను

¶ అంతట గురువు చెప్పవలసినది:

మన ప్రభువైన యేసు క్రీస్తు తండ్రియగు సర్వశక్తిగల దేవుడు నీటిమూలముగాను, ఆత్మమూలముగాను నిన్ను మరల జన్మింపజేసి నీ పాపము లన్నిటిని క్షమించియున్నాడు. ఆయన తన కృపచేత నిత్యజీవమునకై నిన్ను బలపరచును గాక. ఆమేన్.

నీకు సమాధానము కలుగుగాక.

## ప్రభు రాత్రి భోజనమునకు సిద్ధపడు నిమిత్తము

# బహిరంగముగా పాపముల నొప్పుకొను ఆరాధన క్రమము.

‖ ఈ యారాధన క్రమము సాయంత నారాధనము వంటిది. పరిశుద్ధ ప్రభు రాత్రి భోజనమునకు పూర్వపు శుక్రవారము లేక శనివారము సాయంకాలమున ఇది జరుపబడవలెను. సంస్కారము పుచ్చుకొన నుద్దేశించు వారందరు దీనికి హాజరు కావలయును.

‖ పాపపు టొప్పుదల ఆరాధన ఉదయమున ముఖ్యారాధనకు ముందుగా జరుపవలసి యున్న యెడల దీనిని ''తండ్రి యొక్కయు కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మ యొక్కయు నామమున'' అను మాటలతో ఆరంభింపగా సభ ''ఆమేన్'' అని చెప్పవలెను. అటు పిమ్మట హెచ్చరిక, పాపపు టొప్పుదల పాప క్షమాపణ అనునవి జరిపి క్రొత్త నిబంధన ఆశీర్వాదము ఉచ్చరింపవలెను. అప్పుడు ముఖ్య ఆరాధనను ఆ దినమునకైన ప్రారంభ గీతముతో నారంభింపవలెను.

‖ పరిశుద్ధాత్మను వేడుకొనునొక కీర్తనగాని తగిన మరియొక కీర్తనగాని పాడవచ్చును

‖ సభ లేచి ''త్రైయేకుని'' మహిమతో కూడ ఈదిగువ వచనము పాడవలెను, లేక చెప్పవలెను. దావీదు కీర్తన ముగియు వరకు సభ నిలువబడియే యుండవలెను.

### వచనము:

బో.—దేవా, నన్ను విడిపించుటకు త్వరగా రమ్ము.

స.—ప్రభువా, నా సహాయమునకు త్వరగా రమ్ము.

బో.—విరిగిన మనస్సే దేవునికి ఇష్టమైన బలులు.

స.—దేవా, విరిగి నలిగిన హృదయమును నీవు అలక్ష్యము చేయవు.

బో—తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును:

స—ఆదియందు ఇప్పుడు ఎల్లప్పుడు యుగయుగములం దుండునట్లు మహిమ కలుగుగాక. ఆమేన్.

¶ అంతట దావీదు కీర్తనలలో ఈ దిగువదానిని పాడవలెను లేక చెప్పవలెను:

## దావీదు కీర్తన.

దేవా, నీ కృప చొప్పున నన్ను కరుణింపుము:
నీ వాత్సల్య బాహుళ్యము చొప్పున నా యతిక్రమములను
తుడిచివేయుము.
నా దోషము పోవునట్లు నన్ను బాగుగా కడుగుము:
నా పాపము పోవునట్లు నన్ను పవిత్రపరచుము.
నా యతిక్రమములు నాకు తెలిసే యున్నవి:
నా పాప మెల్లప్పుడు నా యెదుట నున్నది.
నీకు కేవలము నీకే విరోధముగా నేను పాపము చేసి
యున్నాను:
నీ దృష్టి యెదుట నేను చెడుతనము చేసియున్నాను.
కావున ఆజ్ఞ నిచ్చునప్పుడు నీవు నీతిమంతుడవుగా
నగపడుదువు:
తీర్పు చేయునప్పుడు నిర్మలుడవుగా నగపడుదువు.
నేను పాపములో పుట్టినవాడను:
పాపములోనే నా తల్లి నన్ను గర్భమున ధరించెను.

నీవు అంతరంగమున సత్యము కోరుచున్నావు:
అంతర్యములో నాకు జ్ఞానము తెలియ జేయుదువు.
నేను పవిత్రుడ నగునట్లు హిస్సోపుతో నా పాపము పరిహరింపుము:
హిమము కంటెను నేను తెల్లగా నుండునట్లు నీవు నన్ను కడుగుము.
ఉత్సాహ సంతోషములు నాకు వినిపింపుము:
అప్పుడు నీవు విరిచిన యెముకలు హర్షించును.
నా పాపములకు విముఖుడవు కమ్ము:
నా దోషము లన్నిటిని తుడిచివేయుము.
దేవా, నా యందు శుద్ధ హృదయము కలుగ జేయుము:
నా యంతరంగములో స్థిరమైన మనస్సును నూతనముగా పుట్టించుము.
నీ సన్నిధిలోనుండి నన్ను త్రోసివేయకుము:
నీ పరిశుద్ధాత్మను నా యొద్దనుండి తీసివేయకుము.
నీ రక్షణానందము నాకు మరల పుట్టించుము:
సమ్మతిగల మనస్సు కలుగజేసి నన్ను దృఢపరచుము.
అప్పుడు అతిక్రమము చేయువారికి నీ త్రోవలను బోధించెదను:
పాపులును నీ తట్టు తిరుగుదురు.
ప్రభువా, నా పెదవులను తెరువుము:
అప్పుడు నా నోరు నీ స్తుతిని ప్రచురపరచును.

తండ్రికిని కుమారునికిని పరిశుద్ధాత్మకును;
ఆదియందు ఇప్పుడు ఎల్లప్పుడును:
యుగయుగములందుండునట్లు మహిమ కలుగుగాక.

ఆమేన్.

¶ అంతట ఈ దిగువ నుదహరింపబడిన లేఖనభాగములలో ఒకదానినిగాని మరికొన్నిటినిగాని చదువవలెను.

| | | | |
|---|---|---|---|
| నిర్గమకాండము | 20:1_17. | మత్తయి | 5: 21_29. |
| దానియేలు 9: 4_9. | 17_19. | మత్తయి | 11: 25_30. |
| యెషయా | 57.14_21. | మార్కు | 12:28_31. |
| యెషయా | 1: 11_18. | లూకా | 13: 1_9. |
| 1 యోహాను | 1: 5_9. | లూకా 15: 1, 2; 11_31. | |
| 2 కొరింథి | 11: 23_29. | యోహాను | 13: 1_17. |
| | | యోహాను | 20: 19_23. |

¶ అంతట ఒక ప్రసంగము చేయవచ్చును. అటుపిమ్మట ఒక కీర్తన పాడవలెను.

## కీర్తన.

¶ అంతట సభ నిండవబడగా బోధకుడు ఈ దిగువ నున్నట్లు హెచ్చరింపవలెను.

## హెచ్చరిక.

మిక్కిలి ప్రియులారా! మనము మన ప్రభువైన యేసు క్రీస్తు యొక్క పరిశుద్ధ రాత్రి భోజనమునకు రావలెనని యుద్దేశించుచున్నాము. గనుక పరిశుద్ధుడైన పౌలు

మనలను ప్రేరేపించుచున్నట్లు మనలను మనము శ్రద్ధతో పరీక్షించుకొనుట యుక్తమై యున్నది. ఎందుకనగా ఎవరు తమ పాపములను వినయముగా నొప్పుకొందురో, యెవరు నీతినిగూర్చి ఆకలి దప్పులు కలిగియుందురో అట్టి వారిని ముఖ్యముగా నాదరించి బలపరచుటకై ఈ పరిశుద్ధ సంస్కారము నియమింపబడి యున్నది.

అయితే మనలను మనము ఇట్లు పరీక్షించుకొనిన యెడల మనయందు పాపమును మరణమును తప్ప మరేమియు కనబడదు. వీనినుండి మనంతట మన మెంతమాత్రమును తప్పించుకొనలేము: కావున, మన ప్రభువైన యేసు క్రీస్తు మనమీఁద కనికరము గలవాడై మనకు ప్రతిగా దేవుని పూర్ణచిత్తమును ధర్మశాస్త్రమును తాను నెఱవేర్చుటకును, మన కొఱకు మన విముక్తి కొఱకు మరణము పొంది మన పాపముల వలన మనము పొందవలసిన దంతయు అనుభవించుటకును ఆయన మనుష్యుడాయెను. మనము మఱి యెక్కువ దృఢముగా దీనిని నమ్మునట్లును, మన విశ్వాసము వలన బలపఱుపబడి ఆయన చిత్తమునకు సంతోష పూర్వకముగ విధేయుల మగునట్లును తన రాత్రి భోజనమను పరిశుద్ధ సంస్కారమును నియమించెను. దీనియందు తన శరీరమును మన కాహారముగాను, తన రక్తమును పానముగాను అనుగ్రహించుచున్నాడు.

కాబట్టి క్రీస్తుయొక్క మాటలను దృఢముగా నమ్ముచు ఎవడు ఈ రొట్టెను తిని ఈ పాత్రలోనిది త్రాగునో వాడు క్రీస్తునందును, క్రీస్తు అతనియందును జీవించును. అతడు నిత్యజీవము గలవాడై యుండును.

ఆయన మన అపరాధముల నిమిత్తము అప్పగింపబడి మనము నీతిమంతులముగా తీర్చబడుటకై లేపబడెననుటకు ఆయన మరణమును కనబఱచుచు ఆయన జ్ఞాపకార్థముగ దీనిని ఆచరింపవలెను. మఱియు మనము దీనిని బట్టి ఆయనకు మిగుల హృదయ పూర్వకములైన వందనములు చెల్లించుచు మన సిలువ నెత్తుకొని ఆయనను వెంబడించి ఆయన మనలను ప్రేమించుచున్నట్లు ఆయన ఆజ్ఞ ప్రకారము మనమును ఒకరి నొకరము ప్రేమింపవలెను. ఎందుకనిన, ఈ ఒకే రొట్టెయందు పాలు పుచ్చుకొనుచు ఈ ఒకే పాత్రలోనిది త్రాగుచున్నందున మన మందఱము ఒక్క శరీరమై యున్నాము.

ప్రార్థింతము.

సర్వశక్తిగల దేవా, నీకు అందఱి హృదయములు బట్టబయలై యున్నవి. మా కోరికె లన్నియు నీకు తెలిసే యున్నవి. నీకు దాచబడి మరుగై యుండున దేదియు లేదు. మేము నిన్ను పరిపూర్ణముగ ప్రేమించి నీ పరిశుద్ధ నామమును

సరియైన రీతిని ఘనపరచునట్లు మా హృదయాలోచనలను నీ పరిశుద్ధాత్మావేశమువలన పవిత్రపరచుమని నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తుద్వారా నిన్ను వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ అంతట బోధకుడు ఈ దిగువ రీతిగా ఒప్పుదల నారంభింపవలెను:

## ఒప్పుదల

హృదయమును పరిశోధించెడు సర్వశక్తిగల దేవుని సముఖమందు నేను మిమ్మును అడుగున దేమనగా:—

మీరు స్వాభావికముగా పాపులనియు చేయవలసిన మేలు చేయక చేయరాని కీడు చేయుచు తలంపువలనను మాటవలనను క్రియవలనను మీ రక్షకుడగు దేవునికి దుఃఖమును కోపమును కలుగ జేసితిరనియు అందువలన ఆయన శిక్షావిధికి న్యాయముగా పాత్రులనియు మీరు నిజముగా గ్రహించి దుఃఖించుచు ఒప్పుకొనుచున్నారా?

ఉత్తరము: ఒప్పుకొనుచున్నాను.

యేసు క్రీస్తు పాపులను రక్షించుటకు ఈ లోకమునకు వచ్చెననియు ఆయన నామమందు విశ్వాసముంచు వారి కందరికిని పాపపరిహారము కలుగుననియు నిశ్చయముగా నమ్ముచున్నారా?

ఉః నమ్ముచున్నాను.

మరియు మీరు సకల పాపములనుండి విముక్తి పొంద వలెనని ఆసక్తితో కోరుచు, క్రీస్తు నిమిత్తమున మీ పాపములను క్షమించి సమస్త దుర్నీతినుండి మిమ్మును పవిత్రపఱచుట పరలోకమందున్న మీ తండ్రియొక్క దయగల చిత్తమని మీరు హృదయపూర్వకముగా నమ్ముచున్నారా?

ఉ: నమ్ముచున్నాను.

ఇంతటినుండి పరిశుద్ధాత్మకు విధేయులై సమస్త పాపమును ద్వేషించి, విడిచిపెట్టి, దేవుని సన్నిధియందున్నట్లుగా జీవించుచు హృదయమునందును ప్రవర్తనయందును పవిత్రముగా నుండుటకు దినదినము ప్రయత్నింప వలెనని నిశ్చయించుకొనుచున్నారా?

ఉ: నిశ్చయించుకొనుచున్నాను.

మనము వినయముగా మోకరించి దేవుని యెదుట పాపముల నొప్పుకొని ప్రభువైన యేసు క్రీస్తు మూలమున మనకు క్షమాపణ దయచేయుమని ఆయనను వేడుకొందము.

¶ అంతట అందరు మోకాళ్ళూని చెప్పవలసినది:

ఓ దేవా! మా పరలోకపు తండ్రీ! మేము నీకు విరోధముగా అనేక విధములైన ఘోరపాపములు చేసి యున్నాము. మేము మా పాపము సంపూర్ణముగా గ్రహించలేము గాని, నీ కంతయు స్పష్టముగా తెలిసేయున్నది. అన్యాయ, అసత్యము, గర్వము, ద్వేషము, వాక్యమునందును

ప్రార్థనయందును నిర్లక్ష్యము, కొండెములు, జగడములు, త్రాగుడు, వ్యభిచారము, మొదలగు లెక్కలేని ఘోర పాపములు చేసియున్నామని నీ యెదుట ఒప్పుకొనుచున్నాము. మరియు మేము పశ్చాత్తాపపడుచు ఈ మా దోషములను గురించి మనస్ఫూర్తిగా దుఃఖించుచు నీ మితిలేని కృపను బట్టి మమ్మును కరుణించి నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తు నిమిత్తమున మా పాపములను మన్నించి, కృపతో మా బలహీనతలను తొలగింపుమని నిను వేడుకొనుచున్నాము.

ఆమేన్.

¶ అంతట బోధకుడు లేచి పాప క్షమ ప్రకటన వినిపింపవలెను. సభ ఆశీర్వాదము పొందువఱకు మోకరించియే యుండవలెను.

## పాప క్షమ.

పరలోక మందున్న మన తండ్రియైన సర్వశక్తిగల దేవుడు మనయందు కనికరముంచి తన ప్రియ కుమారుడును మన ప్రభువునైన యేసు క్రీస్తుయొక్క శ్రమ మరణ పునరుత్థానములవలన మన పాపము లన్నియు క్షమించుచున్నాడు. మఱియు క్రీస్తు ప్రభుని సంఘ గురువునైన నేను ఆయన యిచ్చిన అధికారమును బట్టి మీలో నిజముగా పశ్చాత్తాపపడి ఆయన యందు విశ్వాసముంచు వారందఱి పాపములు పూర్ణముగా క్షమింపబడి యున్నవని తండ్రి యొక్కయు

కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మ యొక్కయు నామమున ప్రకటించుచున్నాను.

అయితే ఆ యధికారమును బట్టియే పశ్చాత్తాపము లేని అవిశ్వాసులకు నేను తెలియ జేయున దేమనగా అట్టి వారు పశ్చాత్తాపములేని స్థితిలో నున్నంతకాలము దేవుడు వారి పాపములను క్షమింపడు. మఱియు కృపా దినము అంతము కాక ముందు తమ దుర్మార్గములనుండి మళ్ళుకొనకయు, నిజపశ్చాత్తాపము లేకయు క్రీస్తునందు విశ్వాసముంచకయు నున్న యెడల దేవుడు నిశ్చయముగా వారి దోషములను వారిమీదికి రప్పించును.

¶ అంతట బోధకుడు మోకరింపగా అందరు కలిసి ప్రభువు ప్రార్థన చెప్పవలెను.

## ప్రభువు ప్రార్థన.

పరలోకమందున్న మా తండ్రీ, నీ నామము పరిశుద్ధపఱచబడుగాక. నీ రాజ్యము వచ్చుగాక. నీ చిత్తము పరలోకమందు నెఱవేఱుచున్నట్లు భూమియందును నెఱవేఱుగాక. మా అనుదినాహారము నేడు మాకు దయ చేయుము. మా యెడల అపరాధములను చేసిన వారిని మేము క్షమించియున్న ప్రకారము మా యపరాధములను క్షమించుము. శోధనలోకి తేక కీడునుండి మమ్మును తప్పించుము. రాజ్యమును బలమును మహిమయు నిరంతరము నీవియై యున్నవి. ఆమేన్.

ఈ యారాధన ముగియగానే ముఖ్యారాధన జరుపవలసిన అవసరము లేని యెడల బోధకుడు ఆ దినమునకైన సంగ్రహ ప్రార్థన చేయవలెను.

## సంగ్రహ ప్రార్థన.

సంగ్రహ ప్రార్థన తరువాత చెప్పవలసినది

**ఆమేన్.**

¶ ఆ వేళ సమయమునకు తగిన యితర సంగ్రహ ప్రార్థనలను చేయవచ్చును.

అటుపిమ్మట సమాధాన సంగ్రహ ప్రార్థన చేయవచ్చును.

**బో**—ప్రభువు తన ప్రజలకు బలము ననుగ్రహించును.

**స**—ప్రభువు తన ప్రజలకు సమాధానము కలుగజేసి వారి నాశీర్వదించును.

¶ సమాధానము కొరకైన సంగ్రహ ప్రార్థన.

ఓ దేవా, పరిశుద్ధములైన కోరికలన్నియు, మంచి యాలోచనలును న్యాయములైన సర్వకార్యములును నీ వలననే కలుగుచున్నవి. మేము హృదయపూర్వకముగ నీ యాజ్ఞలకు లోబడునట్లును, శత్రుభయమునుండి నీవలన కాపాడబడి మా కాలమును నిశ్చలమైన నెమ్మదితో గడుపునట్లును లోకము ఇయ్యనేరని సమాధానము నీ సేవకులకు అనుగ్రహింపుమని నీతోను పరిశుద్ధాత్మతోను సదా ఏక దేవుడై యుగయుగములందు జీవించుచు పరిపాలించుచు

నందము. మా రక్షకుడైన యేసు క్రీస్తు పుణ్యమును బట్టి నిన్ను వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ అంతట బోధకుడు లేచి దీవెన చెప్పవలెను

మన ప్రభువైన యేసు క్రీస్తు కృపయు, తండ్రియైన దేవుని ప్రేమయు, పరిశుద్ధాత్మ సహవాసమును మీ కందరికి తోడై యుండును గాక !

ఆమేన్.

---

# మృతుల భూస్థాపన క్రమము.

—:O:—

¶ ఈ క్రమమును క్రైస్తవ విశ్వాసమునందు మృతి నొందినవారిని భూస్థాపన చేయునప్పుడు మాత్రమే ఉపయోగింపవలెను.

¶ సభలో నెవరైనను చనిపోయినయెడల వెంటనే సంఘాధ్యక్షునికి తెలియజేయవలెను. ఆయనతో ఆలోచించకుండ సమాధి నిమిత్తము ఏ యేర్పాటులను చేయగూడదు

¶ ఈ క్రమమును భూస్థాపనకు పూర్వము ఆలయము నొద్దగాని యింటియొద్దగాని ఉపయోగింపవచ్చును.

¶ క్రైస్తవు లెవరయిన మృతి నొందినపుడు చావు గంట వాయింపవచ్చును.

¶ విశేష కారణములను బట్టి తప్ప ఈ దిగువ నుదాహరింపబడిన ఆరాధనా క్రమమును తప్పక ఉపయోగింపవలయును.

¶ ఆరాధన కీర్తనతో ఆరంభము కావలెను.

కీర్తన.

¶ పిమ్మట బోధకుడు చెప్పవలసినది:

తండ్రి యొక్కయు కుమారుని యొక్కయు పరిశుద్ధాత్మ యొక్కయు నామమున.

¶ సభ చెప్పవలసినది.

ఆమేన్.

¶ అంతట క్రిందివి చెప్పవలెను:

బో—ప్రభువా, మమ్మును కనికరింపుము.

స—ప్రభువా, మమ్మును కనికరింపుము.

బో—క్రీస్తూ, మమ్మును కనికరింపుము.

స—క్రీస్తూ, మమ్మును కనికరింపుము.

బో—ప్రభువా, మమ్మును కనికరింపుము.

స—ప్రభువా, మమ్మును కనికరింపుము.

¶ ఇప్పుడు ఈ క్రింది దావీదు కీర్తనలలో నొకటి చెప్పవలెను.

దావీదు కీర్తనలు: 23; 90; 130.

¶ అంతట ఈ దిగువ సూచింపబడిన పరిశుద్ధ లేఖన భాగములలో కొన్నిటినిగాని చదువవలెను.

1 థెస్స 4: 13-18; 1 కొరింథీ 15: 12-26: 35-58; యోహాను 11:21-27; యోహాను 14:1-6; యోహాను 5:19-29; రోమా 8: 31-39; 1 పేతురు 1: 3-9, 2 కొరింథీ 5:1-10; ప్రకటన 7: 9-17; ప్రకటన 21: 3-7; లూకా 7: 11-17; మత్తయి 9: 18,19, 23-26; మార్కు 10: 13-16.

¶ ఇచట ఒక ప్రత్యుత్తర వాక్యము లేక కీర్తన లేక తగిన గీతమును పాడవలెను.

## ప్రత్యుత్తర వాక్యములు.

I

మనము దేవుని వలన మేలు ననుభవించెదమా, కీడును మన మనుభవింప తగదా ?

యెహోవా యిచ్చెను యెహోవా తీసికొని పోయెను.

యెహోవా నామమునకు స్తుతి కలుగునుగాక.

యెహోవా ఇచ్చెను యెహోవా తీసికొనిపోయెను.

II

నా విమోచకుడు సజీవుడనియు, తరువాత ఆయన భూమి మీఁద నిలుచుననియు నే నెరుగుదును.

శరీరముతో నేను దేవుని చూచెదను.

నా మట్టుకు నేనే చూచెదను.

మరియొకడును కాక నేనే కన్నులార ఆయనను చూచెదను.

శరీరముతో నేను దేవుని చూచెదను.

III

యేసు మృతిపొంది తిరిగి లేచెనని మనము నమ్మినయెడల అదే ప్రకారము యేసునందు నిద్రించిన వారిని దేవుడు ఆయనతో కూడ వెంట బెట్టుకొని వచ్చును. కావున, నిరీక్షణ లేని యితరుల వలె మీరు దుఃఖపడకుడి.

ఆదామునందు అందరేలాగు మృతినొందుచున్నారో
ఆలాగుననే క్రీస్తునందు అందరును బ్రతికింపబడుదురు.
కావున నిరీక్షణ లేని యితరులవలె దుఃఖపడకుడి.

IV

నీతిమంతుడెట్లు మృతిబొందునో చూడుము. ఎవరును
దానిని మనస్సున బెట్టరు. భక్తులైనవారు తీసికొని
పోబడుచున్నారు. కీడు చూడకుండ నీతిమంతులు తీసికొని
పోబడుచున్నారని ఎవనికిని తోచదు.

అతని జ్ఞాపకము సమాధాన యుక్తమగును.
అతడు సమాధానముతో భూమియందు విశ్రాంతి పొందును.
అతని నివాసస్థలము సీయోనులోనున్నది.
అతని జ్ఞాపకము సమాధాన యుక్తమగును.

V

నెమ్మదితో పండుకొని వెంటనే నిద్రపోవుదును.
మనలో నెవడును తన కొరకు బ్రతుకడు, ఎవడును తన
కొరకు చనిపోడు.
మనము బ్రతికినను చనిపోయినను ప్రభువు వారమై యున్నాము.
మనలో నెవడును తన కొరకు బ్రతుకడు. ఎవడును తన
కొరకు చనిపోడు.

¶ అంతట కీర్తన పాడవచ్చును.

## కీర్తన.

¶ అంతట ప్రసంగము చేయవలెను.

## ప్రసంగము.

¶ అంతట సభ లేచి ఈ దిగువ ప్రార్థనలనైనను లేక ఇతర ప్రార్థనల నయినను చెప్పవలెను.

బో॥—పరలోకమందున్న తండ్రివైన దేవా,

స॥—మమ్మును కనికరింపుము.

బో॥—లోక విమోచకుడవగు కుమారుడవైన దేవా,

స॥—మమ్మును కనికరింపుము.

బో॥—ఆదరణకర్తవగు పరిశుద్ధాత్ముడవైన దేవా,

స॥—నీ సమాధానమును మాకు దయచేయుము.

¶ అంతట బోధకుడు ఈ దిగువ వచ్చు సంగ్రహ ప్రార్థనలలో ఒకటిగాని కొన్నిగాని చెప్పవలెను

సర్వశక్తిగల దేవా, మేము సాతాను అధికారమునుండి విడిపింపబడునట్లును అనిత్యములైన మా శరీరములు మృతులలో నుండి లేపబడునట్లును నీవు నీ కుమారుని మరణము వలన పాపమును మరణమును నశింపజేసి ఆయన పునరుత్థానమువలన నిర్దోషత్వమును నిత్యజీవమును మరల మా కనుగ్రహించి యున్నావు కావున మేము మా పూర్ణహృదయముతో దీనిని సాక్షిగా నమ్మి తుదకు నీ పరిశుద్ధు లందరితో

నీతిమంతుల ఆనందకరమైన పునరుత్థానములో పాలు పొందు నట్లు అనుగ్రహించుమని నీ కుమారుడును మా ప్రభువు నైన యేసు క్రీస్తుద్వారా నిన్ను వేడుకొనుచున్నాము.

ఆమేన్.

ఓ దేవా, మా పరలోకపు తండ్రీ, యేసునందు నిద్రించువారి విషయమై అధికముగా దుఃఖపడకూడదని పరిశుద్ధుడైన నీ అపొస్తలుని ద్వారా మాకు తెలియపరచితివి కావున, మేము ఈ బ్రతుకు చాలించిన తరువాత నీ పరిశుద్ధులందరితో నిత్యానందములోనికి చేర్చుకొనబడునట్లు నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తు ద్వారా అనుగ్రహింపుమని వేడుకొనుచున్నాము. ఆమేన్.

సర్వశక్తిగల దేవా, ప్రభువునందు మృతినొందినవారి యాత్మలు నీ యొద్ద నున్నవి. విశ్వాసుల యాత్మలు దేహమను ఈ గుడారమును విడిచిపెట్టిన తరువాత నీతో ఆనందించుచున్నవి. తమ విశ్వాసపు పరుగును తుద ముట్టించి తమ ప్రయాసములు మాని విశ్రాంతి పొందుచున్న నీ సేవకులకు నీ వనుగ్రహించిన పని నిమిత్తము మేము హృదయపూర్వకమైన వందనములను చెల్లించుచున్నాము. నీ పరిశుద్ధ నామమందు విశ్వసించి మృతులైన వారందరితో పాటు నీ నిత్య మహిమలో శరీరాత్మలయందు పరిపూర్ణ సిద్ధిని పరమానందమును పొందునట్లు అనుగ్రహించుమని

నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తు ద్వారా వేడుకొనుచున్నాము. ఆమేన్.

సర్వశక్తియు మిగుల కనికరముగల దేవా, మేము మా ప్రభువైన యేసు క్రీస్తుతో గలసి నిత్య మహిమలో ప్రవేశింపక పూర్వము ఆయనతో కూడ శ్రమలను మరణమును అనుభవింపవలెనని నీవు నియమించి యున్నావు. మేము నీ పరిశుద్ధ చిత్తమునకు ఎల్లప్పుడును లోబడి మరణ పర్యంతము నిజమైన విశ్వాసమందు స్థిరులముగా నిలిచి మృతుల పునరుత్థానమును రాబోవు లోకమునందు మహిమయు కలుగు ననుశుభనిరీక్షణ వలన ఎల్లప్పుడు సంతోషమును సమాధానమును పొందునట్లు అనుగ్రహించుమని నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తు ద్వారా వేడుకొనుచున్నాము. ఆమేన్.

సర్వశక్తిగల నిత్యుడవైన దేవా, నీవు విచారగ్రస్తులను ఆదరించు వాడవును, బలహీనులకు శక్తి నిచ్చువాడవునై యున్నావు. శ్రమలయందుగాని దుఃఖమునందుగాని యుండి నీకు మొఱ్ఱపెట్టు వారి ప్రార్థనలను దయతో నాలకించి వారు తమ అక్కరలన్నిటియందు నీ యత్యధికమైన కృపను గుర్తించి ఆనందము పొందులాగున సహాయము చేయుమని నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తు ద్వారా వేడుకొనుచున్నాము. ఆమేన్.

శిశువు భూస్థాపన కొరకైన ప్రార్థన.

సర్వశక్తిగల దేవా, మా ప్రభువైన యేసు క్రీస్తుయొక్క తండ్రీ, నీ కుమారుడు చిన్నబిడ్డలను తన చేతులతో ఎత్తు కొని పరలోకరాజ్యము ఈలాటివారిది అని దయతో సెలవిచ్చెను. పరిశుద్ధ బాప్తిస్మము ద్వారా నీవు అంగీకరించిన ఈ బిడ్డ నిత్య జీవము కొరకు కాపాడబడి, నీ కనికరము వలన ఇచ్చట నిన్ను సేవించిన వారందరితో పాటు నీతిమంతుల ఆనందకరమైన పునరుత్థానములోను పరలోకపు స్వాస్థ్యమువలన కలుగు సౌఖ్యములోను పాలు పొందుటకై ఇతడు (లేక ఈమె) ఇహలోక దుఃఖములనుండియు, శోధనలనుండియు తప్పింపబడి యున్నా డని (లేక యున్నదని) మేము రూఢిగా నమ్మునట్లు మాకు సహాయము చేయుమని నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తు ద్వారా నిన్ను వేడుకొనుచున్నాము.

ఆమేన్.

¶ ఇచ్చట ప్రత్యేకమైన ప్రార్థనలు మనవులు చేయవచ్చును. పిమ్మట ఈ దిగువ వచ్చు సంగ్రహ ప్రార్థన చేయవలెను

ఓ ప్రభువైన యేసు క్రీస్తూ, నీవు బ్రతికియుండు వారిని చనిపోయినవారిని విమర్శించుటకై తిరిగి వచ్చి నిత్యజీవార్థమైన పునరుత్థానమునకైనను, శిక్షావిధికైన పునరుత్థా నమునకైనను సమాధులలో నిదురించుచున్న వారి నందరిని

బయటికి రమ్మని పిలిచినవు. మేము నిరంతరము నీతో కూడ నుండి జీవించునట్లు మాయందు కనికర ముంచి మమ్మును నిత్య జీవమునకై లేపుమని తండ్రితోను పరిశుద్ధాత్మతోను సదా ఏక దేవుడవై యుగయుగములు జీవించుచు పరిపాలించుచు నుండు నిన్ను వేడుకొనుచున్నాము. ఆమేన్

¶ అంతట అందరును కలిసి ప్రభువు ప్రార్థన చెప్పవలయును.

పరలోకమందున్న మా తండ్రీ, నీ నామము పరిశుద్ధపరచబడును గాక. నీ రాజ్యము వచ్చును గాక. నీ చిత్తము పరలోకమందు నెరవేరుచున్నట్లు భూమియందును నెరవేరును గాక. మా అనుదినాహారము నేడు మాకు దయచేయుము. మా యెడల అపరాధములను చేసిన వారిని మేము క్షమించుచున్న ప్రకారము మా యపరాధములను క్షమించుము. శోధనలోనికి తేక కీడునుండి మమ్ములను తప్పించుము. రాజ్యమును బలమును మహిమయు నిరంతరము నీవియై యున్నవి.

ఆమేన్.

¶ అంతట బోధకుడు ఆశీర్వాదము చెప్పవలెను.

ఆశీర్వాదము.

మన ప్రభువైన యేసు క్రీస్తు కృపయు, దేవుని ప్రేమయు పరిశుద్ధాత్మ సహవాసమును మీ కందరికి తోడై యుండును గాక. ఆమేన్.

# సమాధియొద్ద జరుపబడు ఆరాధన.

¶ దేహమును సమాధిలో నుంచిన తరువాత బోధకుడు ఈ దిగువ వాక్యములను చెప్పవలెను.

## వాక్యములు.

ఇప్పటినుండి ప్రభువునందు మృతినొందు మృతులు ధన్యులని వ్రాయుమని పరలోకమునుండి యొక స్వరము చెప్పగా వింటిని. నిజమే వారు తమ ప్రయాసములు మాని విశ్రాంతి పొందుదురని ఆత్మ చెప్పుచున్నాడు.

నేనే పునరుత్థానమును జీవమునై యున్నాను; నాయందు విశ్వాసముంచువాడు చనిపోయినను బ్రతుకును. బ్రతికి నాయందు విశ్వాసముంచు ప్రతివాడును ఎన్నటికిని చనిపోడు.

మృతులలోనుండి యేసును లేపినవాని ఆత్మ మీలో నివసించినయెడల మృతులలోనుండి క్రీస్తు యేసును లేపినవాడు చావునకు లోనైన మీ శరీరములను కూడ మీలో నివసించుచున్న తన ఆత్మద్వారా జీవింప జేయును.

¶ పై వాక్యముల నుపయోగింపని యెడల బోధకుడు ఈ దిగువ వాక్యములను ఉపయోగింపవలెను

సజీవులమై యుండియు మనము మరణమునకు లోనై యున్నాము. మా పాపముల నిమిత్తము మా మీద

న్యాయ ప్రకారము కోపము నొందు ఓ ప్రభువా, సహాయమునకై నిన్ను గాక మఱి యెవ్వరి నాశ్రయింతుము?

అయినను మిక్కిలి పరిశుద్ధుడవగు ఓ ప్రభువైన దేవా, సర్వశక్తిగల ప్రభువా, మిక్కిలి కరుణగల ఓ పరిశుద్ధ రక్షకుడా, నిత్య మరణముయొక్క ఘోరబాధలకు మమ్మును అప్పగింపకుము.

¶ అంతట బోధకుడు ఇట్లు చెప్పవలెను.

గతించిపోయిన మన సహోదరుని (లేక సహోదరి) యాత్మను సర్వ శక్తి గల దేవుడు తన మహాకృపచేత తన యొద్దకు చేర్చుకొనుటకు అనుగ్రహించి యున్నాడు. కావున సమస్తమును తనకు లోబఱచుకొనజాలిన శక్తినిబట్టి మన దీనశరీరమును తన మహిమగల శరీరమునకు సమరూపము కలదానినిగా మార్చెడు మన ప్రభువైన యేసు క్రీస్తు ద్వారా నిత్య జీవార్థమైన పునరుత్థానము కలుగునను నిరీక్షణతో ఈయన (లేక ఈమె) శరీరమును మంటికి మన్నుగాను బూడిదకు బూడిదగాను దుమ్మునకు దుమ్ముగాను భూమికి అప్పగించుచున్నాము.

¶ అంతట ఒక కీర్తన పాడవచ్చును.

¶ అంతట బోధకుడు ఈ దిగువ వచ్చు సంగ్రహ ప్రార్థనలలో దేనినైనను లేక రెంటిని ఉపయోగించవచ్చును

సర్వశక్తిగల దేవా, నీ కుమారుడైన యేసు క్రీస్తునందు మృతినొందువా రందఱు సమాధానమును నిరీక్షణయు కలిగి యుండునట్లు ఆయన మరణముచేత మరణమును నశింపజేసి, సమాధియందు ఆయన పొందిన విశ్రాంతినిబట్టి నీ పరిశుద్ధుల సమాధులను పరిశుద్ధపరచి ఆయన మహిమగల పునరుత్థానమువలన "జీవమును అక్షయతను వెలుగులోనికి తెచ్చి యున్నావు." మాకొఱకును ఆయనయందు నిద్రించువా రందఱికొఱకును ఆయన మరణము మీదను సమాధి మీదను పొందిన విజయము నిమిత్తమై మా హృదయ పూర్వకములైన వందనములను అంగీకరింపుము. ఇంకను శరీరముతో నున్న మమ్మును భూమిమీద నీ కొఱకు కనిపెట్టుకొనుచున్నవారి యొక్కయు పరలోకమందు నిన్ను చూచుకొని యుండు వారందఱి యొక్కయు నిత్య సహవాస మందును పునరుత్థానమును జీవమునైన నీ కుమారుడును మా ప్రభువునైన యేసు క్రీస్తు తోడి ఐక్యమందును కాపాడుమని వేడుకొనుచున్నాము. ఆమేన్.

ఓ ప్రభువైన యేసు క్రీస్తూ, నీ మరణమువలన మరణపు ముల్లు విరుగగొట్టి యున్నావు. దయగల ప్రభువా, మేము నీ యందు నెమ్మదిగా నిద్రించి తుదకు నీ వలె తిరిగి లేచునట్లు నీవు దారి చూపిన స్థలమునకు మేము విశ్వాసముతో నిన్ను వెంబడించులాగున నీ సేవకులమైన మాకు

కృపా దయ చేయుమని తండ్రితోను పరిశుద్ధాత్మతోను సదా ఏక దేవుడవై యుగయుగములు జీవించుచు పరిపాలించుచు నుండు నిన్ను వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ అంతట బోధకుడు ఆశీర్వాదము చెప్పవలెను.

మన ప్రభువైన యేసు క్రీస్తు కృపయు, దేవుని ప్రేమయు, పరిశుద్ధాత్మ సహవాసమును మీ కందరికి తోడై యుండును గాక. ఆమేన్.

లేక

గొఱ్ఱెల గొప్ప కాపరియైన యేసు అను మన ప్రభువును నిత్యమైన నిబంధన సంబంధమగు రక్తమును బట్టి మృతులలో నుండి లేపిన సమాధాన కర్తయగు దేవుడు యేసు క్రీస్తు ద్వారా, తన దృష్టి కనుకూలమైనదాని మీలో జరిగించుచు ప్రతి మంచి విషయములోను తన చిత్తప్రకారము చేయుటకు మిమ్మును సిద్ధపరచును గాక. యేసు క్రీస్తునకు యుగయుగములు మహిమ కలుగును గాక. ఆమేన్.

# కుటుంబ ప్రార్థన క్రమము.

—————:o:—————

## ఉదయము

తండ్రియొక్కయు, కుమారుని యొక్కయు, పరిశుద్ధాత్ముని యొక్కయు, నామమున. ఆమేన్.

¶ ఈ దిగువ కీర్తనలలో నొకటి పాడవలెను.

కీర్తనలు:— 15, 20, 130, 132.

¶ ఈ దిగువ వాటిలో దేనినైనను చెప్పుము:

పది యాజ్ఞలు లేక విశ్వాస ప్రమాణము

లేక

నీ పూర్ణ హృదయముతోను, నీ పూర్ణాత్మతోను, నీ పూర్ణ మనస్సుతోను నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెను. నిన్ను వలె నీ పొరుగువాని ప్రేమింపవలెను.

¶ తరువాత బైబిలు పాఠమును చదువుము.

## బైబిలు పాఠము.

## ప్రార్థన.

ప్రియ తండ్రీ! నేడు నీవు మాకు తోడుగా నుండి నిన్ను సేవించుటకై మమ్మును బలపర్చుమని యేసు క్రీస్తు నామమున నిన్ను వేడుకొనుచున్నాము. ఆమేన్.

¶ తరువాత అవసరమైన మనవులు చేయుము.

## ప్రభువు ప్రార్థన.

## సాయంకాలము.

తండ్రియొక్కయు, కుమారుని యొక్కయు, పరిశుద్ధాత్మని యొక్కయు, నామమున. ఆమేన్.

¶ ఈ దినవ కీర్తనలలో నొకటి పాడుము

కీర్తనలు:— 18. 40. 122. 129.

¶ ఈ దినవ దావీదు కీర్తనలలో నొకటి చెప్పుము:—

దావీదు కీర్తనలు:— 1, 23.

## బైబిలు పాఠము.

## ప్రార్థన.

ఓ ప్రభునా యేసు క్రీస్తు నిమిత్తమై నేటి రాత్రి నమ్మును చూచి మా పాపము లన్నిటిని క్షమించి మమ్మును మంచివారినిగా చేయుమని నిన్ను వేడుకొనుచున్నాము.

ఆమేన్.

¶ తరువాత అవసరమైన మనవులు చేయుము.

## ప్రభువు ప్రార్థన.

---

# క్రైస్తవ కీర్తనలు

## మొదటి భాగము

ఇది

ఆంధ్ర ఎవాంజెలికల్

లూథరన్ సంఘమువారి యనుమతి చొప్పున

ప్రచురింపబడినది

మూడవ కూర్పు 8,000 ప్రతులు

రాజమండ్రి

బ్రౌన్ క్రిస్టియన్ ముద్రాశాలయందు ముద్రితము

1930

# క్రైస్తవ కీర్తనల విషయ సూచిక.

# TELUGU LYRICS

# తెనుగు కీర్తనలు

—:O:—

## స్తోత్రము, కృతజ్ఞత.

## *Praise of the Trinity.*

### త్రిత్వమునకు స్తుతి.

రా—బేగడ. తా—ఆది.

త్రిత్వమై - నిత్యత్వమున నే - కత్వమగు దేవా - నీ - సత్యసామ-
ర్థ్యత్వముల నిజ - తత్వము[1] గణించి[2] యమ-రత్వము[3] స్తోత్రించెదను
|| త్రిత్వమై ||

1 ఎల్లలోకంబుల్ సృజించిన - చల్లని తండ్రి - నా - యుల్లమున
నీ గొప్పవింత - లెల్ల సంతసిల్ల శో - భిల్ల దలంచెదను || త్రిత్వమై ||

2 వాసికెక్కిన పరమరాజ్య ని - వాసమును విడిన - శ్రీ - యేసు
నాథుండను కుమారా - దోసుల దోసంబులెల్ల - గాచి[4] రక్షించినావు
|| త్రిత్వమై ||

3 ఆదరణ కౌరుండ వగు వ - రాత్మ రూడా తండ్రి - ఆ - హోద నా
మము నంపబడి యేసు-నాథుని సుబోధలెల్ల - బోధపరచి పాముకొల్పు
|| త్రిత్వమై ||

4 ఓ పితా సుతా వరాత్మ - ఒక్క - దేవుడవు - ఎల్ల - పాపులను
రక్షింప మిగుల - నోపికతో నాపదలు - బాపి కృప జూపినావు || త్రిత్వమై ||

---

1 స్వభావము 2 ఎంచి 3 చావు లేకపోవుట 4 కాపాడి.

## 2 *Praise of the Creator.*

సృష్టికర్తకు స్తుతి.

రా—కాంభోజి. తా—జంపె.

ఘనుడైన యెహోవా - గద్దె ముందట మీరు - వినతు[1] లిప్పుడు చేయుడీ॥ యో జనులారా - ఘనుడైన॥ వినయంబుగా నిర్మ - లానంద గంగల వారి[2] - మన ఘనం బొప్పుచుండ॥ నో జనులారా - ఘనుడైన॥

1 ఒక్కడే మన కర్తయుండు దేవుడనియుఁ - జక్కగాను సృజియించు - సంహరించు ననియుఁ - నిక్కముగ దెలిసికొండీ మన సహాయమే - మక్కరలేకుండ మనల - మిక్కుటపు పరిపాలనపు బలముచే జేసె - మృత్తుచే[3] మానవులగ = దిక్కుగానక దిరుగు గొ - ర్రెలవలె మనము చెదగ - దిరుగ దన దొడ్డి బెట్టె॥ నో జనులారా - ఘనుడైన॥

2 మేమందరము వందనపు పాటతో మూగి - మించు నీ గుమ్మములలో - మామా స్వరము లెత్తు మము నభము[4] పాడవుగా - మఘగలయ సహితముగను - భూమియుఁ దనదు పదివేల జిహ్వాలవల్ల - బొంకైన నీ నగరికా = ధామంబులను[5] గాన సన్నుతి వితతి[6] పూరి - తమ్ములుగ జేయు దేవా ॥యో జనులారా - ఘనుడైన॥

3 ధరయంత విస్తారమై యున్నది నీ యాజ్ఞ - తగ విరహితాద్యంతమై[7] - స్థిరమైన కాలంబువలెనె యున్నదయ దయ - పారలిపోవుచునున్న వ - త్సరముల్ నిలిచిపోయినప్పటికిని నీదు - సత్యంబు నిలిచియుండుఁ = వరశిలాఖండ[8] పర్వతముతోడను సాటి - పన్నె కెక్కుచు నెంతయుఁ ॥ ఓ జనులారా - ఘనుడైన॥

---

1 స్తోత్రములు 2 జలప్రవాహము 3 మంటిచేత 4 ఆకాశము 5 ఇండ్లు
6 సమూహము 7 అద్యంతములు లేని 8 శ్రేష్ఠమైన యేకరాతి

# Praise of the Creator.

## సృష్టికర్తకు కృతజ్ఞతా స్తుతి.

రా—కాంభోజి. తా—అట.

అన్ని కాలంబుల - నున్న యెహోవా ని - న్నెన్న తరంబ ఓ - కన్న తండ్రి=వన్నె కెక్కిన మోక్ష - వాసాళి[1] సన్నుతు - లున్నతమై యుండ- మున్నె నీకు|| నన్ని కాలంబుల||

1 నిన్ను బ్రకటనజేయ - నిఖిల లోకములను - ఉన్నగ[2] జేసిన బలుడ వీవె=యున్న లోకంబుల - నుడుగక కరుణా సం - పన్నతతో నేలు ప్రభుడ వీవె -యన్ని జీవుల నెరిగి - యాహార మిచ్చుచు - నున్న సర్వజ్ఞుం డవు నీవే=యెన్న శక్యము గాక - యున్న లక్షణముల - సన్నుతించుటకు నే - జాలుదునా|| అన్ని కాలంబుల||

2 పుట్టింప నీవంచు-పోషింప నీవంచు- గిట్టింప నీవంచు కీర్తింతును= ఇట్టి పనికిమాలి-నట్టి మానవుల చే-పట్టి రక్షింప బాధ్యుండవంచు-దిట్టమైన కృపను దరి జేర్ప నాకిచ్చి - పట్టయి నిలచి యుందు - ప్రభుడ వంచు= కట్టడచే కడ - ముట్టు దనుక నా - పట్టుకొలదిని నిన్ను - బ్రస్తుతింతు ||నన్ని కాలంబుల||

3 కారుణ్యనిధి వీవు - కఠినాత్ముడను నేను - భూరి[3] శుద్ధుడ వీవు పాపి నేను=సార భాగ్యుడ వీవు - జగతిలో నాకన్న - దారిద్ర్యుడే లేడు తరచి చూడ-సార సద్గుణముల-సంపన్నుడవు నీవు-ఘోర దుర్గుణ సం-చారి నేను = ఏ రీతి స్తుతియింతు - నే రీతి సేవింతు - నేర మెన్నక బ్రోవ - నెర[4] నమ్మితి|| అన్ని కాలంబుల||

---

1 పరలోక నివాసుల సమూహము 2 చక్కగా 3 మిక్కిలి 4 పూర్ణముగా.

## 4 *The Divine Praise.*

దైవ స్తుతి.

(ఛాయ: యేసు నాథ కథా సుధా.)

రా—నవరోజు. తా—త్రిపుట.

నీతి గల యెహోవ స్తుతి మీ - యాత్మతో నర్పించుడీ - యాత్మతో సేవించుడీ=దాతయౌ మన క్రీస్తు నీతిని - దాల్చుకొని సేవించుడీ|| నీతి గల||

1 గగనల[1] బుడమిని[2] రవిని[3] జలధిని[4] - నదుల గిరులను జక్కగా = సదమలంబగు[5] దైవ నామము - సర్వదా నుతిజేయని || నీతి గల ||

2 సర్వశక్తుని కార్యములకీ - సర్వరాష్ట్రము లన్నియు = గర్వములు విడి తలలు వంచుచు - నుర్విలోన[6] నుతిజేయని || నీతి గల||

3 గీత తాండవ[7] వాద్యములచే - ప్రీతిపర చెడు సేవతో=పాతకంబులు పరిహరించెడు - దాతనే సేవించుడీ || నీతి గల ||

4 పరమ దూతలు నరులు పుడమిని - మొరలు బెట్టుచు దేవుని=బరమునం దున్నట్టి యేసుని - పాదములు సేవింపని || నీతి గల ||

5 ఇలను భక్తులు గూడుకొనుచును - బలము గల్గిన దేవుని = వెలయు స్తుతులను నోళ్ళతోడను - విసుకకుండగ జేయని|| నీతి గల||

---

## 5 *The Lord is greatly to be praised.*

దావీదు కీర్తన 96.

దేవుడు సర్వస్తోత్రపాత్రుడైనవాడు.

రా—ముఖారి. తా—త్రిపుట.

గానము జేయుడు సుకీర్తనను = యెహోవా - వాని గూర్చి క్రొత్త - గాన రక్తిగను || గానము ||

---

1 ఆకాశమును 2 భూమిని 3 సూర్యుని 4 సముద్రమును 5 పరిశుద్ధమైన 6 భూమియందు 7 నాట్యము 8 ప్రేమతోను

# స్తోత్రము, కృతజ్ఞత

తెస్వామి మహిమ నుతియించి యాతని - రక్ష[1] - జెన్నా[2] సాక్షి ప్రసిద్ధము జేసి = పన్నుగ నన్యులలో దన్మహిమ - యం-మున్నత విచిత్రము లను చాటుండీ || గానము ||

2 ఎందుకనిన నా యెహోవా - శ్రేష్ఠు - డీడ్యుడు[3] మిగుల నుతింపబడ దగును = డెందాన[4] సకల దేవతల - కన్న - భయంక రతం డగుచుండు నెపుడు|| గానము||

3 ఎందుకనిన నన్యజనుల - సామి - లందరును విగ్రహములే యైన = వందితుడైన యెహోవా - నభో - మండలమ్ము[5] నిర్మాణము జేసె|| గానము||

4 ఘనతయు మహాత్మ్యమును - త - ద్ఘనుని యెదుట నుండు ఘన బలమును = వినుతమహా[6] సౌందర్యమును - న - తనివి నిర్మల స్థలమున విలసిల్లు ||గానము||

5 జనములారా యెహోవాకు - మహి - మను బలమును సమ ర్పణము జేయుండీ = వినయముతో గానుకలను - దీసి - కొని తత్ప్రా కార మందున[7] వసియించుండీ ||గానము||

6 పరిశుద్ధాలంకారముతో - నా - పరమాత్మారాధన పరులై యుండుండీ = ధరణి సకల జనులార - లోక - గురుని యెదుట భీతిగొనుచు నుండుండీ ||గానము||

7 పరిపాలించుచున్నా డనుచు - నన్య-నరులతో జెప్పు డిద్ధర[8] కదల కుండ = స్థిరముగ జేయు సత్యముగా - జనుల - కరిమురిగా[9] న్యాయము విమర్శించు ||గానము||

8 ఏమనిన నా మహాత్ముండు - వచ్చు - నీ మహికి[10] న్యాయము నేర్ప రచుటకు = భూమి జనులకు నీతి సత్య-ముల - తో మించు న్యాయ మెంతో విమర్శించు ||గానము||

---

1 రక్షణము 2 పలుమారు 3 స్తుతింపబడతగినవాడు 4 మనస్సునందు 5 ఆకాశగోళము 6 మిగుల కొనియాడ తగిన 7 ఆయన ఆవరణమందు 8 ఈ భూమియందు 9 బాగుగా 10 భూమికి

## 6 *Praise of the Triune God.*

త్రైక దేవుని స్తుతి.

రా—కాంభోజి. తా—అట.

ఘనము బలమును మహిమ - యును జనకునకు గల్గున్ - తనయునికి
తగు కృ - తజ్ఞత లెప్పుడున్ = అనిశంబు[1] శుద్ధాత్మ కవనిలో జయమంచు -
మనము పాడుద మిప్పుడు - మరి సంతసముతో ||ఘన||

1 అఖిలసౌభాగ్యముల - కాధార భూతుడును - నిఖిల లోకములకు
నిర్మాత[2] యతడౌ = సకలయుగముల కతడే - సర్వేశ్వరుండంచు - ప్రకటించి
పాడుదము - ప్రఖ్యాతముగను[3] ||ఘన||

2 ధరణి నర్నరులకు - ధర్మార్థముగ జీవ - వరము లియ్యను భువిలో -
నరుడైనా డతడే = కొరత లన్నియు దీర్ప - మరణమై లేచిన - వరప్రభుడే
యని - వందింత మిచటన్ ||ఘన||

3 నిరతము తను నమ్ము - నిజభక్తాళిని[4] బ్రోచు - నిర్మలాత్ముం డతడే
నిశ్చయమ్ముగను = పరమున[5] వీణలతో - పాటల్ బాడునప్పు - డరిమురిగా[6]
మనతో - మురియు ప్రభువునకు ||ఘన||

4 కరుణాలయు డతడే - పరమాలయు డతడే - పరికింప మనకెల్ల
పరమ ప్రభు డతడే = ధరణి వాసులకెల్ల - దైవ మొక్క– డతండే - గురు
డేసు క్రీస్తంచు - సుమిగ[7] బాడుదము ||ఘన||

5 నిండైక మత్యమున - నిశ్చయమ్ముగ గూడి - యుండిన మన సభకు
నుద్ధారకు[8] డతడే = మండిత[9] గుణమణి - మరియాంబ తనయుని - యుద్ధ
బాయక లొంగి - యుండుద మామెన్ ||ఘన||

---

1 ఎల్లప్పుడు 2 సృష్టికర్త 3 ఎక్కువగా 4 తన భక్తుల సమూహమును 5 పరలోకమున
6 మిక్కిలి 7 ఏకముగ 8 రక్షకుడు 9 ప్రకాశించుచున్న.

## 6—A జగత్ప్రభు వర్ణన.

రా— ఆనందభైరవి. తా— జంపె.

మహిమ సర్వోన్నత - మైన నైనమున కి-మ్మహి సమాధా నాను-
గ్రహము గల్గు ప్రభో ||మహిమ||

1 నిన్ను స్తోత్రించుచు - నిన్ను బూజించుచు - నిన్ను మహిమ
పర్చుచు - న్నాము లోక ప్రభో ||మహిమ||

2 ప్రభువైన దేవుండా - పరమండలపు రాజా - ప్రబలంబుగల తండ్రి
-పరిశుద్ధంబగు ప్రభో ||మహిమ||

3 వినయంబుతో నీదు - ఘన మహిమార్థంబై వం - దనము లర్పించి -
వినుతింతుము సత్ప్రభో ||మహిమ||

4 జనితైక పుత్రుడగు - ఘన క్రీస్తేసు ప్రభు - దేవుని గొర్రెపిల్ల జన-
కుని కుమారుడ ప్రభో ||మహిమ||

5 ధర పాపముల మోయు - నర పుణ్యశాలుండా - కరుణించి మా బీద-
మొర లాలించుము ప్రభో ||మహిమ||

6 తండ్రియైన దేవుని - దక్షిణ భాగమున గూ - ర్చుండి యున్నావు
కృప - జూపుమి సత్ప్రభో ||మహిమ||

7 పరిశుద్ధుడవు నీవే - పరమ ప్రభుడవు నీవే - దురితాత్ములం గాన -
మరణంబైతివి ప్రభో ||మహిమ||

8 పరమ జనకుని మహిమకు - పరిశుద్ధాత్మైక్యంబై - సరణి మాకై
యున్న - సర్వోన్నత ప్రభో ||మహిమ||

---

## 7 God our Redeemer.

దేవుడు నిస్తారకుడు.

రా—కేదారగౌళ. తా—ఆది.

దేవా— దివ్యానంత ప్ర-భావా-మాం పాహి[1] ఘన యెహోవా= స్థావర జంగము-సహిత[2] నిఖిల జగ[3]-దావన[4] పావన[5] భావ నిరంతర
॥ దేవా ॥

1 సార - కారుణ్య పారా-వారా[6] - సర్వజ్ఞ నిర్వి-కారా - యేసు నామా - తారా-దీన జనోప-కారా=ఘోరమైన సం-సారాటవి[7] బడి - దారి గనని నను - జేర బిలిచితివి ॥దేవా॥

2 అక్షీ-ణ విభవానంద[8] - మోక్ష - రాజ్య మహిమా - ధ్యక్ష[9] - సంతత[10] సుజన - రక్షా[11] -కపట దుర్మనుజ - శిక్షా = పక్ష విపక్ష వి - లక్షణ రహిత[12] క-టాక్షము నా పైన-దీక్షను నిలుపవె ॥దేవా॥

3 సుందరాశ్చర్య గుణ-బృందా[13]-బంధుర[14] నిత్యా-నందా-సాధు సజ్జన-వంద్యా[15]-ఖండిత కలుష-బృందా[16]=మంద మతిని నా-డెందము కడు తెలి - వొంద జేసి నీ - యందు నిలుపగదె ॥దేవా॥

4 నీవు - నన్ను సృజించి - నావు - నా గురురాడ్దేవు - డవు[17] క్రీస్తు యేసుని - చావు - వలన నన్మనిపి - నావు[18]=త్రైవిధ జనక సు-తాత్మల తోడను - సేవల మొక్కడ - వై వెలిగెడి ప్రభు ॥దేవా॥

---

1 నన్ను రక్షింపుము 2 చలింపని వాటితోను, చలించువాటితోను గూడుకొనిన 3 సమస్త లోకమును 4 రక్షించు 5 పరిశుద్ధపరచు 6 సారమైన కరుణకు సముద్రుడా 7 సంసార మనెడి అడవి 8 తరగని భాగ్యమును ఆనందమును గలవాడా! 9 మహిమకు అధికారి 10 ఎల్లప్పుడు 11 మంచివారిని రక్షించువాడా! 12 శత్రుమిత్రత్వ భావములు లేని 13 గుణసమూహము గలవాడా 14 చక్కనైన 15 నమస్కరింపబడ దగినవాడా! 16 ఏమాత్రము పాపము లేనివాడా! 17 నా గురువవు, రాజవు, దేవుడవు 18 బ్రతికించినావు

5 ప్రేమ – స్వరూప నిత్య – క్షేమ–పవిత్ర పావన – నామా[1] – దాస లోకాబ్ధి – సోమా[2] – సర్వోత్త పరమ – ధామా[3] = నేను మెరుంగని[4]– నీచుడ నధముండ – నో మహాత్మ దయ – తో మన్నింపవె ॥ దేవా ॥

## 8 *All glory be to God on high.*

మింట నున్న దేవునికి స్తవము.

చాయ:– వినరమ్మ యేసు నాసుడ అను కీర్తన యొక్క రెండవ రాగము

ఘనదేవ! మింట నుండేను నీ – కనయము[5] స్తవము – నీ కనయము స్తవము – నీ కనయము స్తవము = వినుతియును గల్గు – వేవిధముల– మింటిని[6] భువిని ॥ఘన దేవ॥

1 మానవాళితోడ సమం – ధానపడితివి– సంధానపడితివి – సంధానపడితివి = ఏ హాని కలుగ – దణగె వైర – మంతయు శుభము ॥ఘన దేవ॥

2 నీ పాలనంబు జ్ఞాన న్యాయ – నియత[7] మెప్పుడున్ – న్యాయ నియత మెప్పుడున్–న్యాయ నియత మెప్పుడున్ =భూపాల! తండ్రి! నిన్నె గొలుతు – మేపు మీరగ ॥ఘన దేవ॥

3 మాకు పరమ జనకునకును – మధ్యవర్తివై – నీవు మధ్యవర్తివై – నీవు మధ్యవర్తివై = ఓ శ్రీకర! జని – తైక పుత్ర! శ్రేయ మొసగితి[8] ॥ఘన దేవ॥

4 యేసయ్య దేవు గొర్రెపిల్ల – దోసరహితుడ! – ఓ దోసరహితుడ ! – ఓ దోసరహితుడ! = ఆ సుగతికి – దీసి మమ్మ– నాదరింపుము ॥ఘన దేవ॥

5 దైవాత్మ! శ్రేష్ఠవరమవు – శ్రీ దేవ పావన – శ్రీ దేవపావన– శ్రీ దేవ పావన = మా వాది[9] గెలిచి – మనగ నిమ్మ – మాకు బలమును ॥ఘన దేవ॥

---

1 పాపులను పవిత్రపరచువాడను పేరు గలవాడా! 2 దాసుల సమూహ మనెడి సముద్రము నకు చంద్రునివంటివాడా! 3 శ్రేష్ఠమయిన నివాసస్థలము గలవాడా! 4 క్రమము ఎరుగని 5 ఎల్లప్పుడు 6 పరలోకమందు 7 కూడినది 8 మోక్ష మిచ్చితివి 9 మా శత్రువు (సాతాను)

6 క్రీరక్షకుండు వాకయి తన – రక్త మొసగెను – తన రక్త మొస
గెను – తన రక్త మొసగెను = ఆ రక్షణ మును – రక్తిగొనగ[1]–నే క్తినియును
||ఘన దేవ||

---

## 9 *Gratefulness to Christ.*

క్రీస్తునకు కృతజ్ఞత తెలుపుట.

రా—సెహాన. తా—ఆది.

యేసు నాథా రారారా – నా – జీవనాథా రారారా ||యేసు||

1 దోస జనుల కొరకు నీవు – వోసి లొగ్గితివి తండ్రి ||యేసు||

2 కృపలో మమ్ముర్లను – కూర్చి యున్నావు తండ్రి ||యేసు||

3 నీచులను ప్రేమించి – నీ కరుణ జూపినావు ||యేసు||

4 నీతిమంతులకు నీవు – నిత్యజీవ మిచ్చినావు ||యేసు||

5 పొందరాని కష్టములను – పొందియుంటివి తండ్రి ||యేసు||

6 లోక నాథుని జయించి – లోకుల రక్షించితివి ||యేసు||

7 పొందజాలని కృపను – పొందియున్నాము తండ్రి ||యేసు||

8 వేడుకతో మేము – వేడుకొందుము తండ్రి ||యేసు||

---

విన్నపము.

## 10 *Ask, and it shall be given.*

అడుగుడి మీకు ఇయ్యబడును.

రా—పంతువరాళి. తా—ఆది.

దాసుల ప్రార్థన దప్పక – యొసగెడు – యేసు నాయకుడే
మా వేల్పు[2] = దోసకారి బహు – మోక్షనుడైనను – దోసి లొగ్గ ఒర – నాసి
జేసెనట ||దాసుల ప్రార్థన||

---

1 ఆసక్తితో పొందునట్లు 2 దేవుడు

1 జనరహిత స్థలమున[1] జని వేడెడి - మనుజుల ప్రార్థన వినుచుం డున్ = దన పాదము న-మ్మిన సాధూత్తము- జనదర్శనమున- సంతస మిడు నట ||దాసుల ప్రార్థన||

2 మది విశ్వాసము గూడిన ప్రార్థన - సదయత[2] వినుటకు జెవు లొగ్గున్ = హృదయము గనుగొని - యుచిత సమయమున - గుమరుగ భక్తుల - కోర్కె- లిచ్చునట ||దాసుల ప్రార్థన||

3 మునుమున నిద్దరు ముగ్గురు నొకచో - బరిలముగా దను ప్రార్థిం పన్ =విడలక తా నట - వచ్చి యుండునని- వ్యాముపుగ బలికిన - కృత రక్షణుఁడట[3] ||దాసుల ప్రార్థన ||

---

## II Certainty of Prayer.

### ప్రార్థన నిశ్చయము

రా—నాథ నామక్రియ. తా—ఆది.

నమ్మి ప్రార్థించుము-యేసుని ద్వారా-నమ్మి ప్రార్థించుము= నమ్మినవారిని గావను వాగ్దా-నమ్ము జేసెనె కృప నిత్తునని || నమ్మి ||

1 నమ్మి మేల్జేయుము-యెహోవాయందు-నమ్మి మేల్జేయుము= నమ్మి మేలు జేసితివా నిశ్చ-యమ్ముగా నీ వెప్పుడు జీవింతువు || నమ్మి ||

2 నమ్మకము వీడకు-శోధనలు జూచి-నమ్మకము వీడకు=నమ్ముము వానిని గెలువను సాహా-యమ్ము యెహోవా యిచ్చు సత్యము || నమ్మి ||

3 నమ్మి జీవించుము - యెహోవాయందు - నమ్మి జీవించుము =నమ్మి యెనుదు చూచెదు భక్తుల భా-గ్యమ్ము నిత్య సౌఖ్యమ్ము పరమున ||నమ్మి||

---

1 జనులు లేని చోటకు 2 ఎల్లప్పుడు 3 రక్షణ నెరవేర్చినవాడు

## 12 *The Lord's Prayer.*

ప్రభువు నేర్పిన ప్రార్థన

రా—ఆనందభైరవి. తా—త్రిపి.

ఓ మా తండ్రి నీదు నామము—నిత్య మెన్న—బడుదు గాక—సకల
లోకము—క్షేమముగను విమలముగను[1]—జెన్ను మీరగ[2] పరలోక—ధాము
డవై[3] వెలయునట్టి—ధన్య సౌజన్య మాన్య[4] ॥యో మా తండ్రి॥

1. నీ రాజ్యంబు రానిమ్ము—నీదు చిత్తము—నేటుగ—పరలోక
మందు—నెరవేరగను జేయబడునో—యీ భూలోకమందు నట్టి—దారి
బొందజేయవలెను—ధర్మమూర్తి సత్యవర్తి ॥యో మా తండ్రి॥

2 నేటి యాహారంబు మాకు—గరుణ జేసి—నేటి కిచ్చి—నాటి పదు
చుమిక—మేటిరి మా విరోధి జనుల—మే మెటుల క్షమింతు మటుల—
మాటికిని క్షమింప నీవె—మాకు వేరు లేరు సుమ్ము ॥ఓ మా తండ్రి॥

3 మమ్ము శోధనమునకు దేవము—కీడునుండి—మరల జేయు—
మమ్ము నేమనన్—ఇవ్వరకు[7] బల మహిమ రా—జ్యమ్ములన్ సర్వ
కాలమ్ము నీవె నాదు ప్రార్థ—నమ్ము జేకొమ్ము ఆమేన్ ॥ఓ మా తండ్రి॥

---

## 13 *Prayer for Divine Help.*

దైవ సహాయము కొరకు వేడుకొనుట.

రా—నాథనామక్రియ. తా—అట.

దేవా! సహాయము నిమ్ము—నిత్య—జీవంపు బాటలు ద్రొవ్వుట
కిమ్ము ॥ దేవా ॥

---

1 పరిశుద్ధముగను. 2 శోభగా. 3 నివసించువాడవు. 4 మంచితనమునుబట్టి మన్నింపబడ దగినవాడా! 5 చక్కపరుచుము. 6 గొప్ప. 7 శ్రేష్ఠముగు.

1 గడియ గడియకు నేగెను నమ్ము[1]_ లెంతో _ వడిగా నొప్పె వచ్చె
నరకమార్గణము[2]_లెడ తెగని శోధనములు _ నీవు _ పడగొట్టి వేగమె దృఢ
భక్తి నిమ్మా ||దేవా||

2 కోటాన కోటి కష్టములు _ నాకు _ మాటి మాటికి వచ్చె మరి
యుత్కృష్టములు[3] _ సాతాను సాధనములు _ నేను దాటి నీ రెక్కల
చాటున నుండ || దేవా ||

3 యెహోవా నీ హస్తములు _ మమ్ము _ బహుగా శ్రమలు పెట్టి
పరచె గాయములు _ కథవలె మా దివసములు _ మేనుగడిపెడి యీ భీతి
కాలంబులోన || దేవా ||

4 దారా పుత్రుల[4] పైని భ్రమలు _ నన్ను _ సారె సారెకు నీడ్చు
లౌక్య భాగ్యములు _ ఘోరమగు నాత్మికములు _ న _ న్నిరీతి భ్రమ పెట్టె
ధారుణిలోన || దేవా ||

5 మా యాయువు దివసములు _ చెట్టు _ చాయవలె దరుగుచు వంటి
కవుపాలు _ చాలు ని లోకంబు మేలు _ మేము _ పరలోక రాజ్యము
చేరేదె మేలు || దేవా ||

6 మంచి మరణం బిమ్ము దేవా _ మమ్ము _ వంచించు సైతాను వల
నుండి గావ _ నెంచి దూతల నంపినావా _ మాకై _ యేను[5] గాయము
లొంద యేసు నిచ్చితివే || దేవా ||

---

## 14 *Prayer for Grace.*

కృపకొరకు ప్రార్థన

రా__శ్రీ. తా__అట.

ఆలింపు దేవా _ నా మనవుల _ నాలింపు దేవా = ఆలింపు నా దేవా _
యన్ని సమయంబుల _ జాల గనపరచుచు _ జక్కని నీ దయ || నాలింపు||

---

1 బాణము. 2 బాణము. 3 గొప్పవైనవి. 4 భార్య, పిల్లలు. 5 అయిదు

1 సకల సత్య భాగ్య - సంపద నీయందు - వికలంబు గాకుండ[1] - వెలయు నెల్లప్పుడు ||నాలింపు దేవా||

2 పలుమారు నీ వొసగ - బరమ భాగ్యంబులు - పొలిసిపోను[2] నీను - కలిమి కొసంతైన ||నాలింపు దేవా||

3 నా యఘము లన్నియు[3] - నా తండ్రి క్షమియింపు - నీ యనుగ్రహము చే - నీ సుతుని కృతమున ||నాలింపు దేవా||

4 నీ యాజ్ఞ లన్నియు - నేను జక్కగ సల్ప - నీ యందు నమ్మిక - నెగడింపు[4] మనిశంబు[5] ||నాలింపు దేవా||

5 నీ సేవ యొనరింప - నిండుగ నిలలోన - నీ సేవకుని కిమ్ము - నీ శుద్ధాత్మను గృపచే ||నాలింపు దేవా||

---

## 15 *Prayer to Christ.*

పూర్ణాధారి యైన క్రీస్తునకు ప్రార్థన.

రా—జంఝూటి. తా—ఏక

వినరమ్మ యేసు నాథుడ - నా మనవిని నిప్పుడు = ఘన - మైన నీమ నెనరుచే నను - గావుమి యెప్పుడు ||వినరమ్మ||

1 ఎక్కడ - డిగ్గరు ముగ్గురు నీ - యొక్క - పేరిట = జేరు - టెక్కడో నే నక్కడ - కే తెంతు నంటివి || వినరమ్మ ||

2 మరి యెవరు దిక్కు - ధరణిలోన - వేరు లేరుగ = నక్కరల కెల్ల దెరవు జెప్పి - నావు నీవెగ || వినరమ్మ ||

3 మరణమైతి వహహా నా - కొరకు సిల్వపై = నీ - కరుణ గల్గె నెంత యీ - దురాత్ముని నాపై || వినరమ్మ ||

1 చెడిపోకుండ 2 తగ్గిపోదు. 3 పాపము లన్నియు 4 వృద్ధిచేయుము. 5 ఎల్లప్పుడు 6 ప్రేమతో

4 సకలంబు నీ నటించు మదిని - సంతసించెద = వే - రొకటి లేదు
ఈ ప్రపంచ - కంబు మీద || విన రమ్మా ||

5 కోరితి నిను దారిగ నను - మార పర్చకు=నీ - హారిమి 1 నా కొసగి
నడుపు - మరణావధికి 2 || విన రమ్మా ||

6 వినయంబు సద్గుణంబు చిత్త - మునను గూర్చ వే=ఘనమైన
నీతి యనుభవంబు - గలుగ జేయవే || విన రమ్మా ||

7 దేవ దేవ రావె నిన్ను - సేవ జేతును=నను - పావనునిగ జేయవే
నే - పాపి నరుడను || విన రమ్మా ||

---

## దేవుడు, ఆయన కార్యములు—దైవ సంరక్షణము.

## 16 *Sweet is the memory of Thy grace.*

145 దావీదు కీర్తన

బాణీ : నా కాల గతు లెవ్వ ?

నా దేవా దివి3 రాజా - నీ ప్రేమ తలపే యా - నందమయ్యా =
నరులు - నీ దివ్యనీతిని - నుతియించుచుందురు - నిత్యమున్ను || నా దేవా||

1 పరమండలంబున - వసియించుచున్నను - ప్రభువు తాను=కృపను-
ధరపై కుమ్మరించి - ప్రతి జీవి యక్కర - తనివి జేయు4 || నా దేవా||

2 దినభుక్తికై జీవుల్ - కనులార గనిపెట్ట - గాంచి నీవు = చేయి -
ఘనముగా విప్పి భో - జన మిచ్చి యొసగుదువు - కలుము లెల్ల || నా దేవా||

3 నీ కరుణ నీ జాలి - నిశ్చలమై యుండు - నిరతమున్ను = ప్రభువా
నీ కోప మది క్షణమె - నిలిచి పోవును పిదప - నిజముగాను || నా దేవా||

4 నీవు ప్రేమించెడి - నీ భక్తులకు ముదము - నిత్య ముండ=త్వరలో
నీ వీయుదువు పాప - క్షమ నిచ్చు వాక్యము - నెనరుతోడ || నా దేవా||

---

1 స్నేహము. 2 చావువఱకు 3 పరలోకపు. 4 తృప్తిపరచు

5 సకల జీవులు నీదు - శక్తి కీర్తుల నెపుడు - చాటుచుండున్ = భక్తుల్ - ప్రకటంబా నీ కృప - రుచి చూచి నీ పేరు - పాడుచుండున్ ||నా దేవా||

---

17 103 వ దావీదు కీర్తన

రా___ఆనంద భైరవి. తా___త్రిపుట.

దేవ సంస్తుతి చేయవే మనసా - శ్రీమంతుడగు యె - హోవ సంస్తుతి చేయవే మనసా = దేవ సంస్తుతి చేయుమా నా - జీవమా యెహోవా దేవుని - పావన నామము నుతింపుమా - నా యంతరంగము - లో నివసించు - నో సమస్తమా || దేవ ||

1 జీవమా యెహోవా నీకు - జేసిన మేళ్లన్ మరువకు = నీవు చేసిన పాతకంబులను - మన్నించి జబ్బు - లేవియున్ లేకుండ జేయును - ఆ కారణము చే || దేవ ||

2 చావు గోతినుండి నిన్ను - లేవనెత్తి దయను కృపను = జీవ కిరీటముగ వేయును - నీ శిరసుమీద - జీవ కిరీటముగ వేయును_ఆ కారణము చే దేవ ||

3 యౌవనంబు పక్షిరాజు - యౌవనంబు వలెనె క్రొత్త = యౌవనంబై వెలయునట్లుగ - మే లిచ్చి నీదు - భావమును సంతుష్టి పరచునుగ - ఆ కారణముచే || దేవ ||

4 ప్రభువు నీతి పనులు చేయున్ - బాధితులకు న్యాయ మీయున్ = విభుడు మార్గము తెలిపె మోషేకు - తన కార్యములను - విప్పె నిశ్రాయేలు జనమునకు - ఆ కారణముచే || దేవ ||

5 అత్యధిక ప్రేమా స్వరూపి - యైన దీర్ఘ శాంతిపరుడు = నిత్యము వ్యాజ్యంబు చేయడు - అకృపోన్నతుడు - నీ పయి నెపుడు కోపముంచడు - ఆ కారణముచే || దేవ ||

6 పామరులమని[1] - ప్రత్యపకార - ప్రీతి ఫలంబుల్ సంపలేదు =
భూమికన్న నాకసంబున్న - యెత్తుండు దైవ - ప్రేమ భక్త జనుల యా
డున - ఆ కారణముచే ॥ దేవ ॥

7 పడమటికి తూర్పెంత యెడమో - పాపములనుండి మనను నంత =
యెడము కలుగజేసి యున్నాడు - మన పాపములను - నెడముగా జేసి
యున్నాడు - ఆ కారణముచే ॥దేవ॥

8 కొడుకులపై తండ్రి జాలి - పడు విధముగా భక్తిపరుల=యెడల
జాలిపడును దేవుండు - తన భక్తిపరుల - యెడల జాలిపడును దేవుండు
ఆ కారణముచే ॥దేవ॥

9 మనము నిర్మితమయిన రీతి - తనకు దెలిసియున్న సంగతి = మనము
మంటి వారమంచును - జ్ఞాపకముచేసి - కొనుచు స్మరణ చేయుచుం
డును - ఆ కారణముచే ॥దేవ॥

10 పూసి గాలి వీవ నెగిరి - పోయి బసను దెలియని పువ = వాస
పుష్పము వలెనె నరుడుండు - నరు నాయువు తృణ - ప్రాయము శ్రీదేవ
కృప మెండు - ఆ కారణముచే ॥దేవ॥

11 పరమ దేవ నిబంధనాజ్ఞల్ - భక్తితో గైకొను జనులకు = నిర
తమును కృప నిలిచి యుండును - యెహోవా నీతి - తరముల పిల్లలకు
నుండును - ఆ కారణముచే ॥దేవ॥

12 దేవుడాకాశమున గద్దె[2] - స్థిరపరచుకొనె ; సర్వ మేలుగ = దేవ
దూతలార దైవాజ్ఞ - విని వాక్యము నడుపు - దిట్టమైన శూరులారా -
స్తోత్రంబు చేయుడి ॥దేవ॥

13 దేవ సైన్యములారా యాయన - దివ్యచిత్తము నడుపునట్టి = సేవకా
వళులారా దేవుని - పరిపాలన చోట్ల - లో వసించు కార్యములార - సంద
నము చేయుడి ॥దేవ॥

---

1 అజ్ఞానులమని 2 సింహాసనము

## 18 *The Lord is my Shepherd*

23 వ దావీదు కీర్తన.

రా—ఆసావేరి. తా—త్రిపుట.

నా కేమి కొదువ - నాథు డుండగ, ఇక = శ్రీకరుండగు దేవుడే నా -
శ్రేష్ఠ పాలకుడు[1] - నా - యేక రక్షకుడు గనుక ‖ నా కేమి‖

1 ఎన్నటికైన - ఎండనట్టి = సన్న పచ్చిక వంటి తరుగని - సము
పాయంబుల్ - నా - కెన్నో చేయున్ గనుక ‖ నా కేమి‖

2 తనివి దీరన్ మే - ల్లనుభవింప = నను సదా మే - ల్లనెడి పచ్చిక -
నడిమి మృదువుగ - పండు - కొన జేయును గనుక ‖ నా కేమి‖

3 ఎంత శోధన - యెండ యున్న = ఎంతయు నో - రిగర దెపుడు -
శాంత జలములు - నా - చెంతనే యుండున్ గనుక ‖ నా కేమి‖

4 తప్పిపోయిన నన్ - దారిం బెట్టి = తెప్పరిల్ల జేసి నాకు - తీర్పు
నలసటను - నా - తప్పు మన్నించున్ గనుక ‖ నా కేమి‖

5 నీతి మార్గమునన్ - నిల్పున్ నన్ను = నీతిలేని నాకు తన సు - నీతి
దయ చేయున్ - స్వ - నీతినిన్ మర్పించున్ గనుక ‖ నా కేమి‖

6 చావు చీకట్ల - శక్తి యుండు = లోపలో బడి పోవలసినను - నే
వెరవకుండ - నా - దేవుడే తోడు గనుక ‖ నా కేమి‖

7 కష్టంబు లను చీ - కటి లోయలో = స్పష్టముగ ఘనసౌఖ్యమును
నా - దృష్టికిం జూపి - నా - నష్టముల్ దీర్చున్ గనుక ‖ నా కేమి‖

8 మీద పడునట్టి - శోధనలన్ = నా దరికి రానీక దండము - నన్నా
లాగుచును - నా - కాదరణ యౌను గనుక ‖ నా కేమి‖

9 పగవారల్ సిగ్గు - పడునట్లుగ = జగతి యెరుగని సౌఖ్య భోజన -
మగపరుచుచును - హా - తగినదే పెట్టున్ గనుక ‖ నా కేమి‖

---

1 కాపరి

10 తన యాత్మానంద - తైలంబుతో=అను దినము తల - యంటి
విసుగు - కొనక తుడుచును - నా-కను నీళ్ళన్ని గనుక ||నా కేమి||

11 పలువిధములైన - భాగ్యములతో = వెలుపలికి దిగ-వెడలునట్టి[1]-
వెలగల గిన్నె-నా-కలిమిగా జేయున్ గనుక ||నా కేమి||

12 బ్రతుకంతటన్ కృ - పా క్షేమములు = వదలకుండగ వచ్చు
నాతో-సుదినములు గల్గ-నా-పదలు సంపదలౌ గనుక ||నా కేమి||

13 దురితంబు లుండు - ధరణి నాకు = ఇరవు[2] కాదిక - నెప్పటికి
నా- పరమ దేవుని-మం-దిరమె నా యిల్లు గనుక ||నా కేమి||

14 జనక సుతాత్మ - లను దేవుడు = ఘనముగా యు - గముల నన్నిట-
వినుతు లొందును - నే నా-యన గొర్రెనే గనుక ||నా కేమి||

---

## 19 *Thou art my Help.*

నీవే నా సహాయుడవు.

రా—శంకరాభరణము. తా—ఆట.

నా కాల గతు లెవ్వి - నా చేతులను లేవు - నాదు దేవ = యెపుడు-
నీకే వానిమీద-నిత్యాధికారంబు నిండియుండు ||నా కాల||

1 తల్లి గర్భంబున - దనర సృజించితివి - ధరణి నన్ను = నీవు - తల్లి
కన్నను మిగుల - దయచేత జూచితివి - తండ్రి నన్ను ||నా కాల||

2 పాపకూపమందు[3] - బడియుండగా నన్ను - బార జూచి=చెయ్యి -
జాపి యేసుని ద్వారా - చక్కగా దెచ్చితివి చాలు దేవ ||నా కాల||

3 సుఖదుఃఖ కాలములు - శోధింప బంపుదువు - శోభాయుక్త[4] =
నాకు సుఖము గలుగజేయు - సొంపుగ వానిచే - స్థూల[5]శక్తి ||నా కాల||

4 సకల కాలంబుల - జక్కగా లోబడి - సన్నుతింతు = నన్ను - నక
లంకగా[6] జేయు - మనుచు వేడుచునుందు - నధికాసక్తి ||నా కాల||

---

1 పొర్లునట్టి 2 నివాసము 3 పాపపు నూతియందు 4 కాంతితో గూడుకొన్నవాడా! 5 గొప్ప
6 పవిత్రునిగా.

## విమోచనము.

## 20 The Love of God

### దేవునియొక్క ప్రేమ.

రా—ఆనందభైరవి. తా—ఏక.

దేవుని ప్రేమ యిదిగో - జనులారా - భావంబునం దెలియరే=కేవలము నమ్ముకొనిన - పరలోక - జీవంబు మీ కబ్బును ॥ దేవుని ॥

1 సర్వలోకము మనలను - తన వాక్య - సత్యంబుతో జేసెను= సర్వోపకారి తండ్రి - మనమీద - జాలిపరుడై యుండెను ॥ దేవుని ॥

2 మానవుల రక్షింపను - దేవుండు - తన కుమారుని బంపెను=మన శరీరము దాల్చెను - యా ప్రభుడు - మన పాపముల దూరుడే ॥ దేవుని ॥

3 యేసు క్రీస్తను పేరున - రక్షకుడు - వెలసినా డిలలోపల=దోసకారి జనులతో - నెంతో సు - భాషలను బల్కినాడే ॥ దేవుని ॥

4 పాపభారంబుతోడ - నే శ్రాన్త - ప్రయాసముల నొందెడి= వారు లందరు నమ్మిన - విశ్రాంతి-పరిపూర్ణ మిత్తు ననెను ॥ దేవుని ॥

5 సతులైన[1] పురుషులైనన్ - ఆ కర్త-సర్వజనులయెడలను=సస్నేహముగ నడిచెను. పరలోక - సద్బోధ లిక జేసెను ॥ దేవుని ॥

6 చావు నొందిన కొందరిన్ - యేసుండు-చక్కగా బ్రతికించెను= సకల వ్యాధుల రోగులు - ప్రభు నంటి-స్వస్థంబు తా మొందిరి ॥ దేవుని ॥

7 గాలి సముద్రపు పొంగులన్ - సద్దణపి - నీళ్ళపై నడచినాడే= మేలు గల యద్భుతములు - ఈలాగు - వేలకొలదిగ జేసెను ॥ దేవుని ॥

8 చేతులను కొయ్యలోను - రారాజు - చేర మేకులు పొందెను=పాతకులు గొట్టినారే - పరిశుద్ధ - నీతి తా మోర్వలేకన్ ॥ దేవుని ॥

9 వీపులు రక్తము గారగ - దెబ్బలు - చెడుగు లందరు గొట్టిరి=వడిముళ్ళు[2] తలమీదను - బెట్టిరి - ఓర్చెను రక్షకుండు ॥ దేవుని ॥

---

1 స్త్రీలైన 2 వాడిగల ముళ్ళు

10 ఇన్ని బాధలు బెట్టుచు—నను జంపు—చున్న పాపనరులను=మన్నిం
చుమని తండ్రిని—యేసుండు—సన్నుతితో[1] వేడెను ||దేవుని ప్రేమ||
11 రక్షకుడు శ్రమ నొందగా—దేశంబు—తమ్రిణము చీకటయ్యెన్=
రక్షకుడు మృతి నొందగా—తెర చినిగె—రాతికొండలు పగిలెను||దేవుని||
12 రాతి సమాధిలోను—రక్షకుని—నీతి గల దేహంబును = పాతి
పెట్టిరి భక్తులు—నమ్మిన—నాతు లందరు[2] జూడగ || దేవుని ||
13 మూడవ దినమందున—యేసుండు—మృతి గెల్చి లేచినాడే=నాడు
నమ్మిన మనుజులు—జూచిరి—నలువది దినములందున్ ||దేవుని ప్రేమ||
14 పదునొకండు మారులు—వారలకు ప్రత్యక్షమయ్యె యేసు = పర
లోకమున కేగెను[3]—తన వార్త—ప్రకటించుమని సెల్వి—చ్చి ||దేవుని ప్రేమ||
15 నమ్మి స్నానము నొందెడి—నరులకు—రక్షణ మరికల్గును=నమ్మ
నొల్లక పోయిన—నరులకు—నరకంబు సిద్ధ మనెను ||దేవుని ప్రేమ||

---

## 21 *I was a wandering sheep.*

తప్పిపోయిన గొఱ్ఱె.

(రాగము : విజయంబు విజయంబు)

నే దప్పిపోయిన—నీచంపు గొఱ్ఱెనై—నా దొడ్డి నా యింటి—
మోదంబు విడిచి=నాను కాపరి తండ్రి—నయ మొప్ప బ్రేమించి—యాద
రింపగ నే లో—నయి యుండకను జెడితి || నే దప్పి||

1 తనను గొఱ్ఱెను వెదకె—ఘనుడైన కాపరి—దనరు బిడ్డను గాంచె—
ఘనకుండు తండ్రి=వనములందున లోయ—లను మెట్టలను దిరిగి—పెను
బాములను[4] జెంది—నను వెదకి పట్టెను || నే దప్పి||

---

1 పరిశుద్ధమైన స్తుతితో. 2 స్త్రీలందరు 3 వెళ్లెను 4 గొప్ప కష్టములు.

2 ఒడ లెఱుంగక త్రుళ్ళి - పడి చెడి క్షీణించి - కడు వెతలను గుంది[1] - పడియు[2] తరుణమున = తడయక తన ప్రేమ - త్రాళ్ళతో నను గట్టి - ఘుమును అన్నిటి నుండి - యెడబాపి తెచ్చెను ॥నే దప్పి॥

3 నా యాత్మన్ ప్రేమించి - స్వీయ[3] రక్తము చేత - నన్ పవిత్రుని జేసి - నది ప్రభు క్రీస్తే = నా యాత్మ కాపరి - పోయెద నని వెనుక - తీయక నను వెచ్చి - తిరిగి దొడ్డిని జేర్చె ॥నే దప్పి॥

4 నేను మూర్ఖత చేత - నిజ మార్గమును నేలు - వాని ధిక్కరించి[4] నరకమున[5] బడితి = గాని యిప్పుడు తండ్రి - కరుణ జేర బిల్వ - నే నా శబ్దము విని - నిత్యము హర్షింతును[6] ॥నే దప్పి॥

---

## *Jesus our Redeemer.*

### యేసు మన విమోచకుడు.

రా___ వేగుప్తి. తా___ ఆది.

యేసుని సేవింప దయచేసితివి - ప్రేమా స్వరూప - యేసుని సేవింప దయచేసితివి = దాసుల నందర దరి జేర్చుటకును - వారికొక్క - పరవాసము చేసెడి ॥యేసుని॥

1 ఆకాశంబు భూమ్యాకాశంబుల - నాది శక్తిని పార[7] సృజించిన ॥యేసుని॥

2 శిశువులగు జనసంఖ్యను బోడగని[8] - మిత్రుడగుచు దన మేను[9] నొసంగిన ॥యేసు॥

3 పాపులెల్ల దన ప్రాపు నొందుకొని - దాపుగ నుండని దయచే బిల్చెడి ॥యేసుని॥

4 సకల శుభంబులు చక్కగ నిచ్చును - సకల భక్తులను సమముగ జూచెడి ॥యేసుని॥

5 తన్ను నమ్ముకొని యున్న దీనులకు - దన్నుగ[10] నుండెడి సన్నుతి పాత్ర మా ॥యేసుని॥

---

1 అనేక కష్టములలో మునిగి 2 చనిపోవు 3 స్వంత 4 ఎదిరించి 5 చిక్కులో 6 సంతోషింతును. 7 చక్కగా. 8 చూచి. 9 శరీరము. 10 ప్రాపుగ.

6 చక్కని గుణములు లెక్కలేక తన - చక్కని యాత్మను చిక్కగ బట్టిన ||యేసుని||

7 లోక మంతయును లోబడుచుండగ - నేక ప్రభుండై యేలుచునుండుమా ||యేసుని||

---

## 23 *Jehovah's Love.*

యెహోవా యొక్క ప్రేమ.

రా—శంకరాభరణము. తా—ఆది.

యెహోవ నా మొరలాలించెను - దన - మహాదయను నను గణించెను[1] = అహర్నిశల[2] ధైర్య హీనుడగు నా - దుహాయనెడి ధ్వని[3] గ్రహించి మనిపెను ||యెహోవ||

1 పిశాచి కడిమి[4] బడగొట్టెను - దన - నశాన నను నిలుపబెట్టెను = ప్రశాంత[5] మధుర సువిశేష వాక్యాల - నిశాంతమున[6] జేర్చి సేదదీర్చెను ||యెహోవ||

2 మదావళము[7] బోలు నా మతిన్ - దన - ప్రదీప్త[8] వాక్యాంకుశా హతిన్[9] = యథేచ్ఛ లన్నిటి[10] - గుదిల్చి పాపపు - మొదల్ తుదల్ నరికి దరికి జేర్చెను ||యెహోవ||

3 అనీతి వస్త్ర మెడలించెను - యేసు నాథు రక్తమున ముంచెను = వినూత్న[11] యత్న మెంద నూని యెన్నడు - గనన్ వినన్ ప్రేమ నాపై జూపెను ||యెహోవ||

4 విలాపములకు[12] జెవి నిచ్చెను - ప్రేమ - కలాపములకు[13] నెల విచ్చెను = శిలా నగము[14] పైకి లాగి నను సుఖ - విలాసముల్ మనసు లోన నిలిపెను ||యెహోవ||

---

1 లక్ష్యము చేసెను 2 రాత్రింబగళ్ళు. 3 దుఃఖముచేత కలిగిన శబ్దము. 4 శక్తి 5 మిగుల నెమ్మదిగల 6 గృహమున. 7 మదించిన యేనుగు. 8 ప్రకాశమైన 9 అంకుశపు దెబ్బచేత. 10 కోరిక లన్నియు 11 క్రొత్త. 12 ఏడ్పులకు 13 సమూహములకు 14 రాతికొండ.

5 అగణ్య¹పాపి యని ద్రోయక - న - న్ను గూర్చి తన సుతుని దాచక = తెగించి మృతి కొప్పగించి పాపపు - వెగుల్² దిగుల్ బాగ సుగా నణంచెను ||యెహో||

---

## *Christ's eternal Love.*

క్రీస్తుని ప్రేమ అనంతమైనది.

రా__జంఝోటి. తా__ఆది.

యేసుని ప్రేమ - నే - నెంతని వర్ణించగలను = దోసకారుల కొరకై ప్ర - యాస మరణంబు నొందె ||యేసుని||

1 పాపము జేసి - దైవ - శాపము నొందనై యున్న = పాపుల గా ప్రేమ - జూపబడుట చోద్యము గదా ||యేసుని||

2 మంచి జతగానికి - నొక - మంచి వాడీ రీతి సమ్మ = తించి సుగ ణంబు నొంద తె - గించుట యరుదైన ప్రేమ ||యేసుని||

3 ఎంత గొప్పైన ప్రేమ - యిది - ఎంత వింతైన ప్రేమ = ఎంతో నను ప్రోసిన మది - కింతైన కారణము దెలియదు ||యేసుని||

---

## 25 *God's Love and Help.*

దేవుని ప్రేమా సహాయములు

రా__పున్నాగవరాళి. తా__చాపు

చూచు చున్నాము - నీ వైపు - మా ప్రియ జనక = మానుచు నీ ప్రేమ - సొంపు సువార్తను - జూచుచు కరములు - చక్కగా నీ వైపు ||చూచు||

---

1 ఎంచ శక్యముగాని. 2 బాధను.

1 మేము పగలమై[1] యుంటిమి - మార్గము వీడి - మేము సందరము పోతిమి = ప్రేమచే నప్పుడు - ప్రియ తనయు నంపించి - క్షేమ మార్గము మాకు - క్షేమము జేసితివి ||చూచు||

2 నిను నమ్ము పాపులకు - నా రెవరైన - నిను శరణు జొచ్చువార లకు = నినుడవు[2] కేడెంబు[3] - నీ జగతిలో నగుచు - గనుపరచుచుందువు - ఘనమైన నీ కృప ||చూచు||

3 నీ భయము మా యెదలను[4] - నిలుపుము నీదు - ప్రాభవం[5] మొనరం గను = నీ భయముచే మేము - వైభవ మొందుచు - నే భయము లేకుండ - నీ భువిని గొన్నాళ్లు ||చూచు||

4 దయ జూచి మము నెప్పుడు - మంచివి యన్ని - దయచేయు మెల్లప్పుడు = దయచేయుమని కోర - దయచేయ రానివి - దయచేయక వలదు - దయగల మా తండ్రి ||చూచు||

---

## సంఘ సంవత్సరము.

## 26 *Calling Christ.*

యేసుని రమ్మనుట

రా—రేగుప్తి. య—ఆది.

యేసు నాథుడా రమ్ము - నా - దోసము లెగజిమ్ము=దోసి లొగ్గిన- దాసాళిని పర - వాసుల జేసెడి - శ్రీసనాథుడవు ||యేసు||

1 నరక పాత్రుడను నేను - నను - కరుణించను నీ వేను = నిరతము నురితపు - భరితుడనై నిను - మరచినందుకు - నెరి చింతించితి[6] ||యేసు||

---

1 మేము శత్రువులమై 2 సూర్యుడవు 3 డాలు 4 మా మనస్సులయందు
5 ప్రభుత్వము 6 పూర్తిగా విచారించితివి

2 బలహీనుడ నే నయ్యా - నను - బలపరచుము మెస్సయ్యా = అలసి సొలసి ని - న్నెలుచుకొనుటకై - యిలను నిన్ను నే - గలయ వెదకితిని ||యేసు||

3 నన్ను విడువ నటంచు - నీ - వన్న పలుకులు స్మరించి = కన్నతండ్రి కృప - నన్ను విడువదని - గన్నది నా మది - నున్నది యీ కృప ||యేసు||

---

## 27 *Angel Gabriel visting Mary.*

మరియకు దూత దర్శనము.

రా—ఆనందభైరవి. తా—త్రిపుట.

వచ్చి గాబ్రియేలు పల్కెను - మరియ - మచ్చకంటి[1] డెందము ల్కె- ను[2] = హెచ్చైన శుభముల నెనలేని[3] కృప దేవు - డిచ్చి యింతులలో[4] ని - న్నెచ్చు జేయు నటంచు ||వచ్చి గాబ్రి||

1 భయ మాత్మలో వీడు[5] కన్యకా - నీవు - దయ బొంది యున్నావు ధన్యగా = రయముగ[6] నిదిగో గర్భము దాల్చెదవు పుత్రు - దయువా యే సను పే ర - తని కిడు మంచును ||వచ్చి గాబ్రియేలు||

2 అతడెన్నబడును మహాత్ముడై - సర్వో - న్నతుడైన వాని కుమారుడై = హిత మొప్ప దేవు డున్నతి జేసె దావీదు - వితత[7] సింహాసన - మతని కిచ్చు నంచు ||వచ్చి గాబ్రియేలు||

3 ఘనతనొందగు వాని రాజ్యము - నాశ మొనగూడ దది నిత్యపూజ్య ము = వినుతమగు[8] యాకోబు వంశ మెల్లపు డేలు - కొను నాత డనుచు చె - ల్పెను మాట మరియతో ||వచ్చి గాబ్రియేలు||

---

1 స్త్రీ 2 హృదయము ఉలికిపడెను 3 సాటిలేని 4 స్త్రీలలో 5 విడువుము 6 శీఘ్రముగా 7 వెడల్పయిన 8 పొగడబడ దగిన

## 28 *The Great Salvation.*

ఘన రక్షణము.

రా—పంతువరాళి. తా—జంపె.

ఇదిగో శుభద[1] రక్షణము - దేవుడు బంపె-నిదిగో శుభద రక్షణము= నవమలంబగు[2] పూర్వ - సత్య వాక్యమునందు - మృదువుగా దీర్ఘదర్శుల చేత బలుకబడె ||నిదిగో శుభద||

1 ఆల[3] పిశాచము తోడను - దేవుడు తొల్లి - బలుకు వాక్యము జూడను=పొలతి[4] సంతతి నిన్ను - తల గొట్టు బుట్టునని - తెలియజేసెను మోసె- దీర్ఘదర్శన వాక్య ||మిదిగో శుభద||

2 ఘన దివ్యబలి చేయను - పాపుల నెల్ల - దరి జేర్చి ప్రతికింపను= నొనరంగ[5] నీ కాల - మున క్రీస్తు వచ్చునని - ముని దానియేలు బల్కెను దీర్ఘ దర్శనము ||ఇదిగో శుభద||

3 యూదా రాజ్యము లోపట - బేత్లెహే మనెడి - యూర క్రీస్తుని పుట్టుట=యాదిలోనను మీకా - యను దీర్ఘదర్శిచే-మోదమున వెలుపబడె- ముందు లేఖనమందు ||నిదిగో శుభద||

4 మన దోసముల కోసమై - యేసుని కాయ[6]- మది గాయముల ప్రాస్వమై[7] = మన రక్షకుని పాట్లు - గనినట్టుల యెషయ్యా-ముని దెల్పె దీర్ఘదర్శన వాక్యముల నిచ్చి ||ఇదిగో శుభద||

---

## 29 *Christ is very dear to the Faithful.*

క్రీస్తు విశ్వాసికి బ్రియము

రా—హుసేని. తా—చాపు.

నన్ను గన్నయ్య - రావే నా యేసు - నన్ను గన్నయ్య-రావే నా ప్రభువా ||నన్ను||

---

1 శుభమిచ్చు 2 పరిశుద్ధమైన 3 ఆ 4 స్త్రీయొక్క 5 చక్కగా 6 శరీరము 7 క్షీణించి

1 ముందు నీ పాదార విందము[1] - లందు నిశ్చల భక్తి ప్రేమను = పొందికగా జేయ రావే నా - డెంద మానంద మనంతమై[2] యుప్పొంగ ||నన్ను||

2 హద్దు లేనట్టి దురాశల - నవివేకినై గూడి యాడితి = మొద్దులతో నింక కూటమి[3] - వద్దయ్యా వద్దయ్యా వద్దయ్యా తండ్రి ||నన్ను||

3 కాలము పెక్కు గతించెను - గర్వము లెడ తెగవాయెను = ఈ లోక మాయ సుఖేచ్ఛలు - చాలును చాలును చాలు నో తండ్రి ||నన్ను||

4 దారుణ[4] సంసార వారిధి[5] - దరి జూపి బ్రోవ నీకన్నను = గారణ గురువు[6] లింకెవ్వరు - లేరయ్యా లేరయ్యా లేరయ్యా తండ్రి ||నన్ను||

5 నావంటి దుష్కర్మ జీవుని - కేవలమగు నీదు ప్రేమని[7] = దీవించి రక్షింప నిప్పుడే - రావయ్యా రావయ్యా రావయ్యా తండ్రి ||నన్ను||

---

## క్రిస్మస్.

## 30 Christmas Praise.

క్రీస్తు జన్మ దినోత్సవ స్తవము.

రా॥—శుద్ధసావేరి. తా॥—అట.

యేసు నాథుం డుద్భవించె - నెల్ల - దాసజనము సంతసించె = నాస్తికుల వారి - యాత్మ రక్షకుండై - వాసి కెక్కిన దూత - వార్త ప్రకారంబు ||యేసు||

1 ఆది యంతము లేనివాడు - దై - వాత్మచే జన్మించినాడు = ఆది యంతముగాని - యాత్మైక్యమై యుండి - బీద లందరి గావ - నాది కుమారుండై ||యేసు||

---

1 పద్మములవంటి పాదములందు 2 ఎడతెగనిదై 3 సహవాసము 4 భయంకరమైన 5 సముద్రము 6 హృదయ తాపమును మాన్పు గురువులు 7 ప్రేమచేత

2 మున్ను[1] దూతలు దైవ జనులకు = చాటి - యున్న రీ బోల పనులు =
కన్నుల పండువుగ - గాంచంగ బడెను లో - కన్ను ద్దెరచి చూచి -
సన్నుతించుద మిలను ||యేసు||

3 గొల్లబోయలు చూచినారు - చూచి - యెల్లవారికి చాటినారు =
కల్లగాదు సువార్త - వల్ల దీని నెరిగి - యుల్లంబులో[2] నమ్మి - మూచిత
భాగ్యంబంద ||యేసు||

4 ఆకాశమున దూత లపుడు - మహి - మార్గంబుగా బాడి రిపుడు =
ఏకంబుగా మన - మెల్ల స్వరముల నెత్తి - యాకసమునకు నాద[3] - మంట
బాడుద మెపుడు ||యేసు||

5 జ్ఞాను లనబడు వారే తెంచి[4] - మ్రొక్కి - కానుక ధూపము లర్పించి =
యానంద భరితాత్మ - లైనారు మన మట్లు - పూని మనస్ఫూర్తి - పూజ
నర్పించుదము ||యేసు||

6 కోరి రీ ప్రభుని రాకడను - జనుల కోరి కితడని పిల్వబడెను = కోరి
యెుమరు చూచు - వార లీ సమయమున - సారెసారెకు దలచి - సన్నుతించిరి
మిగుల ||యేసు||

7 పాపిమీద ప్రేమ యెంత - మనుజ - రూపంబు ధరియించె
వింత = మాపు రేపు[5] లేని - మహిత స్వర్గము వీడి - శాపభారము దీర్చి - పాపా
త్ములను బ్రోవ ||యేసు||

---

## 31 *A Christmas Song.*

క్రిస్మసు గీతము.

(చాయ: యేసు నామము మహామృతము గదః లేక, సంతోషించుడి అందరు నాతో)

రా___శేగుప్తి. తా___ఏక

యేసు నాధుని యోధు లందరు - వాసిగ నిట రండు - వేగమే - వాసిగ

---

1 పూర్వము 2 మనస్సులో 3 శబ్దము 4 వచ్చి 5 రాత్రి, పగలు

నిట రండు=భాసురముగ ప్రభు జన్మము బాడుచు-నాసతోడ రండు-వేగమే-యాసతోడ రండు ॥జే జయం॥

1 దూతల మాదిరి గాత్రము[1] లెత్తుచు-గీతము బాడుండి-వేగమే-గీతము బాడుండి=దాతయౌ మన క్రీస్తుని నీతిని-ఖ్యాతిగ బలుకుండి-వేగమే-ఖ్యాతిగ బలుకుండి ॥జే జయం॥

2 గొల్లలు ప్రభు కడ కేగిన రీతిని-యెల్లరు నరుగుండి-వేగమే-యెల్లరు నరుగుండి=ఉల్లము లందున సంతసించి ప్రభు-నెల్లెడ దెలుపుండి-వేగమే-యెల్లెడ దెలుపుండి ॥జే జయం॥

3 జ్ఞానుల భంగిని[2] మానవు లందరు-కానుక లియ్యుండి-వేగమే-కానుక లియ్యుండి=మానవకోటికి రక్షణ భాగ్యము-దానము బొందుండి-వేగమే-దానము బొందుండి ॥ జే జయం ॥

4 మరియ మార్గమున మనసు లోపలను-మురియుచు నుండుండి-వేగమే-మురియుచు నుండుండి=అరయుచు నెదలో నేసు బాలుని-చరితము దలపుండి-వేగమే-చరితము దలపుండి ॥ జే జయం ॥

5 జయ జయ శబ్దము జేయుచు ప్రభునను-జయమని పాడుండి-వేగమే-జయమని పాడుండి=జయ జయ మంచును, జయ శబ్దముతో-జయముల నొందుండి-వేగమే-జయముల నొందుండి ॥ జే జయం ॥

---

## 32 *Unto you is born this day a Saviour.*

మీ కొరకు రక్షకుడు నేడు పుట్టియున్నాడు.

రా—సురటి. తా—త్రిపుట.

ఉదయించినాడు-క్రీస్తుడు నేడు-ఉదయించినాడు-మదిరాక్షి[5] మరియ-సంభవుడై[6] యిమ్మానుయేల్[7]=సదయుడై చనుదెంచి పృథివికి-

1 స్వరము 2 విధముగా 3 సంతోషించుచు 4 చూచుచు 5 స్త్రీ 6 పుట్టి
7 హెబ్రీ భాషలో "దేవుడు తోడై ఉన్నాడ"ను మాట

నొందఁ[1] సమ్మో[2]దముల పిశాచికి - మోద మణంగను సాధు జనముల - హృద
యముల ముద మెసఁగునట్లుగ ॥నుదయించినాఁడు॥

1 ఏ విభుని[3] వలన - నీ జగ మాయె - నా విభుఁ డీ యిలను = దైవత్వ
ముగ మును - మానవతారము దాల్చె = జీవులకు హీనముపై నిజ - దేవుఁడును
దా నొక్కఁడై చిర-జీవియగు ప్రభు పాపి జీవుల - గావ దన చావునకు
నొప్పబడి[4] ॥యుదయించినాఁడు॥

2 యూదుల నడుమన్ - పెక్కగు భేదా - భేదముల్ బొడమన్[5] =
వాదించి ప్రభు రాక - గాదంచు మది నెంచి = మీదు జూడని వారి కొఱకు
న-నాదరుండై[6] స్వీయ జనులకు - మోద మిగురొత్తంగ[7] మద్ఘనుఁడు-దౌర్
దయాళుఁడు ప్రాణ మిచ్చుటకు ॥నుదయించినాఁడు॥

---

## 33 *A Hymn of the Nativity.*

క్రీస్తు జన్మ కీర్తన.

రా—మధ్యమావతి. తా—అట.

రక్షకుఁడుదయించినాఁడట - మనకొఱకు పరమ - రక్షకుఁడుదయించి
నాఁడట = రక్షకుఁడుదయించినాఁడు - రారె గొల్లబోయిలార-తీవ్రమున
బోయి మన నిరీక్షణ ఫలమొందుదాము ॥రక్షకు॥

1 దావీదు వంశమందు - ధన్యుఁడు - జన్మించినాఁడు - దేవుఁడగు
యెహోవా మన - దిక్కు తేరి చూచినాఁడు ॥రక్షకు॥

2 గగనము[9]నుండి డిగ్గి - ఘనుఁడు గాబ్రియేలు దూత-తగినట్లు చెప్పె
వారికి-మిగుల పరితోషవార్త ॥రక్షకు॥

3 వర్తమానము జెప్పి దూత - వైభవమున బోవుచున్నాఁడు - కర్తను
జూచిన వెనుక - కొంతము విశ్రమం బప్పుడు ॥రక్షకు॥

---

1 కలుగునట్లు 2 సంతోషము 3 ప్రభువు 4 సమ్మతించి 5 పుట్టగా
6 ఆదరింపబడనివాఁడై 7 పుట్టినట్లు 8 నా ఘనుఁడు 9 ఆకాశము

4 పశువుల తొట్టిలోన – బొత్తి వస్త్రములను జుట్టి = శిశువును గను గొందురని – శీఘ్రముగను దూత దెల్పె ||రక్షకు||

5 అనుచు గొల్ల లొకరి కొక – రానవాలు జెప్పుకొనుచు – ననుమ తించి కడకు క్రీస్తు – నందరికిని దెల్పినారు ||రక్షకు||

---

## 34 *The Shepherd's Song.*

గొల్లల కీర్తన.

రా—ధన్యాసి. తా—ఏక.

గొల్లలు స్తోత్రించిరి – యేసు నాయకుని – ఉల్లము లెల్ల సంతసిల్ల మహి మావరింప ||గొల్లలు||

1 తొల్లి వారలు భీ – తిల్లుచునుండ[1] దూత – లెల్ల జనంబులకు – ల్లాసకరంబైన = చల్లనిమాట – వెదజల్లి రచ్చోట నందు – వల్లనాసక్తి – నొంది ||గొల్లలు||

2 దూత చెప్పిన గురుతుల్ – ప్రీతితో నాలకించి – నా తరి[2] నాక సంబున – దూత లందరు గూడి = నూతనంబగు సం – గీతము నెరుగు శ్రేష్ఠ – రీతిని బాడంగ వినుచు ||గొల్లలు||

3 చూడ గోరి రా రేయి – వేడుక నొందుచు – నేడు రక్షకుడు బుట్టె – నాడని బేతలేము = నాడు సేరిరి యా – రూఢి నొందిరి – కొని యాడి జనములకు దెల్ప ||గొల్లలు||

4 విన్నవి కన్నవి – ఎన్నిక పర్చుచు – నన్నిట దేవుని – సన్నుతి చేసిరి = యన్నలారా ఓ – యక్కలారా యచట – నున్నవారలు జూడ ||గొల్లలు||

---

1 భయపడుచుండగా 2 ఆ సమయమున

5 దేవుని వాక్యము – దేదీప్యమానమై[1] – ఈ వసుధను[2] మనల–నెల్ల నాదరించె = బోధకము మన మీ విధము – మంచి – త్రోవ గన్పించె వింత ||గొల్లలు||

---

## 35 *Christ coming to save.*

క్రీస్తు రక్షింప వచ్చుట.

రా—మారువా. తా—మిశ్రచాపు.

గీతములు పాడుడీ – యేసునికి సం – గీతములు పాడుడీ = పాతకుల మగు మనల దారుణ[3] – పాతకము తన విమల రక్త – స్నాతులనుగా[4] జేసి పాపనుద[5] – బాతకులలో నవతరించెను || గీతములు ||

1 ఆల్ఫాయును[6] నోమెగ[7] – యా దివి భువి – శిల్పి[8] యిల నిమ్ముగ[9] = నల్పుడై పుట్టి తన దగు – నల్ప భాగ్యముచేత మనలను – నల్పులను మోక్ష మున నిత్యము – నిల్పుటకు దయ బూని పుట్టెను ||గీతములు ||

2 రాజులకు రాజుగ – నేలుచు మోక్ష – రాజ్యమున గ్గగా = బూజ లందుచు దూత పరిగణ[10] – పూజితుండౌ ఘనుడు తన దగు – తేజ మెల్లను విడిచి యీ యిల – దేజహీనులలోన బుట్టెను ||గీతములు ||

3 దాసులగు వారలన్ – దమ పటు దోష – త్రాస[11] విముక్తులన్ = జేసి వారల నెల్ల మోక్ష ని – వాసులుగ జేయంగ రక్తము – బోసి కృపచే గాన వచ్చెను – యేసు నాథుడు దీన వృత్తిని ||గీతములు ||

4 మానవుల కెల్లను – దేవుని ప్రేమ – మానుగా జూపగ = ప్రాణమై దన రక్త మొసగగ – మానవుండై పుట్టె యూదుల – లోన యేసను పేరుచే దా – దీనుడై యిమ్మానుయేలు ||గీతములు ||

---

1 మిక్కిలి ప్రకాశమానమై 2 భూమియందు 3 భయంకరమైన 4 కడుగబడిన వారినిగా 5 పోగొట్టుటకు 6 ఆదియు 7 అంతమును 8 ఆకాశమును భూమిని చేసినవాడు 9 బాగుగా 10 దూత సమూహముచేత 11 భయము

5 ఆది దన వాక్యము - సంగున యేసు - మోదమున నిట్లనెన్ = మేదినిం దా నుపాధ్యాడై యుండి - నాదరిమ్మన్న బ్రోవ మనుజుల - నాదయా ఘను తనదు దేహము - సాధుగా నర్పించె ననుచును ॥ గీతములు ॥

6 పాపములు గోయుచు[1] - ప్రాకటముగా - పాపమును వీడుచు = ప్రాపు గోరుచు వచ్చువారల - పాపములు దన కరుణచేతను - బాపుచును శుద్ధాత్మ వారికి - ప్రాపుగా నుండుట కొసంగును ॥గీతములు॥

---

## 36 *The Birth of the Messiah.*

మెస్సీయ యొక్క జన్మము.

రా—ఆనందభైరవి. తా—త్రిపుట.

రేడు[2] మెస్సీయ జన్మించెను - శ్రీ దా - వీదు పురమున నుద్భవించెను = వేడుకతో నేను - బాడుండి పాటలు - యూధిగ సైతాను - కాడిని దొలగింప ॥ రేడు ॥

1 మనకొరకై శిశువు పుట్టెను - అతడు - మన దోసములను బోగొట్టెను = అనయంబు[3] నతని మీ - దను రాజ్యంపుం భార - ము నుంచబడె వివో - దన కర్త యితడౌను ॥రేడు॥

2 పరలోక సైన్యంబు గూడెను - మన - వర శిశువును గూర్చి పాడెను = నరులయందున గరుణ - ధర సమాధానంబు - చిర దేవునికి బహు - శ్రేయం బటంచును ॥రేడు॥

3 కొమ్మ యెష్షైనుండి పుట్టెను - చిగురు - క్రొమ్మర[4] వేరున బుట్టెను = కమ్మెను దేవుని యా - త్మమ్మను తెలివి జ్ఞా - నమ్మాలోచన మహాత్మ్యమ్మెక్క[5] మ్మడిం[6] నాతని ॥రేడు॥

---

1 అసహ్యించుచు 2 రాజు 3 ఎల్లప్పుడు 4 తిరిగి 5 ఏకముగా 6 ఎక్కువగా

4 సర్వశక్తిగల దేవుడు మరియు సర్వవ్యాపియౌ దయా స్వభా వుడు = సర్వ మహిమము గల్గు - స్వర్గలోకము విడచి - గర్వంబుతో నిండిన - సర్వం సహా స్థలిపై[1] ॥రేడు॥

5 వింతైన వాడుగ నుండెను - కోరి - నంత సుందరత లేకుండెను = చింత తోడను మాయా - సంతతులను వారి - యంతము లేనట్టి - యా పదను వీక్షించి[2] ॥రేడు॥

6 చెదరిన గొఱ్ఱెల వెనుకను - వాని - ముదమున మందలో జేర్పను = సదయత యేసుండు - జనితైక సుతుడు భా - స్వదధిక[3] శుభ[4] దాలో - చన కర్త జన్మించె ॥రేడు॥

7 అక్షయుండగు[5] యేసు వచ్చెను - మన - రక్షణమ్మును సిద్ధపర్చెను = మోక్షమ్ము కరుణా క - టాక్షమ్ముతో నియ్య - నీ క్షితి[6]యందున - హీబ్రూ వంశమునందు ॥రేడు॥

8 దిక్కు లేని స్థితి వీక్షించి[7] - మనల - మక్కువ తోడను రక్షించి = మిక్కిలి కూర్మిచే - బెక్కు బాధల నొంది - చక్కని భాగ్యంబు - గ్రక్కున[8] దయచేయ ॥రేడు॥

---

## 37 *The Glory of Christ.*

క్రీస్తుయొక్క మహిమ.

రా—మధ్యమావతి. తా—అట.

లాలి లాలి లాలి లాలెమ్మ లాలీ - లాలనుచు పాడరే బాల యేసు నకు ॥లాలి॥

1 పరలోక దేవ తనయుండో[9] యమ్మా - పుడమిపై బాలుడుగ బుట్టెనో యమ్మా ॥లాలి॥

---

1 భూమిమీద 2 చూచి 3 ప్రకాశించు 4 శుభముల నిచ్చువాడు 5 నాశము లేనివాడు 6 భూమి 7 చూచి 8 త్వరగ 9 కుమారుడు

2 ఇహ పరాముల కర్త యితడో యమ్మా - మహి పాలనము జేయు మహితుడో యమ్మా ||లాలి||

3 ఆది యంతము లేని దేవ తనయుడో యమ్మా - ఆదాము దోషమున కడ్డుపడె నమ్మా ||లాలి||

4 యూదులకు రాజుగా బుట్టెనో యమ్మా - యూదు లాతనితోడ వాదించి రమ్మా ||లాలి||

5 నరగొర్రెల మంద కాపరో యమ్మా - గొర్రెలకు నందంబు క్రీస్తు తా నమ్మా ||లాలి||

---

## 37—A. *Praise to Christ.*

క్రీస్తునకు స్తుతి

రా—ఘమాచ్. తా—అట.

కొనియాడ దరమె[1] నిన్ను - కోమల హృదయ![2] - కొనియాడ దరమె నిన్ను = తనరారు[3] దినకరు[4] - పెను తారలను[5] మించు = ఘన తేజమున నొప్పు - కాంతిమంతుడ వీవు ||కొనియాడ||

1 ఖెరుబులు[6] సెరుపులు[6] - మరి దూత గణములు[7] = ఉరుతరంబుగ[8] గొలువ - నొప్పు శ్రేష్ఠుడ వీవు ||కొనియాడ||

2 సర్వలోకంబుల - బర్వు[9] దేవుడ వయ్యు = నుర్వి[10] స్త్రీ గర్భాన - నుద్భవించితి వీవు ||కొనియాడ||

3 విశ్వ మంతయు[11] నేలు - వీరాసనుడ వయ్యు[12] = పశ్వాళితో[13] దొట్టి - బండి యుంటివి నీవు ||కొనియాడ||

---

1 స్తుతించుటకు శక్యముగాదు 2 మిక్కిలి దయగలవాడా 3 ప్రకాశించు 4 సూర్యుడు 5 గొప్పనక్షత్రములను 6 దూతలు 7 సమూహములు 8 ఎక్కువగ 9 వ్యాపించి యుండు 10 భూమి 11 భూమి యంతయు 12 సర్వశక్తి గలవాడవు 13 పశువులు మొదలగు వాటితో

4 దోసంబులను మడియు - దోసాళి[1] గరుణించి = యేసు పేరున జగతి - కేగుదెంచితి వీవు ||కొనియాడ||

5 నరులయందున గరుణ - ధర సమాధానంబు = చిరకాలమును మహిమ - పరగ జేయుదు వీవు ||కొనియాడ||

6 ఓ యేసు పొన్నుగ - నా యాత్మ చేకొని = శ్రేయ మొప్పగ బండు - శ్రీకర వరసుత ||కొనియాడ||

7 దూతాళితో గూడి - చేతోముదంబుగ[2] = గీతాల బాడెద - నీతి సూర్యుడ నీకు ||కొనియాడ||

8 గొల్లలతో గూడి - కూర్మితో నిను గాంచి = యుల్లంబు రంజిల్ల[3] నుపచరింతును[4] స్వామి ||కొనియాడ||

9 జ్ఞానులతో గూడి - సాంబ్రాణి బోళము = కానుక లర్పింతు - ఘన హేమంబును[5] నీకు ||కొనియాడ||

10 స్వీకరింపవే[6] యేసు! - శ్రీజనక! యాత్మా! భూ = మ్యాకాశములను ద్రి - యేక దేవుడ వీవు ||కొనియాడ||

---

## 38 *Christmas.*

క్రీస్తు జన్మ దినోత్సవము.

రా—హిందుస్తాని నవరోజు. తా—ఆది.

సంతోషించుడి - అందరు నాతో - సంతోషించండి - యొక - వింతగు కీర్తన బాడ వచ్చితిని - సంతోషించండి - నాతో ||సంతో||

1 అంధకార మయమైన భూమి నా-ద్యంతము వెలిగింప - దాని యా-వేశము[7] దొలగింప = వందితుండు[8] క్రీస్తేసు నాథుడు - వచ్చె ప్రకాశుండై - భూమికి - నిచ్చె ప్రకాశంబు ||సంతో||

---

1 పాపుల సమూహమును 2 సంతోషముతో 3 మనస్సు సంతోషించునట్లుగా
4 సేవింతును 5 బంగారమును 6 అంగీకరింపుము 7 శక్తి 8 నమస్కరింప బడదగినవాడు

2 కాన[1] కంధకార క్షితి దోలగ ప్రకాశించెను అండు—మూడి ప్రకాశింపను రండు—మానవులను సంతోషపర్చనై—మహికి నవతరించె—భక్తుల—మనము సంతసించ ||సంతో||

3 మిన్ను[2] నుండి సంతోషోదయము—మిగుల ప్రకాశించె—హృదయముల—దగుల ప్రకాశించె—మున్ను జేయబడిన వాగ్దత్తము—తిన్నగ నెరవేర—భక్తుల—కన్నులాస దీర ||సంతో||

4 ప్రీతిరయైన నీ పండుగ గూర్చి—నూతన కీర్తనను—కలసికొని—నాతో పాడుచును—నీ లెరి దూతసుల కీ వార్తను—నే తీరున నైన—తెలుపుటకు—నాతుర పడవలెను ||సంతో||

5 పాపులపై దేవునికి గలిగిన—ప్రబలమైన దయను—లోకమున—జూపింపగవలెను—చూపకపోయిన లోపము మనపై—మోపబడును నిజము—వేగము—జూపుద మా పథము[3] ||సంతో||

---

## 39 *The Name of Jesus precious.*

యేసు నామమే పావనము.

రా—ఆనంద భైరవి. తా—అట.

యేసు నామమే పావనము—మాకు—జేసె గద నిత్య జీవనము—దాస జన హృద్వి—కాస[4] మయ్యెల్ల—దోసములకు వి—నాశ కరమైన ||యేసు||

1 సాధు మానస సోల్లాసములు[5]—యేసు—నాథు గుణ సద్విలాసములు[6]—బోధ గొనువారి—బాధ వెడలించి—మాధుర్యమగు ముక్తి—సాధనము లిచ్చు ||యేసు||

---

1 చూచునట్లు 2 ఆకాశము 3 మార్గము 4 దాసులయొక్క మనస్సును వికసింపచేయునది 5 సజ్జనుల మనస్సులను సంతోషపెట్టునవి 6 మంచి వేడుకలు

2 భక్త జన లోక పూజ్యములు[1] — రక్త — సిక్త పాదపయోజములు[2] = ముక్తి రాజ్యాభి — షిక్తుడై[3] సర్వ — శక్తి యుతుడైన — సామి యగు క్రీస్తు ||యేసు నామమే||

3 దీన జన నిత్య తోషణము[4] — సిల్వ— మాని ప్రభు మృత్యు ఘోషణము[5] = పానకము జుంటి — తేనియల స్వాదు[6] — వీనులను గ్రోలు[7] — మానవుల కెల్ల ||యేసు నామమే||

4 పాపులకు మంచి పక్షములు[8] — ముక్తి — జూపు క్రీస్తు కటాక్షములు = పాప సంసార — కూపమున గూలు[9] — కాపురుషు నన్ను[10] — గాచుకొని బ్రోచు ||యేసు నామమే||

---

## 40 *Sweetness of Jesus Name.*

యేసు నామము ఎంతో రుచి.

రా—కాంభోజి. తా—ఆది.

యేసు నీ నామా — మృతము మా — కెంతో రుచియయ్యె = మా— దోసములను హరించి మోక్ష ని — వాసులుగ జేయుటకు — భాసుర ప్రకాశమైన ||యేసు నీ నామా||

1 వేడు కలరగ[11] — గూడి నిను కొని — యాడువారికి = ఎంతో — కీడు జేసిన పాడు వైరుల[12] — గోడు[13] గోడనంగ వారి దాడనము[14] జేసితివి ||యేసు నీ నామా||

---

1 భక్తజనుల సమూహముచేత పూజింపబడ దగినవి 2 రక్తముచేత తడుపబడిన పాద పద్మములు 3 ముక్తిరాజ్యమునకు రాజుగా నభిషేకింపబడినవాడు 4 సంతోషము 5 చాటుమూలుగులు 6 పూదేనెయొక్క మధురము 7 త్రాగు 8 సహాయములు 9 పాప సమూహ మనెడు నూతిలో మునుగు 10 చెడ్డవాడనైన నన్ను 11 ఒప్పునట్లు 12 విరోధుల 13 విచారము 14 శిక్ష

2 పాపములు హ - రింప నీవే - ప్రాపు మాకయ్యా = నీ - దాపు జేరిన వారి కందరి - కాపదలు బాపి నిత్య - కాపు గతి జూపినావు ||యేసు నీ నామా||

3 అందమగు నీ - మందిరమున - పొందుగ మేము = నీ - సుందర కరుణా మృతము మా - డెందములు[1] యందు నెలకొందఁ బ్రార్థింతుము ||యేసు నీ నామా||

---

## 41 *There is none other name.*

వేరొక నామముచేత రక్షణ లేదు.

రా—యమున కళ్యాణి. తా—త్రిపుట.

యేసు నామామృతము కన్నను - వేరె మాకిక లేదుగా = దోస ముల నెడబాపి పరమ ని - వాస పదవికి[2] జేర్చుగా ||యేసు||

1 నిత్య రక్షణ నిత్య జీవము - నిజముగా మా కిచ్చును = సత్య శుభ వార్తాగ సారము - సతము[3] గ్రోలుట[4] కొసగెను ||యేసు||

2 దురిత భవమను[5] నంధకారము - దూరముగ బోద్రోలెగా = నరయ తన విమలాత్మ వరమున - మరల మము వెలిగించెగా ||యేసు||

3 గొప్ప కుల గర్వముల మెప్పను - మబ్బుల న్వీడ గొట్టెను = జెప్ప శక్యముగాని రక్షణ - సృష్టిలో మము నిల్పెను ||యేసు||

4 అడ్డుపరచు పిశాచి దట్టపు - జిడ్డులను[6] ఛేదించెను = దొడ్డ రాజగు యేసు ప్రభు తన - దొడ్డిలో మము జేర్చెను ||యేసు||

---

1 హృదయముల 2 స్థితికి 3 ఎల్లప్పుడు 4 త్రాగుట 5 పుట్టుక 6 చిక్కులను

## 42 *The New Year.*

సంవత్సరాది

రా—ముఖారి. తా—చాపు.

క్రొత్త యేడు మొదలు బెట్టెను - మన బ్రతుకునందు - క్రొత్త యేడు మొదలు బెట్టెను = క్రొత్త మనసుతోడ మీరు - క్రొత్త యేట బ్రభుని సేవ- దత్తర పడకుండ[1] జేయు - టుత్తమోత్తమంబు జూడ ॥క్రొత్త॥

1 పొందియున్న మేలు లన్నియు-బొంకంబు[2] మీర - డెందమందు స్మరణ సేయుడీ=యిందు మీరు మొదలు బెట్టు - పందెమందు బార వలయు[3]- నందముగను రవిని[4] బోలె-నలయకుండ సొలయకుండ ॥క్రొత్త॥

2 మేలు సేయ వడ వొనర్ప[5]గా-మీ రెరుగునట్లు-కాల మెంత నిరుడు కడచెగా=సోలుమాలి యుండకుండ[6]- జాల మేలు సేయవలయు - జాల జనుల కిమ్మను - యేసు నామ ఘనతకొరకు ॥క్రొత్త॥

3 బలము లేని వార మయ్యును-బల మొందవచ్చు-గలిమి మీర గర్త వాక్యాన= నలయకుండ నడుగుచుండ-నలగకుండ మోద మంది - బల మొసంగు సర్వ విభుల - నెలమి[7] మీ రొనర్చుచుండ ॥క్రొత్త॥

4 ఇద్ధరిత్రి[8] నుండు నప్పుడే-యీశ్వరుని జనులు - వృద్ధిబొంద జూడవలయును = బుద్ధి నీతి శుద్ధులందు-వృద్ధి నొంద శ్రద్ధ సేయ - శుద్ధులైనవారిలో ప్ర - సిద్ధు లగుచు వెలుగవచ్చు ॥క్రొత్త॥

5 పాప పంక[9] మంటి నప్పుడు-ప్రభు క్రీస్తు యేసు-ప్రాపు జేరి మీరు వేడగా=నేపు మీర [10] దనదు కరుణ - బాపమంత గడిగి వేసి-పాప రోగ చిహ్న[11] లన్ని - బాపి వేసి శుద్ధిజేయు ॥క్రొత్త॥

---

1 తొందరపడకుండ 2 ఉత్సాహము 3 పరుగెత్తవలయును 4 సూర్యుని 5 ఆలస్యము చేయగా 6 సోమరితనముగా నుండకుండ 7 భూమిమీద 8 ఈ లోకమందు 9 బురద 10 ఎక్కువగ 11 గురుతులు

## 42—A *Annual Thanks-giving.*

సాంవత్సరిక కృతజ్ఞతార్పణము.

రా—గుర్జరీ. తా—ఏక.

వందనం బొనర్తుమో ప్రభో ప్రభో—వందనం బొనర్తుమో ప్రభో ప్రభో = వందనంబు తండ్రి, తనయ, శుద్ధాత్ముడా—వందనంబు లందుకో ప్రభో॥

1 ఇన్ని నాళ్లు ధరను మమ్ము బ్రోచియు—కన్న తండ్రి మించి యెప్పుడు గాచియు = నెన్న లేని దీవెన లిడు నన్న యేసువా—యన్ని వేళ్ల స్తోత్రము లివిగో॥

2 పాత వత్సరంపు పాపమంతయు—దీసి మన్నించి మమ్ము గావుము = నూత నాబ్దమునను[1] నీదు నీతి నొసగు మా—దాత క్రీస్తు నాథ రక్షకా॥

3 దేవ! మాదు కాలు చేతు లెల్లను—సేవకొఱకు తనువు, మనము లన్నియు—నీ వొసంగు వెండి, పసిడి, జ్ఞాన మంత నీ—సేవకై యంగీకరింపుమా॥

4 కోతకొఱకు దాసజనము నంపుము—ఈ తరి మా లోటుపాట్లు దీర్పుము = పాతకంబు లెల్ల మాపె భీతి బాపుము—ఖ్యాతి నొందు నీతి సూర్యుడా॥

5 మా సభలను పెద్దజేసి పెంచుము—నీ సువార్త జెప్ప శక్తి నీయుము = మోసపుచ్చు నంధకార మంత ద్రోయుము—యేసు కృపన్ గుమ్మరింపుము॥

6 మంగళం బొనర్తుమో ప్రభో ప్రభో—మంగళంబు నీకు మాదు వృద్ధికై = మంగళంబు లయ్యా వేనవేల మాదులు—మంగళంబుల్ మంగళంబులు॥

---

1 క్రొత్త సంవత్సరమున

## 43 A Prayer for Guidance.

దైవోపదేశమునకై ప్రార్థన.

రా—అసావేరి. తా—మిశ్రఛాపు.

కొనుము మా హృదయంబు - లను నీకర్పించెద - మనయము[1] స్తుతి యింపుచు = ఘనముగా కృపచేత మము గా - చినను మే మెంతయు ననవ్వాల - మనుచు నీ పాదముల కెరగుచు[2] - ననిశమును నీకృప దలంతుము ||కొనుము||

1 బలహీనులము మేము - బలవంతుడవు నీవు - బల మిచ్చి మము నడుపుము = ఇలను మే మిక బ్రతుకు దివసం - బులను నీ పదభక్తిచే నెప్పు - డలయ కుండగ మమ్ము కడు ని - ర్మలిన హృదయుల జేసి కరుణను ||కొనుము||

2 ఘోరారణ్యము భువి వి - చార సంకలితము[3] - భూరి[4] భయంకరము = దారి లేదిక నీవు దప్ప - వేరె సాధన మెచట గానము - కోరి మము నందరిని నీ దరి - జేరుకొను మార్గమును జూపు ||కొనుము||

3 గత వత్సరమున నీ - యతులమౌ[5] కృప చేత - పతితుల మము గాచితి = యతి వినమ్రుల[6] మగుచు మా నమ - తులలో నీ ప్రేమ దలచుచు - మతి విహీనత వీడి యిక నిను - సతతమును సేవింతు మయ్య ||కొనుము||

4 ఈ వత్సరంబున - నెవ్వరు మాలోన - జావున నిల విడిచి = దేవ వారలు భువిని వదలి - పోవు కాలమునందు దిన్నని - త్రోవలో వారలను సుఖముగ - బ్రోచి గొడ్కొని పోవుమయ్య ||కొనుము||

5 మమ్మును విశ్వాస - మార్గమందున దోడ - నిమ్ముగ గొనిపోవుచు = నమ్మ నీ ప్రియ సేవకుల బృం - దమ్మునకు[7] సిద్ధంబులగు మకు - టమ్ములను[8] మే మొందుటను వే - గమ్ముగా బాత్రులను జేసి ||కొనుము||

1 ఎల్లప్పుడు 2 నమస్కరించుచు 3 కూడుకొన్నది 4 మిక్కిలి 5 సాటిలేని 6 ఎక్కువ వినయము గలవారము 7 సమూహమునకు 8 కిరీటములను

6 శోధనల యందున-బాధల యందున-నోదార్పు మా కొసగుము=
శోధనలచే మాకు మరియును-శుద్ధమగు హృదయంబు లిచ్చుచు-శోధనల్
ఫలియింప జేయుము-బాధకమ్ములు గాక యుండ ||కొనుము||

7 ఈ లోక దుఃఖము-లెల్ల నేగిన పిదప-నీ లోకమును జేరగ=
బాలుమాలక[1] మేము మా మా-పదుగు నెత్తగ సాయ మిమ్మా-యేలికా
నీ కరములను[2] మే-మెప్పుడు గొని నడువంగ నేర్ప ||కొనుము||

8 దురితంబు లెల్లను-గరుణచే గడిగి నీ-పరమునకు మము జేర్పుము=
నిరతమును మే మచట నీ కృప-విరివి నెంతయు బొగడుచును మా-
కరములను బంగారు వీణలు-నెరవుగా[3] గొని మీటుచుందుము[4] ||కొనుము||

---

## 44 *Now is the accepted Time.*

క్రీస్తు సేవ కిదియే యుక్తసమయము.

రా—సౌరాష్ట్రి. తా—అట.

ప్రభు సేవ కిదియే సమయంబు-ప్రబల-విమల ఫలముల నొంద-
నిదియే సమయంబు ||ప్రభు||

1 మరణంబు బడయక మున్నె-ఘోర-తరమైన పాపాత్ము లరసి
గుణ పడగ-నరక వేదన బాయు కొరకు-దేవు-సరిమురితరి[5] యెంతో
కరుణతో నొసగె ||ప్రభు||

2 కరుణ గల్గెడి దివసములలో-నీవు-పరమ భాగ్యంబులు బడ
యంగ వచ్చు-మరణం బెరిగిన జీవాత్మ-యద్ది-మర చెడ వివి యెంతో-
యరిదియే[6] గదా ||ప్రభు||

3 ఇలయందు బ్రతి వాని నామ-మున్న-తెలియకుండగ క్షీణిం
చును గాన-దలచిన యత్నంబు లన్ని-యాశ-దృఢలముతో జేయ నా-
యెలమి యీడేరు[7] ||ప్రభు||

---

1 సోమరితనము లేకుండ 2 నీ చేతులను 3 నేర్పుగ 4 వాయింతుము 5 మంచి సమయమును
6 ఆశ్చర్యముకదా 7 కోరిక సఫలమగును

4 విశ్వాస కలిత యత్నంబు – చేత – విజ్ఞాపనములైన వేగ మొన
రింపు – మా శ్వాసము బోవునప్పుడు–నీవు – మొరకుమై యుందువు – ముందు
నరయాంగ ||ప్రభు||

5 పశ్చాత్తాపం బనెడి తలుపు – మూయ – బడును దేవుని కరుణా
భాగ్య మను తలుపు – నిశ్చయంబుగ వేయబడును – ఎంతో – యాశ్చర్య
కరమగా – నవన[1] మగ పడను ||ప్రభు||

6 సారస్యమైన కార్యములం – జేయ – సమయ మనెడి తలుపు సరగ
మూయబడును – తారక[2] స్మృతి బొందునప్పుడే – గాన – సార కార్యము
లన్ని – చక్కగా జేయు ||ప్రభు||

7 గత దినంబులకై స్తుతింతున్ – మిగుల – కఠినంబులైన గండంబుల
నుండి – ప్రతి దినంబున దప్పించుచు – నెంతో – మితిలేని కృప చేత –
బ్రతికించు మనల ||ప్రభు||

8 నీతి రతులగు[3] భక్తులారా – మన – పాతకములను జచ్చి పరమేశ్వ
రుని – ప్రీతి మొక్కులు చెల్లించుదము – నూత్న – వత్సరమున ప్రభు –
నుతికై బ్రతుకుదము ||ప్రభు||

9 ఇది నవ్య[4]మిది భవ్య[5]మిది యమూల్య – మిది సేవ్య[6]మిది హృద్య[7]
మిది యోగ్య పూజ్య – మిది యర్థ్య[8] మిది లభ్య[9] సాధ్య – మైన – యద
నిదే[10] ముక్తి – పదవి నొందుటకు ||ప్రభు||

---

1 ప్రాతరిము 2 నిత్యము 3 నీతియందు ఆసక్తి గలవారగు 4 నూతనమైనది
5 శుభమైనది 6 సేవింప దగినది 7 మనోహరమైన 8 కోరదగినది 9 దొరుకుటకు
10 సమయము ఇదే

## ఎపిఫనియ.

## 45 *Adoration of the Magi.*

క్రీస్తునకు జ్ఞానుల సేవ.

రా—ధన్యాసి. తా—ఏక.

జ్ఞాను లారాధించిరి – యేసు ప్రభుని – ప్రాణి పాపుల బ్రోవ – మేను[1] దాల్చిన తరి ॥జ్ఞాను॥

1 చాల కాలము నుండి – మేలువార్త నాసక్తి – నాలకించి నక్షత్ర – కాల చిహ్నను[2] గూడి=మేలు మేలని – మమ్మేలు నాడని – మంచి బోళము సాంబ్రాణి వేసి ॥జ్ఞాను॥

2 దూర మనక యాత్ర – భార మనక బయలు – దేరి సంతోషముతో – జేరి మేలిమి బంగార మిచ్చిరి – మనసార మెచ్చిరి – జోహారు[3] జోహా రటంచు ॥జ్ఞాను॥

3 ఈ దినసంబున – బేదలేము[4]ను నూర – యూదుల రాజుగా – పొడుకొన్న యేసు=నాథ స్వామిని – సమ్మోద మిమ్మని – య య్యాద జనుల మధ్య ॥జ్ఞాను॥

4 ఈ సమయము మన – మా సమయంబుగ – జేసి స్తుతించను – చేరితి మిట్లొట=భాసురంబుగ[5] – శ్రీ యేసు నామంబు – హృదయాసనంబున చేర్చి ॥జ్ఞాను॥

---

## 46 *Incarnation of Christ.*

దేవ కుమారుడు నర రూపు దాల్చుట.

రా—ఎనుకుల కాంభోజి. తా—ఆది.

వినరే యో నరులారా – వీనుల కింపు మీర – మనల రక్షింప గ్రీస్తు

1 శరీరము 2 గురుతు 3 నమస్కారము 4 బెత్లెహేము 5 ప్రకాశించు

మనుజావతారు డయ్యె=అనుదినము దేవుని తనయుని పద-వనజంబులు[1]
మన-మున నిడికొనుచును ॥వినరే॥

1 నర రూపు బూని ఘోర-నరకపల[2] రాగిమ్మని-సుకితము బొప్పు
నొడ్గ-దొరయా మరియా వరపుత్రుడు=కరమరుదగు[3] క-ల్వరి గిరి గిరి
కరి-గి[4] రయుంబున[5] ప్రభు-కరుణను గనరే ॥వినరే॥

2 ఆనందమైన మోక్ష-మందరి కియ్య దీక్ష-బూని[6] ఘన మేని
సిలువ-ప్రాను నణచి మృతి బొందెను=దీన దయా పరు-డైన మహాత్ము-
నూన బలిగ దా-నైన తెరం గిది[7] ॥వినరే॥

3 పొందుం గోరిన వారి-విందా[8] పరమోపకారి-యొసగ రెందరి
పరమా-నంద పద మొందగ జేసెను=అందమునగా దన-బొంది[10] సుగ్త్రము
జించెను భక్తుల-డెందము గుందగ ॥వినరే॥

4 ఇల మాయావాసుల మాని-యితడే సద్గురువని-తలపోసి చూచి
మతి ని-శ్చల భక్తిని గొలిచిన వారికి=నిల జనులకు గలు-ముల నలరెడు[11]
ధని-కుల కందని సుఖ-ములు మరి యొసగును ॥వినరే॥

5 దురితము లణప వచ్చి-మరణమై తిరిగి లేచి-నిరత మోక్షానంద
సుం-దర మందిరమున కరుగ జనియె[12]=బిరబిర[13] మన మం-దరమా
కరుణా-శరనిధి[14] చరణమె[15]-శరణని బోదము ॥వినరే॥

---

## 47 *Come to See Jesus.*

ఆశతో క్రీస్తుని చూతము రమ్మనుట.

రా—కాంభోజి. తా—అట.

రారె యేసును జూతము-గోరిక దీర-రారె యేసుని జూతము=
రారె యేసుని చూడ రారాజై మన జీవా-ధార కరుణామృత సారమై
యున్నాడు ॥రారె॥

---

1 తామరపువ్వుల వంటిపాదములు 2 పాపులను 3 మిక్కిలి ఆశ్చర్యకరమైన 4 వెళ్ళి 5 త్వరగా 6 శ్రద్ధతో 7 చేసిన విధ మిది 8 సహవాసము 9 బంధువు 10 శరీరముయొక్క 11 సంపదలతో నొప్పుచున్న 12 వెళ్ళెను 13 త్వరగా 14 సముద్రము 15 పాదమే

1 సారహీనమగు సంసారాబ్ధిలో[1] జిక్కి — ఘోర ఘనము నీత నేరని వారికి - తారకమై[2] దేవసుతు - మారుడు యేసు - ఔదార్య[3] ము నమటుస - భూరి[4] సహాయు కారుడై చేయూతను = కోరి యిచ్చుచు క్షేమ తీరంబు నను జేర్చ - దాని జూపుచు మీ విచారముల్ దొలగించు ॥రారె॥

2 ఘోరమైన పాప భారంబు మోయుచు - దారి గానక దారు మారులైన నరుల - హారముతో బిల్చుచు - నారకి[5] బాధ - లూరక[6] దొలగించుచు - నిరసు లంచు భారంబు తా మోయుచు = ఓరి మధికము జూపి నేరంబు బాపి శృంగారమైన మోక్ష ద్వారమై యున్నాడు ॥రారె॥

3 కామ క్రోధముల నిర్జించి కామందు నరితోప - కామందు శుద్ధాలంకారముగా యేసుని - నే రీతిగా వింటిమో - ఆ రీతి మోక్షారామమున[7] జూతుము - సార వాక్య ధారణిని[8] పడి పోదము = దారుణంబగు శ్రమలు బారు బారుగా నున్న - పోరి[9] దాటి ప్రభుని జేరి సుఖింతము ॥రారె॥

4 ఆ రమ్యపురిని ప్రేమారగించుచు నిత్య - మారోగ్యమును బొంది సారెసారెకు ప్రభుని - ఆరావముగ[10] స్తోత్రము - చారుతర[11] దేవారాధనము జేతము - నోరార నా - పేరునే పూరింతము = ధారసులై యున్న వారలం దన రక్త - ధారోదకముచే చేకూరునట్లుగ[12] జేయు ॥రారె॥

---

## లెంటు—క్రీస్తుయొక్క శ్రమ కాలము.

## 48 *Christ Foretelling His Passion.*

క్రీస్తు తన ప్రయాసములను ముందు దెలియ జేయుట.

రా—ఆనంద భైరవి. తా—ఆది.

యేసు శిష్యులకు - నెరుక జేసిన - భవిష్యోక్తులు[13] వినరే = కైసరయ న - గర ప్రాంతములను - ఘనుడు జేరి తన - గతి మతి దలచుచు ॥యేసు॥

---

1 సముద్రమువంటి లోక జీవనము 2 దాటించునదియై 3 ఓదార్పుట 4 గొప్ప 5 ఘోరమైన 6 ఉచితముగ 7 తోటలో 8 వాక్య ప్రవాహములో 9 పోరాటము 10 శబ్దముతో 11 మనోహరమైన 12 చేతికి దొరుకునట్లుగ 13 రాబోవు కాలమును గూర్చినమాటలు

1 యెరుషలే మనెడి - పురమున దన కిక - జరిగెడు దుఃఖములు = దురితాత్ములు యూదు - లు కడు బాధలు - పరచి తన్ను సిలు - వను జంపుదురని ||యేసు||

2 నీతి బోధకు ల - నేతలు పెద్దలు - ఖ్యాతిగ[1] నర్చకులు[2] = నా తరి తన నప - హాస్యము లాడుచు - బోరరించి[3] యుమి - నేతు రటంచును ||యేసు||

3 మనుజ కుమారుడు - మరణమై సమా - ధిని వేయంగబడున్ = దనరగ[4] మూడవ - దినమున బునరు - త్థాన మొంది ద - ర్శన మిడు మీకని ||యేసు||

---

## 49 *Christ's wondrous Love.*

పాపులయెడ క్రీస్తు యొక్క అపారమైన ప్రేమ.

రా—సారంగ. తా—ఆది.

పాపులయెడ క్రీ-స్తుని ప్రియ మెట్టిదో-పరికింపరె క-ల్వరి గిరిపై= నాపదలను దన-కీ గతి బెట్టెడు-కా పురుషుల దెస-గనుగొను కృపతో ||పాపుల||

1 తన పక్కను సిలు-వను వేసిన యొక -తస్కరుఁ[5] డించుక - వేడు కొనన్=గనికరము మన - మున బెనగొన[7] ని-చ్చెను మోక్షము తన-తో నుండుటకున్ ||పాపుల||

2 శాత్రవు లటు తను-జంపుచు నుండగ - మైత్రి జూపె స - న్మతి తోడన్ = స్తోత్రము చేసెను - దండ్రీ వీరల - దురిత మెల్ల క్షమి-యింపవె యనుచును ||పాపుల||

1 ప్రసిద్ధిగ 2 యాజకులు 3 మదించి 4 చక్కగ 5 దుర్మార్గుల వైపు 6 దొంగ 7 ప్రేరేపింపగ

3 యెరుషలేము క - న్యలు కొందరు తన-యెదుట వచ్చి యేడ్చుచు నిలువఁగా = నగుచు నప్పుడిక[1] - విచ్చు నాశన గతు-లెరుగ బలికి వా-రల నోదార్చెను ||బాపుల||

4 మితిలేని దురిత-జీవుల లోపల-మించి యున్న-పతితుల[2] కై నన్ = హితముగ మోక్ష-మిచ్చుటకై శో-ణిత[3] బలి యిడె నా-మది కది సాక్షిగ ||బాపుల||

---

## 50 *Meditation at the Cross.*

సిలువ దగ్గర ధ్యానించుట.

రా—ముఖారి. తా—త్రిపుట

చూడరే-క్రీస్తుని జూడరే - నా సఖులారా[4] - చూడరే క్రీస్తుని జూడరే = చూడరే నా ముక్తి పదవికి- యేసు ఏ దశ - గూడినాడో ||చూడరే||

1 వంటికిని నా కాశమునకును-మధ్యమున వ్రేలాడుచుండగ- నంట గొట్టగ సిలువ మ్రాని - కప్పగించుట కొరకు నిన్ను -గాంచెనా-యిగ మది నెంచెనా=హా నా-కంట నే నిటువంటి యాపద - గంటి[5] ప్రాణము లుండునే యిక ||చూడరే||

2 ఊటగా రక్తంబు జారు - చుండ బల్లెపు ప్రక్క- పోటు - వాటి మాటికి జూడ దుఃఖము - పొరలునే[6] తలమీద ముళ్ళ కి- రీటమా - యిత నికి వాటమా[7] = యూదులు - మోదులై బాహాటమున నీ - పాటులను గాటముగ జేసిరి ||చూడరే||

3 మించి పొంతి పిలాతు సత్య మె - రింగియైనను దలంప కక్కట- వంచనను[9] గొట్టించి యూదుల - మంచితనమే కోరి యప్ప - గించెనా -

---

1 ఆ పట్టణమునకు 2 పాపాత్ములకు 3 రక్తము 4 స్నేహితులారా 5 చూచినచో 6 పొర్లునా 7 తగునా 8 కొంచెమైనను 9 కపటమునొ

మేలు గణించెనా = యితని - గాంచి గాంచి భక్తు లెట్లు స - హింతురో
పరికించి మీ రిక ॥మాడికే॥

---

## 50-A. *O Sacred Head now wounded.*

గాయములతో నిండియున్న పరిశుద్ధ శిరస్సు.

రా—ముఖారి. తా—త్రిపుట.

వందనం - నీకే - వందనం - పరిశుద్ధ శిరమా - వందనం - నీకే - వందనం = వందనం బొనరింతు నీ శ్రీ - యందమగు ఘన నామమునకే ॥వందనం॥

1 సుందరుడ నీ శిరసు హేళన - బొందె ముండ్ల కిరీట ముంచగ - నెందు జూచిన రక్త బిందులు - చిందుచుండెడి గాయములతో - గ్రందెనా[1] - మోము కుందెనా[2] = యిక నే - నెందు బోపక నిన్ను గొలిచెద - నందముగ మహిమ ప్రభావా ॥వందనం॥

2 భీకరుడ నీ యెదుట సర్వ - లోకములు వణకెను ఘనముఖ - మే కరణి నుమి వేయబడియె వి - కార రూపము నొంది కందెను - శ్రీకరా[3] - శ్రీ శుభాకరా = నే నీ - ముఖ ప్రకాశము పాడుజేసితి - నో కరుణ భాస్కర క్షమించుము ॥వందనం॥

3 మించు నీ ముఖ లక్షణము లహ - మంచి పెదవుల రంగు జూడగ - కొంచెమైనను గనుపడక కృ - శించి దౌడలు కృంగి పోవుట - నెంచగా నాలోచించగా = ఆ నీ - యంచితపు బల శౌర్యములు హ - రించి పోయెను మరణ బలమున ॥వందనం॥

4 ఘోర యాతనలను భరించితి - వరయగను నా కొరకు గద యో - పరమ రక్షక నీ పదంబుల - కొరగి మ్రొక్కెద కరుణ జూడీ - భారము -

1 కమలెనా 2 దుఃఖించెనా 3 సంపద నిచ్చువాడా

నాదే నేరము = నేని - కారణం బంతయును గని[1] నా - మారణము మూర
ణము యగుటకె ||వందనం||

5 నిండి పాలును తేనె లొలుకుచు - నుండు నీ మాటలను వినగను -
దండి పరచిన[2] దేవరక్షణ - దండముతో గాపరివి నవై - యుందుము -
కాయుచుందుము = నన్నిటు - నిండుగా గృపతోడ మేపుచు - దండధరా నీ
యండ నుంచుము ||వందనం||

6 సిలువ యెదుటను నిపుడు నే నిట - నిలిచి నిను బ్రార్థింతు బ్రభు
వా - ఖలుడ నని నను ద్రోయకుము నే - సలసి సొలసిన నిన్ను విడువక -
బిలచెద - నిన్నే గొలచెద = నీ తల - బలిమి చావున వాల్చగను నా -
యేసు నిను చేతులతో నాపెద ||వందనం||

7 నిన్ను నే గొనియాడుటకు నిపు - డున్న భాషలు చాల విక ని -
న్నెటుల నే నుతియింతునో హా - సన్న రక్షక బ్రోవు నన్నెడ - బా
యకు - ఖిన్నుడ జేయకు = నా కొర - కిన్ని బాధల నొందితివి నా -
యన్న నా జీవంబు నీదె ||వందనం||

8 మరణ దినమున భయము పడి నీ - కొరకు కెదురు జూడంగ గృప
తో - వరబలుండా[4] నా విరోధుని - కరకు శరముల[5] ద్రుంచ రావె -
శూరుడా - దేవ కుమారుడా = యటు నీ - మరణ రూపము శిలువపై నా -
తరుణమున జూపుము యెహోవా ||వందనం||

---

## 51 *Christ on the Cross.*

రా—ఎమకుల కాంభోజి. తా—మురుజంపె

ఏ పాప మెరుగని - యో పావనమూర్తి - పాప విమోచనుండ = నా
పాలి దైవమా నా పాపముల కొర - కీ పాటు నొందినావా ||ఏ పాప||

---

1 కారణమంతయు చూడగా 2 గొప్పదగు 3 రాజా 4 మహాశక్తిగలవాడా 5 వాడి
యైన బాణములతో

1 కలువరిగిరి దనుక—సిలువ మోయలేక— కలవరము నొందినావా— సిలువ నీతో మోయ—తులువలు[1] వేరొకని—తోడుగా నిచ్చినారా॥ఏ పాప॥

2 చెడుగు యూదులు బెట్టు—పరాని పాట్లకు—నుడివడి[2] నడిచినావా—కడకు కల్వరిగిరి—కడ కేగి సిల్వను—గ్రక్కున[3] దించినావా॥ఏ పాప॥

3 ఆ కౄరకర్ములు[4]—భీకరంబుగ నిన్ను—నా కొయ్యపై—నుంచిరా— నీ కాలుసేతులు—నా కొయ్యకే సూది—మేకులతో గుచ్చినారా ॥ఏ పాప॥

4 ముల్లులతో కిరీట—మల్లి నీ శిరముపై—జల్లాటమున[5] మొత్తిరా— ముళ్ళపోట్లకు శిరము—తల్లడిల్లగ సొమ్మ—సిల్లిపోతివ రక్షకా ॥ఏ పాప॥

5 పలు విధంబుల శ్రమలు—చెలరేగ దండ్రికి—నెలుగెత్తి[6] మొరలిడితివా—సిలువపై పలుమారు— కలుగుచుండెడి బాధ—వలన దాహం బాయెనా ॥ఏ పాప॥

6 బల్లిమండగు[7] బంటు—బల్లెమున నీ ప్రక్క—చిల్లిపడ పొడిచినాడా— ఉల్లోలమువలె[8]—నల్ల నీ రుబకంగ[9]— నెల్ల జనులు జూచిరా ॥ఏ పాప॥

7 కటకటా పాప సం—కటము బాపుట కింత—పటు[10] బాధ నొందినావా—యెటువంటి దీ ప్రేమ—యెటువంటి దీ శాంత—మెటుల వర్ణింతు స్వామీ ॥ఏ పాప॥

---

## 52 *Meditation at the Cross.*

సిలువ ధ్యానము.

రా—ముఖారి. తా—ఆది.

ఏమి నేరంబు లేక—యీ మరణ స్తంభము—నేల మోయనాయెను— నా యేసు ఎంత ఘోరము లాయెను— ఈ మానవులు యెరుష— లేము బైటకు దీయ—నేమి నేరము దోచెను ॥ఏమి॥

---

1 నీచులు 2 నలిగిపోయి 3 త్వరగ 4 దుర్మార్గులు 5 పరిహాసమున 6 కంఠమెత్తి 7 బలశాలియైన 8 పెద్ద అలవలె 9 రక్తమును నీరును ప్రవహించగ 10 గొప్ప

1 మున్ను దీర్ఘదర్శు - లెన్నిన రీతిని - కన్నెకడుపున బుట్టిన - నా యేసు - నిన్నె మీరంగ[1] జెరిగిన = చెన్నైన నీ మేనుకి[2] - నేమిట బుట్టెంగ నీ-కిన్ని కడగండ్లా[3] యెను ||ఏమి||

2 కన్నతల్లి యిట్టి - కడగండ్లు గాంచిన - కడు శోకరీతి నొచ్చును - నా యేసు - గాంచి నేలను గూలును = నిన్నెరిగినట్టివారు - నీ పాట్లు గని యేడ్చు - చున్నార లీ వేళను ||ఏమి||

3 అయ్యయ్యో యూదు లంత - నెయ్యంబు[4] దప్పి వైర-భావంబు విడిచి ప్రాణి-నా యేసు - మోయ శక్యంబు గాని = కొయ్య మూపు నెత్తి-రయ్యా నీ కెంత భార - మయ్యె వెత జూడ జాలను ||ఏమి||

4 పిల్లలాట్లాడినట్లు - ముల్లులతో కిరీట - మల్లి నెత్తిన గొట్టిరి - నా యేసు - పల్లరుపు[5] లధిక మాడిరి = ఎల్లవారిలో నిన్ను - ఎగతాళి గావించి - మొగము మీ దెల్ల నుమిసిరి[6] ||ఏమి||

5 కొరడాలతో నిన్ను - గొట్టి కండ్లకు గంత-గట్టి చే జరచి వేడ్కా-ను-నా యేసు - అట్టివా రెవ్వ రంచును = విరసభావంబు[7] నడిగి-వెక్కి-రించుచు నీ-వెంటబడి పెత్తు రేలను ||ఏమి||

6 ఏలెడివారు నడుమ - ప్రోల[8] వస్త్రంబులను - నేల బరచిన రీతిగా-నా యేసు-ప్రోల బరచిరి యట్లుగ=ఏల యీ కోడిగంబు[9] -లేల నీ మీద కంటు- ఏమి నేరంబు లేమగ ||ఏమి||

7 చాలా బాధించి క-పాల స్థలమునకు వచ్చి-నేల పాతిరి కొయ్య-ను- నా యేసు-జాలి రవ్వంత లేకను = కాలు సేతు లినుప - చీలలతో బిగించ-జిమ్మె రక్తంబు గారెను ||ఏమి||

---

1 చాల చక్కగా 2 అందమైన నీ శరీరము 3 శ్రమలు 4 స్నేహము 5 ఆడరాని మాటలు 6 ఉమ్మి వేసిరి 7 దురుద్దేశముతో 8 ఎదుట 9 పరిహాసము

8 నీచాత్ముఁ డొకఁడు విరఁగి-వీఁగి బల్లెంబుతోఁ ద-నీ ప్రక్కఁ బొడిచె
చాపను- నా యేసు-నీరు నెత్తురు గారెను= ఏచి యున్నట్టి కష్టి[1]- కెట్లు నీ
యోపలు సైచె[2]- నెంతో చోద్యంబు చూడను ||ఏమి||

9 నా దేవ నా దేవ- నన్నేఁటికై విడిచి - నా వంచు మొరపెడి
తివి- నా యేసు - నమ్రతివి లోఁబడితివి= వేద నధికంబాయె - నే దప్పి-
లేనట్టు-యూదాళి[3] కగుపడితివి ||ఏమి||

10 అంధకారము దేశ- మంతట గలిగెను - ఆవరించెను సూర్యుని -
నా యేసు - అలయపు తెర చినిగెను = బంధ స్తంభంబు[4] నుండి - బహు
గొప్ప శబ్దముతో - బలికెద వే మిట్లను ||ఏమి||

11 ఓ తండ్రి నీ చేతి - కొప్పగించుచున్నాను - ఒనరంగ[5] నా యా
త్మను - నా యేసు - అని ప్రాణమును వీడెను = ఏ తప్పితంబు లేక - నీ
పాటు నొందితివి- ఎంతో వింతై నిల్చెను ||ఏమి||

12 పాపాత్ములకు పూట - బడినవల్లనే యింత- పరితాప మరణ
మాయెను- నా యేసు - ఎరిగే యనుభవించెను = నా పాప ఫలము నిన్ను-
వేసాట్లు బెట్టి చంప -నోపితి వయ్య ప్రేమను ||ఏమి||

13 ఎంత యమూల్యమైన - దెంత యనంతమైన - దెంత యగాధ
మైనది- నా యేసు- ఎంతో యుచితమైనది= ఎంతో వింతైన ప్రేమ -
ఏహ్యులమైన[7] మాకు - ఏల కనుపర్చబడెను ||ఏమి||

14 ప్రేమాతిశయుడ నేను -ఏమాత్రుడను నెన్న - నా మానసమున
కందను- నా యేసు - ప్రేమసారంబు దెలియను= పామరాళిని[8] బ్రోచు-
క్షేమాధికారి నిన్ను - ఏమంచు వర్ణింతును ||ఏమి||

---

1 శ్రమ 2 సహించెను 3 యూదుల సమూహామునకు 4 సిలువ కొయ్య 5 తగినట్లుగ
6 లోతైన 7 అసహ్యులమైన 8 అజ్ఞానుల సమూహమును

## 53 *The Seven Words on the Cross.*

క్రీస్తు సిలువమీద పలికిన యేసు మాటలు.

రాయ: "యెరూషలేము కుమార్తెలార యేడ్వబోకుడి," అను కీర్తన రాగము.

రా—హిందుస్థాని కాపి. తా—రూపకము.

ఆహా! మహాత్మ హా! శరణ్యా! హా! విమోహ కారా-ద్రోహ రహిత-
సంపె నిను నా - దోషమే గదా ||యాహా||

1 "వీరలను క్షమింపు తండ్రి! నేర రేమియున్" = కోరి తిటులు
నిన్ను జంపు-క్రూర జనులకై ||యాహా||

2 "నీవు నాతో పరదైసున-నేడె యుందువు" = పాపనుం కే యిట్లు
పలికి-పాపి గాచితి ||వాహా||

3 "అమ్మా! నీ సుతు"డటంచు మరి-యమ్మతో బలికి="క్రమ్మర
నీ జనని" యంచు-కర్త! నుడివితి[2] ||వాహా||

4 "నా దేవ దేవ యేమి విడ-నాడితి" వనుచు=శ్రీదేవ సుత పలికి
తివి శ్రమ-చెప్ప శక్యమా ||యాహా||

5 "దప్పిగొనుచున్నా" నటంచు-జెప్పితివి గద = ఇప్పగిదని[3]
బాధ నొంద-నేమి సేసు హా! ||యాహా||

6 శ్రమ ప్రమాదములను గొప్ప-శబ్ద మెత్తి హా="సమాప్తమైన"
దంచు దెలిపి-సమసితివి[4] గదా ||యాహా||

7 "అప్పగింతు దండ్రి నీకు-నాత్మ" నంచును=గొప్ప యార్భా
టంబు[5] చేసి-కూలిపోయితి ||వాహా||

---

1 ద్రోహము లేనివాడా! 2 పలికితివి 3 ఈ విధముగ 4 చనిపోతివి 5 శబ్దము

## 54 *Christ on the Cross.*

క్రీస్తు సిలువ బాధ.

రా—కాంభోజి. తా—ఆది.

మనస యేసు మరణ బాధ—లెనసి[1] మాపవే—త—న్నెనరు[2] జూడవే—యా—ఘనుని పాడవే=నిను — మనుప[3] వచ్చె ననుచు నమ్మి — మదిని వేడవే ||మనస||

1 అచ్చి[4] పాపములను బాప—వచ్చినాడట — వా—క్కిచ్చి తండ్రితో—నా—గెత్సేమందున = తా— నొచ్చి యెనను నొచ్చి బాధ — హెచ్చుగనెనట ||మనస||

2 అల్ల దేవ కోపమునను — దల్లడిల్లెనా[5]— నా — పల్ల నేరమా — మే—నెల్ల[6] రక్తమై=తా — నుల్లమందు[7] శ్రమల సొమ్మ — సిల్లి పోయెనా ||మనస||

3 రక్త స్వేద మొల్క[8] పాప — ఋణము లార్పెనా— మధు — రోక్తు[9] లాడుచు — నా — సక్తితోడను= వి — ముక్తి జేసి నిను జూపె — మోక్ష మార్గము ||మనస||

4 ఆ నిశీథ రాత్రి[10] వేళ — నార్భటించుచు[11] — న— య్యో నరాంతకుల్[12] — చే — బూని యీటెలన్ = ఒక — ఖూని వానివలెను గట్టి — కొంచు బోయిరా ||మనస||

5 పట్టి దొంగవలెను గంత — గట్టి కన్నులన్ — మరి—గొట్టి చెంపలన్ — నడి — దిట్టి నవ్వుచున్ = నిన్ —గొట్టె నెవ్వ రదియు మాకు — జెప్పుమనిరట ||మనస||

6 ముండ్లతోడ నొక కిరీట — మల్లి ప్రభు తలన్ — బెట్టి — రెల్లుగర్ర తో — నా — కల్ల[13] జనములు = రా — జిల్లు మనుచు గొట్టి నవ్వి — గొల్లు బెట్టిరా ||మనస||

---

1 పోల్చి 2 ప్రేమ 3 బ్రతికింప 4 బాకియున్న 5 అదిరిపోయెనా 6 శరీరమంతట 7 మనస్సునందు 8 రక్తచెమట కారగా 9 తియ్యని మాటలు 10 అర్ధరాత్రి 11 కేకలు వేయుచు 12 చంపువారు 13 నిజము లేని

7 మెయ్యాలేక సిల్వ భరము - మూర్ఛ బోయెనా - అయ్యయ్యో జోకొట్టెనా[1] - యే - సయ్యి తూలెనా = నా - యయ్య నిన్ దలంప గుండె- లదరి పోయెనా ||మనస||

8 కాలు గేలులన్[2] గుదించి - కల్వరి గిరిపై - నిన్ - నేలి జేయుచు - నీ - కొర్కె మీద నీ = నుప - చీలలతో గ్రుచ్చి నిన్ను - సిల్వ గొట్టిరా ||మనస||

9 దేవ సుతుడ వైతివేని - శూరంబుగా - దిగి - నీవు వేగ మే - రమ్ము - గావు మందును = నిట్టు - గారవించి[3] పల్కు - పగర[4] - కరుణ జూపెనా ||మనస||

10 తన్ను జంపు శత్రువులప - దయను జూపెనా - తన - నెనరు జూపెనా - ప్రభువు - కనికరించెనా = ఓ - జనక యీ జనుల క్షమింపు- మనుచు వేడెనా ||మనస||

11 తాళలేని బాధ తెచ్చి - దాహమాయెనా - న - న్నేలు వానికి నా - పాలి స్వామికి = నే - నేల పాపములను జేసి - హింస పరచితి ||మనస||

12 గోడు[5] బుచ్చి సిలువ పైన - నేడు మారులు - మాట - లాడి ప్రేమతో - నా - నాడు శిరమును = వంచి - నేడు ముగిసె సర్వ మనుచు- వీడె ప్రాణము ||మనస||

13 మరణమైన ప్రభుని జూచి - ధరణి వణికెనా - బల్ - గిరులు[6] బగిలెనా - గుడి - తెరయు జీలెనా = దివా - కరుడు[7] చీక టాయె మృతు లు - తిరిగి లేచిరి ||మనస||

14 శ్రీకరుండు[8] పాపులకును - జీవ మిచ్చెనా - పై - నాకసంబున - దూతా - నీక[9] నెల్లను = జూచి - శోకమంచు మునిగి రెంత - చోద్య మాహాహా ||మనస||

1 బొమ్మసిల్లెనా 2 చేతులు 3 గర్వించి 4 శత్రువులయెడల 5 విచారము 6 గొప్పకొండలు 7 సూర్యుడు 8 సౌఖ్యము నిచ్చువాడు 9 దూతల సమూహము

15 అప్పు[1] నీ శిరిమలో గనంగ-నొప్పజాలనే- నా - తప్పిదంబులే- యీ-చొప్పు నాయెనా = నిను తిప్ప లిట్లు - బెట్టి వధకు[2]- నొప్ప గించెనా ||మనస||

16 పంచ[3]గాయములను జెంది - వంచనాత్ముల[4]- ఒక -ఇంచు కైనను - కో - పించకుంటివా = మది - నెంచి చూడ జూడగాను - నెంత ప్రేమయా ||మనస||

17 అల్ల నీ యపార బాధ - లాలకించగా - నెద-పల్ల్లు కుళ్ళాయె- నే-తాళజాల నే=మది - ఝల్లుఝుల్లుమనుచు ప్రీతి -పెల్లుమీరు నే||మనస||

18 ఇంత జాలి యింత ప్రేమ - యింత శాంతమా - నీ - యంతఃకరుణను - నే - జింత చేయగా = నీ - వింత లెల్ల నిత్యజీవ విధము- లాయెనా ||మనస||

---

## 55 *The Wonderful Cross.*

ఆశ్చర్యకరమైన సిలువ.

రా—పున్నాగతోడి. తా—త్రిపుట.

ఏమాశ్చర్యము ప్రియులారా - క్రీస్తు మరణము - ప్రేమ జూడరె మనసార = నా మహాత్ముడు మరణ - మగు రీతి గనుగొన్న - సామాన్యమగు నొక్క-జనుని చందము[6] గాదు = ఈ మహిని గల పాపి జీవుల - పై మహా కృప జూచి నిత్య - క్షేమ మొసగెడు కొరకు బలు శ్రమ-చే మృతుండైనాడు స్వేచ్ఛను[7] ||ఏమాశ్చర్యము||

1 కొండలవలె భారమై - లోక పాపములు - దండింపబడె ఘోరమై = నిండు భారము క్రింద-నిలుచు నా వేళను - గుండె దిగులున తనువు - నిండె రక్తపు చెమట = మెండుకొని దుఃఖములతో నా -

---

1 నాయనా 2 మృతికి 3 అయిదు 4 మోసగాండ్రను 5 అధిక మానా 6 విధము
7 ఇష్ట పూర్వకముగ

తండ్రి యీ పాతకమును నా కడ - నుండి తొలగించుటకు మనసై -
యుండినను జేయుమని వేడెను ||ఏమాశ్చర్యము||

2 కడు దుర్మార్గుల చేతను - క్రీస్తుడు పట్టు - పడె దానంతట
తాను = చెడుగు లెంచక నింద - జేసి మోముపై నుమిసి[1] - వడిముళ్ళతో
నల్ల - బడిన కిరీటము = తడయక[2] కొంపల[3] బెట్టి కరముల - నడుగులను
సిలువ నిడి మేకులు - దొడిపి[4] ప్రక్కను రక్తజలములు - దొరుగ[5] గుంతము[6]
గ్రుచ్చి రహహా ||ఏమాశ్చర్యము||

3 ఇరుపార్శ్వముల నిద్దరి - దొంగల నునిచి - మరణావస్థల బెట్టిరి =
నిరపరాధి ప్రభు వానికి నాత్మ లోనరించు - తరుచు బాధల కోర్చి - మరి
వారి కరుణించి = యెరుగ రేమి యొనర్తురో యీ - దురిత జీవుల వీరి
నోహో - పరమ జనక క్షమింపుమని తన యరుల[7] కొరకై వేడుకొని
యెను ||ఏమాశ్చర్యము||

---

## 56 *A Meditation on Christ's Sufferings.*

క్రీస్తుయొక్క శ్రమలను ధ్యానించుట.

రా—ఆనంద భైరవి. తా—ఖండజాతిఝాప్.

రాజులకు రాజైన యీ - మన విభుని - బూజసేయుటకు రండి =
ఈ జయశాలికన్న - మన కింక - రాజెవ్వరును లేరని ||రాజులకు||

1 కరుణ గల సోదరుండై - ఈయన - ధరణి కేతెంచెనయ్యా =
స్థిరముగా నమ్ముకొనిన - మీ కొసగు - బరలోక రాజ్యమ్మును ||రాజులకు||

2 నక్కలకు బొరియ లుండె - నాకాశ - పక్షులకు గూళ్లుండెను =
ఒక్కింత స్థలమైనను - మన విభుని - కెక్కడ లేకుండెను ||రాజులకు||

3 కరమునం[8] దొక్క రెల్లు - పుడకను - దిరముగా నునిచి వారల్ =
ధరణీపతి శ్రేష్ఠుడా - నీకిపుడు - దండమనుచును మ్రొక్కిరి ||రాజులకు||

---

1 ఉమ్మి వేసి 2 ఆలస్యము చేయక 3 తలమీద 4 గ్రుచ్చి 5 దొర్లునట్లు 6 ఈటె 7 శత్రువు
8 చేతియందు

4 అపహాసములు సేయుచు - నాయన - యాననము[1] పై నుమి యుచు = గృప మాలిన సైనికు - లందరు - నెపము లెంచుచు గొట్టిరి ||రాజులకు||

5 ఇట్టి శ్రమలను బొందిన - రక్షకుని - బట్టు వలతో నమ్మిన = నట్ట హాసము[2] తోడను - బరలోక - పట్టణంబున జేర్చును ||రాజులకు||

6 శక్తిగల రక్షకుండై - మన కొరకు - ముక్తి సిద్ధము జేసెను = భక్తితో బ్రార్థించిన - మన కొసగు - రక్తితో నా ముక్తిని ||రాజులకు||

7 త్వరపడి రండి రండి - యీ పరమ - గురుని యొద్దకు మీరలు = దరికి జేరిన వారిని - నీ ప్రభువు - దరుమ డెన్నడు దూరము ||రాజులకు||

---

## 57 *Meditation on Christ's sufferings and death.*

క్రీస్తు శ్రమమరణముల ధ్యానము.

రా—ముఖారి. తా—అట.

ఐదు గాయము లొందినావా - నా కొరకై దు గాయము లొంది నావా = ఐదు గాయముల నా - యాత్మ దలంప నా - కొరాట[3] మెచ్చినదే - నీ - మైదిగ[4] నావంటి - మర్త్యుల[5] పాల్జేసి - మరణ మొందితివి గదే ||ఐదు||

1 గారమైన[6] నీ శరీర రక్త మిల - ధారయై కారినదా - నా - నేర మా యయ్యెది - భారమై నీ పైని - ఘోరమై యొరిగినదా ||ఐదు||

2 అందమౌ నీ తన్వు[7] - గంది రక్తస్వేద - బిందువులై రాలెనే - యీ - చంద మూహింప[8] నా - డెందమ్ము భీతిచే - గొందలమై[9] తూలెనే ||ఐదు||

---

1 ముఖము 2 నవ్వు 3 పరితాపము 4 శరీరము 5 మరణమునకు లోనైన వారి 6 సున్నితమైన 7 శరీరము 8 ఈ విధము తలపోయగ 9 విచారముతో నిండినదై

3 పిల్లపాపము మోయు-నల్ల దేవుని గొర్రె-పిల్లవు నీవేగదా-నా-పల్లనా నీ కింత-యల్లాట[1] బుట్టెనే-చెల్లు[2] తాళెదె నెటుద ॥ఐను॥

4 భంగి మాన్పట్టె-ముష్పాపుల గావ నీ-ప్రాణ మర్పించితివా-యీ-సంగతి జూచె నీ-సాహస[3] మింక నే-భంగి నీ జగతి మరువ ॥ఐను॥

5 ఆయాసమైన నీ-యాపద లెల్ల నే-నాలోచింపగ నాత్మలో-నెటా-బాయక తద్దివ్య-పాదసరోజము[4]-భాసిల్లు నా యాత్మలో ॥ఐను॥

6 తల్లికైన మరి-తండ్రికైన నన్న-దమ్ములకైన లేదే-కన్న-పిల్లలకైన నీ-ప్రేమ బోల్చుద మన్న-పృధ్విలో[5] గానరాదే ॥ఐను॥

7 ఈ ప్రీతి నీ యోర్మి-నీ మహత్వం బిల-నెవ్వ రూహింతు రొగిన్[6]-ఓ-హో ప్రభువా తద్ద-యోత్కటా[7] గంభీర్య-మూహింప నీకే తగున్ ॥ఐ॥

---

## 58 *Jesus, Lover of my soul.*

ఛాయ: యేసు నామమే పావనము.

రా—ఆనందభైరవి. తా—అట.

యేసు నా యాత్మ రక్షకుండ-నన్ను-వాసిగా జేప్పుమా నీ యందె=మోసకర జల-రాసుల[8] లుబ్బొంగ-జేసెడు తుపాను-దోసి వేయుము ॥యేసు॥

1 జీవ బాధ నే దాటు దాక-నన్ను-నీవె దాచుము నా రక్షక!=రేవునకు నడ్పి-ప్రోవు మో యేసు-దేవ! యాత్మను-జీవమున జేప్ప ॥యేసు॥

2 ప్రాపు[9] లేని నా యాత్మ న్నివు-నీమ-దాపునకు జేర్చి బ్రోచి కావు=మో పరమాత్ముడా!-యోపికతో జూచి-యాపదల బాపి-యాదరింపుము ॥యేసు॥

---

1 వణకు 2 అయ్యో 3 తెగింపు 4 నీ అందమైన పాద పద్మము 5 లోకములో 6 క్రమముగా 7 నీ అధికమైన 8 నీటి అలలు 9 దిక్కు

3 నా నమ్మికము నీ యందు ఉన్నది_నీలో_నేను గోర సాయం బున్నది = గాన నే ప్రాపు _ లేని నా తలను _ బూని రెక్కల_లోన గప్పుము ||యేసు||

4 యేసు! నీవే నాకు సర్వము_నీవు_దాసజనుల లేని నెత్తుము = నీ సుతుల మిత్రా_యేసు! రోగులకు_వాసిగా జీవ_వారలను[1] నవ్వి ||యేసు||

5 నావంటి ఘోర పాపి యేడి_యేసు_నీవంటి పరిశుద్ధు డేడి = కేవలము సత్య_భావముతో నిండి_నీవు కృపగల_దేవుడవు స్వామి ||యేసు||

6 నీను కృపాబాహుళ్యమందు[2]_ యేసు_నాకు పాపము గప్పు కొందు = సాదరంబగు[3] _ నీను మాటల _ మోదిమున శుద్ధి_పొందుకొన నిమ్ము ||యేసు||

7 నీవు నిత్యజీవపు టూటవు_నాకు_జీవజలంబు నిచ్చి కావు = మీవు నా యెదలో_గావగ లేచి_జీవ పదవికి_త్రోవ దీయుమా ||యేసు||

---

## ఈస్టరు.

## 59 *Come, ye faithful, raise the strain.*

రండు! విశ్వాసులారా! రండు విజయము సూచింపు_చుండెదు సంతోషంబును గల్గి_మెండుగ నెత్తుడి రాగముల్ = నిండౌ హర్షము మనకు_నియమించె దేవుడు; విజయం, విజయం, విజయం! విజయం! విజయం!

1 నేటి దివస మన్ని యాత్మలకును_నీటగు[4] వసంత ఋతు వగును_వాటముగ చెరసాలను గెలిచె_వరుసగ మూన్నాళ్ళ్ నిద్రించి = నూటిగ[5] లేచెన్_యేసు_సూర్యుని వలెన్ ||విజయం||

---

1 శుద్ధివారలను 2 అధికమైన కృపయందు 3 ఆదరణతో నిండిన 4 చక్కని. 5 తిన్నగ

2 కన్ను కన్ను కానని చీకటి-కాలము క్రీస్తుని కాంతిచే-ఇన్నాళ్ళకు శీఘ్రముగ బోవు-చున్నది; శ్రీ యేసుని=కన్నాళ్ళు కానని-మన-సన్నుతుల్ భువిన్ ॥విజయ॥

3 జలమగు మరణ ద్వారబంధ-ములు నిన్ బట్టక పోయెను - వెలుతురు లేని సమాధి గుహ్య-ములు నిన్నాపక పోయెను=గెలువవాయెను-కా-వలియు ముద్రయు ॥విజయం॥

4 పన్నిద్దరిలోపల నీ వేళ-సన్నుతముగ నీవు నిలిచి-యున్నావు; మానవుల తెలివి-కెన్నడైన నందని=ఔన్నత్య[1] శాంతిని -అనుగ్రహింతువు ॥విజయం॥

---

## 60 *The Resurrection of Christ.*

క్రీస్తు పునరుత్థానము.

ఛాయ: పరిశుద్ధ పరిశుద్ధ పరిశుద్ధ ప్రభువా.

రా—మారువా. తా—త్రిపుట.

విజయంబు విజయంబు విజయంబు మా యేసు-నిజమె మృత్యువు గెల్చి నేడు వేంచేసె=యజమాను డెల్ల ప్రయాసము లెడబాప-స్వజనుల రక్షింప సమసె[2] సిలువమీద ॥విజయంబు॥

1 విజయంబు విజయంబు విజయంబు మానవుల-వృజిన[3] నివృత్తిని[4] విభు డొనరింపన్=గుజనులచే[5] నతడు క్రూర మరణము నొంది - విజిత[6] మృత్యువు నుండి విజయుండై వేంచేసె ॥విజయంబు॥

2 విజయంబు విజయంబు విజయంబు మా యేసు-భుజము మీదను మోయు పరిపాలనంబు=కుజను[7] మీదను ప్రాణ త్యజనము జేసెను[8]-ధ్వజము[9] జేయుచు సిల్వ పాప మోడింతము ॥విజయంబు॥

---

1 మిక్కిలి ఎత్తయిన 2 మృతిబొందెను 3 పాప 4 పరిహారము 5 దుర్మార్గులచే 6 జయింపబడిన 7 మ్రాను 8 ప్రాణము విడిచిపెట్టెను 9 జండా

3 విజయంబు విజయంబు విజయం బికను మాకు - విజయము
కొనుండ ప్రభు యేసు క్రీస్తు = సుజనత్వమున వైరి వ్రాజము[1] గెల్వగ చేసి-
నిజముగ బరలోక నిలయాంబులో నిల్ప ‖విజయంబు‖

4 విజయంబు విజయంబు విజయం బనెడి పాట - నిజ భక్తితో
మనము నేర్చిన బాడి = భజియించెదము భూ న - భము[2] తాను పాలించు-
నజిత జీవ ప్రియు[3] డమరత్వ[4] మిడు మనకు ‖విజయంబు‖

---

## 61 *He liveth for ever.*

దాయ: శ్రీవర శుభ త్రైకుడ, లేక, ఎంతో సుందర మైనది ధర గిరులపై.

రా—బిళహరి. తా—ఆది.

హల్లెలూయ యని పాడుడీ - సమాధిపై - నెలుగే ము పరికింపుడీ=
కలదు యేసు సజీవుడయి, లే - ఖనము లవి నెరవేరెను - కలిమి మోదము
గలుగ, దివి నుతి - సలుప మహిమను నిచ్చును ‖హల్లెలూయ‖

1 హల్లెలూయ యని పాడుడీ - ఈ జగతికి - గలిగె రక్షణ చూ
డుడీ = శిల[5] దొలంగెను, ముద్ర విడె, కా - వలి సమాజము దేవుని -
బలిమి కాగక పారిపోయెను - గలిబి లాయెను నరకము ‖హల్లెలూయ‖

2 హల్లెలూయ యని పాడుడీ - చీకటిపైన - వేలుగే జయ మెంను
సుండీ = ఇలను మృత్యువు గూలె ; బ్రతికెగ - నల విశ్వాసము మరలను -
బలనిరీక్షణ మనకు కలిగెను-ప్రీతిహృదయమును బలపడెన్ ‖హల్లెలూయ‖

3 హల్లెలూయ యని పాడుడీ - దుఃఖించు నో - కలుకులారా[6]
వినుడీ = సొలయకుండగ[7] మీర లటులిటు - చూచుచుండుట యెవరిని ? -
ఫలము లేదిక బ్రతుకు యేసు-ప్రభుని వెదకుట మృతులలో ‖హల్లెలూయ‖

---

1 శత్రుసమూహము 2 ఆకాశము 3 ఓడింప శక్యముగాని జీవము నిచ్చువాడు
4 చావు లేనితనము 5 రాయి 6 స్త్రీలారా 7 అలయకుండ

4 హాలెలూయా యని పాడుడీ - యేసు ప్రభుని - కలవనే కలిగె గనుడీ = ఇలయు పరమును సఖ్యపడియెను[1] - కలిగె హర్షము చావు చే - సిలువ చింతలు మాని. పాడుడి - కలకాలంబగు మోదము ||హాలెలూయా||

5 హాలెలూయా యని పాడుడీ - మీ భారం - వేల[2] తీసె మరి నమ్ముడీ = బలహీనపు చిన్న మందా! - ప్రభుని చెంతను మేలుము - కలిగె జీవము మిమ్ము నాయన - కరుణతో నడుపును సదా ||హాలెలూయా||

6 హాలెలూయా యని పాడుడీ - సంఘము సదా - నిలిచి యుండును సుమండీ = పలు తెరంగుల రిపుల వలనను[3] - బాధ లెన్నియు గలిగినన్ - దొలగ కేమియు నన్ని దుర్గాల - గెలిచి వర్ధిలుచుండును ||హాలెలూయా||

7 హాలెలూయా యని పాడుడీ - దేవుని బోధ - పలు సర్వరాష్ట్రంబులన్ = ఎల్లను[4] మహిమను ప్రకాశముగలముగ - యేసు రక్షణ వార్తను - వెలుగువలె పరిసరింప జేయును - రిలను ఘృణతో[5] నేర్పుతో ||హాలెలూయా||

8 హాలెలూయా యని పాడుడీ - భక్తులారా - విలపింపవలదు[6] సుండీ = నిలుగకుండుడి సందియంబులు - గడచు కాలము శీఘ్రమే - కలుగు మీకు సమాధి మిమ్మను - గౌగలింప నెమ్మది ||హాలెలూయా||

9 హాలెలూయా యని పాడుడీ - గోధుమ గింజ - వలె బ్రతుకుదురు మీరలు = ఇలను ప్రభు తన పంట కూర్పను - నేగుదెంచును చివరను - దొలగ జేయును గురుగులను గో - ధుమలనుండి నిజంబుగా ||హాలెలూయా||

---

1 సమాధానపడెను 2 గొప్ప యిబ్బందులు 3 శత్రువుల వలనను 4 సంతోషము 5 కృపయుతో 6 ఏడ్వవద్దు

## 62 Victory in the Lord.

రక్షకుని యందు విజయము:

“ధైర్యము తెచ్చుకొనుడి, నేను లోకమును జయించి యున్నాను.” యోహాను 16:33

రా—సెహాన. తా—ఆది.

విజయ గీతముల్ పాడరే - క్రీస్తున్ జయ - విజయ గీతముల్ పాడరే = స్వజన మంతటి[1] మీద - విజయ మిచ్చెను దేవ - నిజకుమారుని నామమున్ - హృదయములతో - భజన చేయుచు నిత్యమున్ ||విజయ||

1 మంగళముగ యేసుడే - మనకు రక్షణ - శృంగమై[2] మనకిచ్చెను - నింగిన్[3] విడిచి వచ్చెను - శత్రుని యుద్ధ - రంగమందున గెల్చెను = రంగుమీరగ తన - రక్త బలము వల్ల - పొంగు నణగ జేసెను - సైతాను బల్ - క్రమంగ నలిపి జీల్చెను ||విజయ||

2 పాపముల్ దొలగింపను - మనలను దన స్వ - రూపంబునకు మార్చను - శాపం బంతయు నోర్చెను - దేవుని న్యాయ - కోపమున్ భరియించెను = పాప మెరుగని యేసు - పాపమై మన కొరకు - పాప యాగమున్ దీర్చెను - దేవుని నీతిగా - ధీరుడై నెరవేర్చెను ||విజయ||

3 సిలువ మరణము నొందియు - మనలను తనకై - గెలువన్ లేచిన వానికి - చెలువుగన్[4] విమలాత్మని - ప్రేమను మనలో - నిలుపన్ జేసిన వానికి = కొలువు జేతుమె గాని - మరువ జాలము వాని - సిలువ మోయుచు నీకృపా - రక్షణ మహా - విలువ గలదని చాటుచూ || విజయ ||

---

## 63 క్రీస్తు పునరుత్థాన దిన చరిత్రము

రా—ఆనందభైరవి. తా—ఆది.

మరణమున్ జయించి లేచెను - మన ప్రభువు నేడు - మహిమ దేహ మొనర దాల్చెను = ధర సమాధి బంధములను - ధన్యముగను గెల్చి లేచి - కొరతలన్ని దీర్చి జీవ - వరము లియ్య వసుధ పైని ||మర||

---

1 పాపమంతటి 2 కొమ్ము 3 ఆకాశము 4 చక్కగా

1 మరియయును సలోమి మొదలగు - మగువలు[1] సబాతు - మరు
దినోదయమున బ్రియముగ = గురుని దేహమునకు బూయ - బరిమళించు
తైలములను - సరగ దీసికొని సమాధి - కరుగుదెంచి కనుల జూడ ||మర||

2 నేడు ప్రభు సమాధి ముఖముపై - నున్న పెనురాయి[2] - నెవడు
దీయు గదుగను మనకై = చేడియల్[3] లిట్లనుచు వేగ - చేరి యా సమాధి
మూత - వీడి యుండ జూచి మిగుల - విస్మయమ్మునంది రప్పుడు ||మర||

3 వారు తెల్ల నిలువుటంగీతో - గూర్చున్న పడుచు - వాని చూచి
మిగుల భయముతో = చేర రాక నిలిచియున్న - వారి నతడు గాంచి
యమ్మ - లారా భయపడక డంచు - నూరడించె[4] నుచితముగను ||మర||

4 కొరత[5] పైని మరణ మొందిన - నజరేయు యేసు - కొరకు మిగుల
వెదకుచుండిన = తరుణులారా[6] మీ ప్రభుండు - తిరిగి బ్రతికె నిక్క - మిద్ది -
సరగ జేతురాదె శిష్య - సమితి తోడ జెప్ప డనియె ||మర||

5 మానితముగ మీ కిటు ముందు - ప్రభు చెప్పినట్లు - కొనబడును
గలిలయ యందు = గాన వెళ్లు డంచు భాసి - తాననుండు బల్క - వినుచు -
దీనజనులు జడిసి మిగుల - దిగులు నొంది పరికి రప్పుడు ||మర||

6 మొదట మగ్దలేనే మరియకు - కనబడె నటంచు - సుదతి[7] దెల్పె
శిష్యవరులకు = కొలువు లేని సంతసమున - గోర్కె దీర బ్రభుని జూడ -
పదిలమైన యత్నములను - పరగ జేసి జూచి రప్పుడు ||మర||

7 అంత్యశత్రువైన మరణమున్ - బ్రభు గెల్చె నంచు - సంతసించి
సన్నుతింతము = వంతలేల[8] భక్తులారా - వాస్తవముగ మనల నిటుల -
నంత్యదినమునందు లేపు - నమల దేహముల[9] నొసంగు ||మర||

---

1 స్త్రీలు 2 పెద్దరాయి 3 స్త్రీలు 4 ఆదరించెను 5 సిలువ 6 స్త్రీలారా 7 స్త్రీ
8 చింతలేల 9 పరిశుద్ధ దేహములను

# ఆరోహణము.

## 64 *Christ parting from his Disciples.*

క్రీస్తుయొక్క అనుజ్ఞ.

రా—ముఖారి. తా—ఆది.

ఇదిగో నా శిష్యులార - యెరుక లుంచుండి[1] = మోక్ష - సదనమున[2] కేను బోదు - సంతోషింపుండి ॥ఇదిగో॥

1 యెరుషలేమందుండి - మీ రెదురు చూడుండి = మీపై - బరిశుద్ధాత్మయు దిగి వచ్చి - పనులు దెల్పును ॥ఇదిగో॥

2 దిక్కు లేనట్లు నిమ్ము - దిగనాడి పోను = మీతో - మక్కువై యుండ పరిశు - ద్ధాత్మను బంపెదను ॥ఇదిగో॥

3 నిర్వాణమున[3] మీ కొరకై - నెళవులు[4] గల్పింతు = నాతో - సర్వకాలము నిత్య - సామ్రాజ్యము[5] నేల ॥నిదిగో॥

4 ఒకరితో నొకరు ప్రియము - లొప్పి యుండుండి = నాదు - సకలాజ్ఞ లందు నిదియె - సార మనుకొండి ॥ఇదిగో॥

5 ఏదైన నా నామమున - నెంచుకొ వేడినను = మీకు - మోదము తోడ దాని - ముందె జేయుదును ॥ఇదిగో॥

6 ఉల్లములందు కలత - లెల్ల విడువుండి = నేను - మళ్ళి వచ్చెడు విధము - మరువకుండుండి ॥ఇదిగో॥

7 విశ్వాస ముంచుండి స - ర్వేశ్వరునియందు = మీకు - శాశ్వతమైన మోక్ష - స్థలి సౌఖ్యము లబ్బు ॥ఇదిగో॥

---

1 జ్ఞాపకము లుంచుడి 2 మోక్ష గృహమున 3 పరమందు 4 గృహములు 5 అధికారముతో

## 65 *To realms of glory behold.*

చాయ: శృంగారవరా నగరి.

రా—హుసేని. తా—చాప్

మహిమ లోకంబునకు - నుళ్ళినావా - మహిలో నను బెట్టి ప్రభూ =
ఇహమందు పరవాసి - నై యింటి కేమముగ - విహరించుచుందు నా -
విహితు[1] లెవ రన శ్రీమతె ||మహిమ||

1 ఎన్నాళ్లుండగ వలె - నింటికి దూరముగ - కన్ను చూడను నిన్న -
గాని ప్రార్థన చేచున్ = పన్నుగ నిట్టూర్పు[2] - పరలోకమున బొచ్చి -
న్నిన్ను జేరుచు నుండు - నేను వచ్చు వరకు ||మహిమ||

2 అప్పుడా పరమార్థ - మనుభవించుచు నుందు - నెప్పుడు మన
మికను - నెడబాయ కుందుము = ఇప్పుడమి[3] వేదన - లిక నుండ నేరవు -
అప్పురిన్[4] భక్తులతో - ఆనందముగ నుందు ||మహిమ||

3 అచ్చట రాత్రియు - హానియు నుండదు - ఎచ్చట భవమో యట -
హృదయంబు నుండును = విచ్చల విడిగా నా - విజయ రక్షకునితో -
ముచ్చట లాడుచు - మురియుచు నుందును ||మహిమ||

4 ఏ రీతిన్ వెళ్ళితివో - ఆ రీతిన్ వచ్చెదవు - ఏ రోజున వచ్చె
దవో - ఎరుగనే యెరుగను = ఊరకుండక వేడుచు - నూరుకొని యుం
దును - నీ రాక కోసమై - నిత్యంబు జూతును ||మహిమ||

5 ఈవు వచ్చు నప్పు - డిట్లుండగ గల్గెడి - పావన మానవుడు -
భాగ్యవంతుడౌను = నీ వాగ్దానము బట్టి - నీ తండ్రి యింటను - చావు
లేని స్థితి శా - శ్వత మహిమ యతనిదే ||మహిమ||

---

1 స్నేహితులు 2 ఏడ్పులు 3 ఈ భూలోకమందలి 4 ఆ పురములో

## 66 *Praise to Christ.*

క్రీస్తునకు స్తోత్రము

రా—సురటు. తా—అట.

మంగళమే యేసునకు – మనుజావతారునకు – శృంగార ప్రభువునకు – క్షేమాధిపతికి ॥మంగళమే॥

1 పరమ పవిత్రునకు – వర దివ్య తేజునకు – నిరుప మానందునకు[1] – నిపుణ వేద్యునకు[2] ॥మంగళమే॥

2 దురిత సంహారునకు – వర సుగుణోదారునకు – కరుణా సంపన్నునకు – జ్ఞాన దీప్తునకు ॥మంగళమే॥

3 సత్య ప్రవర్తునకు – సద్ధర్మ శీలునకు[3] – నిత్య స్వయం జీవునకు – నిర్మలాత్మునకు ॥మంగళమే॥

4 యుక్త స్తోత్రార్హునకు – భక్త రక్షామణికి – సత్య పరంజ్యోతి యగు – సార్వభౌమునకు[4] ॥మంగళమే॥

5 ఘనుడైన యెహోవా – యను పేరిటి దేవునికి – తనయుండై పరగు సుజ్ఞన పూజ్యునకు ॥మంగళమే॥

6 నర ఘోర కలుషముల[5] నురుమారంగ[6] – నిలను – వరుసెంచిన మా పాలి – వర రక్షకునకు ॥మంగళమే॥

7 దుర్మరణ శ్రమలకు – పేర్మితో నోర్చుచు – ధర్మజ్ఞానము చెల్పెడి వాక్యమునకు ॥మంగళమే॥

8 పరమార్గము జూపుటకు – భారంబులు మాన్పుటకు – పరిశుద్ధాత్మని కొరకు – ప్రార్థింతుము నీకు ॥మంగళమే॥

9 పరమ పురి వాసునకు – నరదైవ రూపునకు – పరమేశ్వర తనయునకు – ప్రణుతింతుము[7] నీకు ॥మంగళమే॥

---

1 సాటిలేని సంతోషముగలవానికి 2 నేర్పరులకు తెలియబడువాడు 3 ఎల్లప్పుడు మేలు చేయుచుండువాడు 4 చక్రవర్తి 5 భయంకరమైన పాపముల 6 తుత్రించివేయుటకు 7 పరిశుద్ధులను చెల్లింతుము

## 67 *Praise to the Son of God.*

దేవ కుమారునికి స్తోత్రము.

రా—ముఖారి. తా—అట.

దేవ కుమారా - దీనోపకారా = నా వంక దయ జూప - నా యన్న రారా ‖దేవ కుమారా‖

1 వృక్షము బాసిన - పక్షినే నయ్యా = యక్షీణ[1] కరుణచే - రక్షింప వయ్యా ‖దేవ కుమారా‖

2 పాపుల పాలిటి - పరమ దయాళూ = దీపింపు[2] నీ దయ - దీనుని కిపుడు ‖దేవ కుమారా‖

3 వినుతింతు సగుణ - విమల విచారా = నను బ్రోవవే యేసు - నామావతారా ‖దేవ కుమారా‖

4 భజన జేసెద నిన్ను - నిజ రక్షకుండా = విజయము జేయవే - నజరేతు వాడా ‖దేవ కుమారా‖

5 కనికర మత్యంత - కరుణయు గలదు = నిను నమ్మి వాని చే - టిని పీడ వలదు ‖దేవ కుమారా‖

6 మహనీయ[3] గుణమణి[4] - మండిత[5] దేవా = ఇహ బాధ బాపవే - ఇమ్మానుయేలూ ‖దేవ కుమారా‖

---

## 68 *The Love of Jesus.*

యేసు యొక్క ప్రేమ.

రా—ఆనంద భైరవి. తా—అట.

ఈలాటిదా యేసు ప్రేమ - నన్ను - తూలనాడక[6] తనదు - జాలి జూపినదా‖

---

1 తరగని 2 ప్రకాశింప జేయుము 3 యోగ్యమైన 4 గుణము లనే ప్రశస్తమైన రాళ్ళచే 5 అలంకరింపబడిన 6 త్రోసివేయక

1 ఎన[1] లేని పాపకూపమున[2] — నేను — తనికి మినుకుచును[3] — ఏ దరి గానకుండన్ — కనికరము బెంచి నాయందు — వేగ — కొనిపోవ నా మేలు — కోర కింపు వచ్చె ||నీలాటిదా||

2 పెనుగొన్న దుఃఖాబ్ధిలోన[4] — నేను — మునిగి కుములుచున్[5] నేడు — పునగుంచు[6] నపుడు — నను విడువని త్రోయలేక — తనదు — నెనరు నా కగుపరచి — నీతి జూపించె ||నీలాటిదా||

3 నెమ్మి[7] రవ్వంతైన లేక — చింత — గ్రమ్మి పొగలుచున్[8] — నుండగా నన్ను జూచి — సమ్మతిని నను బ్రోవ దలచి — కరము — జాచి నా చెయి బట్టి — చక్కగా బిలచె ||నీలాటిదా||

4 పనికి మాలిన వాడనైన — నేను — కనుపరచు నా దోష — కపట వర్తనము — మనసు నుంచక తాప సడక — యింత — ఘనమైన రక్షణ — మును నాకు జూపె ||నీలాటిదా||

5 నా కోర్కెలెల్ల సమయములన్ — గ్రింది — లో వాంఛల భ్రమసి[9] — లొంగు నా వేళన్ — జేకూర్చి దృఢము చిత్తమునన్ — శుభము — నా కొసగె జీవింప — నా రక్షకుండు ||ఈలాటిదా||

6 శోధనలు నను జుట్టి నపుడు — నీతి — బోధ నా మనసులో — బుట్టించి పెంచి — బాధ లెల్లను బాపి మాపి — యిట్టి — యాదరణ జూపెనా అహహ యేమందు ||నీలాటిదా||

---

## 09 *Christ the Good Shepherd.*

క్రీస్తు గొర్రెలకు మంచి కాపరి.

రా — పంతువరాళి. తా — ఛాప్

ఇడుగో గొర్రెల కాపరి — సోదరులారా — ఇడుగో గొర్రెల కాపరి =

---

1 సాటి 2 నూతిలో 3 పడుచు లేచుచు 4 దుఃఖ సముద్రములో 5 కృశించుచు 6 చింతించు 7 సుఖము 8 ఏడ్చుచు 9 లోపలి హీన కోర్కెల వలన మోసపోయి

కడ గానరాని కాననములో[1] నలసట - నొందవు[2] గొర్రెల నెల్ల - నొగి[3] పిల్చి రక్షించు ॥నిజముగో॥

1 చెదరిపోయిన గొర్రెనై - దొడ్డికి బోవ - ముఖము లేని వాడనై = వ్యధను మధురంపు నినదము[4] నాలించక నిత్య - కొదిగి[5] యుండక మూఢ - హృదయుడ నైతిని ॥ఇదుగో॥

2 దూరంబునకు బోతిని - జనకుని కృపా - సారంబు గొననైతిని[6] = కారు[7] మూర్ఖపు పిల్ల - గా సంచరించి నా - కూరిమి యిలు బాసి - దారి దొలగిపోతి ॥నిజముగో॥

3 తనదు గొర్రెను జూచెను - గాపరి తండ్రి - తన శిశువును గాంచెను = కనికర మెదలో నిం - డిన యాతడై నన్ను - వనగిరి కటకాదు - లనుర[8] వెంబడించెను ॥ఇదుగో॥

4 ప్రాణావసర మప్పుడే - నేకాకినై - క్షీణించి యున్నప్పుడే = త్రాణార్థమగు[9] నెనరు - త్రాళ్ళతో నను గట్టి - నాణెంబుగా దెచ్చి - నన్ను రక్షించెను ॥ఇదుగో॥

5 చెడుగు మెకములు[10] నలనను - బాధల నొంది - కడు మలినమై యుండను = కడిగి గాయము లన్ని - గట్టి శుభ్రముచేసి - విడువక నా యింటనిడి నెమ్మది నొసంగె ॥నిజముగో॥

6 ప్రభు యేసు నా బోయడు - ఇతడె భూమి - నభము[11] లేలెడి రాయడు = శుభమైన తన దివ్య - శోణిత[12] మొసగి యి - వ్విభుడు ప్రేమించి దీ - వించి స్వస్థము జేసె ॥నిజముగో॥

7 నన్ను దొడ్డిని బెట్టెను - పోయిన గొర్రె - నెన్ను వెదకి పట్టెను = సన్నంపు పచ్చిక - చక్కని యూటలు - నెన్న గల్గెడి చోట్ల - నన్నుంచి రక్షించె ॥నిజముగో॥

---

1 దట్టమైన అడవియందు 2 పొందు 3 క్రమముగ 4 శబ్దము 5 లోబడి 6 పుచ్చుకొనకపోతిని 7 మోటు 8 పర్వత ప్రదేశములు మొదలగువాటిలో 9 ఒంటరైన 10 మృగములు 11 ఆకాశము 12 నెత్తురు

8 నేను మూర్ఖపు గాత్రినై - లోపలనుండి - మానసమున వెర్రినై = పూని యిప్పుడు కాచు - వాని శబ్దము ప్రేమ - తో నాలకించుచు దొడ్డి - నానందమున నుందు ॥నిజగో॥

9 చెడ్డ బిడ్డనై యుంటిని - ఎటు నటు బోవ - నెడ్డితనము[1] గొంటిని = మొద్దు లే కిపుడు ప్రే - మించు నా ప్రియ జనకు - వాక్కు శబ్దము వాంఛిం - తును[2] ముక్తి నిలయంబు[3] ॥నిజగో॥

---

## 70 *The great Love of Jesus.*

యేసుయొక్క గొప్ప ప్రేమ.

రా—ముఖారి. తా—అట.

యేసూ నన్ను ప్రేమించినావు - పాపినైన నన్ను ప్రేమించి నావు = నన్ను ప్రేమింప మానవ రూప మెత్తి దా - నముగా జీవము సిల్వపై = నిచ్చి - కన్న తల్లి తండ్రి యన్నదమ్ముల ప్రేమ - కన్న మించిన ప్రేమతో ॥యేసూ॥

1 తల్లి గర్భమున నే ధరియింప బడినపుడే - మరితుండనై యుంటి ని = నా - వల్ల జేయబడెడు నెల్ల కార్యము లెప్పు - డేహ్యంబులై[4] యుండగ ॥యేసూ॥

2 మంచి నాలో బుట్ట దంచు నీ వెఱిగినను - మించ ప్రేమించినావు = అహో - యెంచ శక్యముగాని - మంచి నాలో బెంచ - నెంచి ప్రేమించి నావు ॥యేసూ॥

3 నన్ను ప్రేమింప నీ కున్న కష్టము లన్ని - మున్నె తెలిసి యుంటివి = తెలిసి - నన్ను బ్రేమింప నీ కున్న కారణ మేమో - అన్నా తెలియదు చిత్రము ॥యేసూ॥

---

1 మూర్ఖత్వము 2 కోరుదును 3 ఇల్లు 4 అసహ్యములై

4 నా వంటి నరు డొకడు నన్ను ప్రేమించున - నావలన ఫలము గోరు= ఆహా - నీవంటి పుణ్యునికి నా వంటి పాపితో - కేవలం బేమి లేదే ||యేసూ||

---

## 71 *Praise to Christ.*

క్రీస్తునకు స్తుతి.

రా—సహాన. తా—ఆది.

నా రక్షకా యేసు - నాథా యిమ్మానుయేలు[1]= ఘోరపాపుల పాప - భార విమోచక ||నా రక్షకా||

1 నిత్యకాలమునందు - నిజమైన దేవుని = సత్య వాక్యమై యున్న - స్వామి నిన్నుతియింతు ||నా రక్షకా||

2 దేవ మహిమ ప్రకాశ-దీన రక్షక మాను= ష్యావతారము దాల్చి - యావ దాజ్ఞల దీర్చిన ||నా రక్షకా||

3 పాపాత్ములను గావ - శాప భారము క్రింద = నోపికతో నిల్చి - ఓర్పు జూపిన ప్రభువా ||నా రక్షకా||

4 ఈ వసుధను ప్రేమ - నెసగునట్లుగ[2] జూపి = చావు గెల్చిన సర్వ - సామర్థ్యుడా స్తుతింతు ||నా రక్షకా||

5 ఘనదేవు కుడిపార్శ్వ - మున గూర్చుండి విజ్ఞప్తి= నొనరించు నా యేసు - వినయ స్తోత్రం బిదిగో ||నా రక్షకా||

---

## 72 *The Head that once was crowned with thorns.*

ఛాయ: మా రక్షణ దేవా ! మము మన్నింపుము నీ తట్టుకు

రా—ముఖారి. తా—ఛాప్.

మును ముండ్ల కిరీటంబును - గొని వాలిన శిర సిప్పుడు - కను డిదిగో ! మహిమాద్భుత - ఘన కిరీటము దాల్చెను ||మును||

---

1 హెబ్రీ భాషలో “దేవుడు తోడై యున్నాడు” అను మాట 2 విస్తరించునట్లుగ

1 రాజార్హపు[1] మకుటం బది[2] – రాజిల్లుచు విజయుండౌ – తేజస్వి మూర్ధంబున[3] – దేజోమయమై యొప్పెను ||ముసు||

2 సర్వోన్నత పద వాతని – స్వత్వం[4] బాయెను పూర్తిగ – సర్వజ్ఞుడు రారాజిదె – స్వర్గంపు వెలుం గాయనె ||ముసు||

3 తన ప్రేమ నామ స్మర – ణను జేసెడు ధన్యులకు – ఘన సంతోషము తా నయి – తనరు[5] నిహపరములను ||ముసు||

4 సిలువను మోసెడు వారికి – కలుగును శాశ్వత నామము – పలు విధ కృపా శాంతులు – పరలోకపు మోదంబును ||ముసు||

5 ప్రభుతో కష్టం బిచ్చుట – సఖతో హర్షం బచ్చుట – ప్రభుత్వము చేకూరును – ప్రభు ప్రేమయు దెలియంబడు ||ముసు||

6 అవమానము మరణము ప్ర – భువున కిడు సిలువే క్రై – స్తవ జీవ నిరీక్షణయు – స్తవముం గాదె నిత్యము ||ముసు||

---

## 73

క్రీస్తునకు మంగళార్చన.

రా—బిళహరి. తా—అట.

మంగళంబని పాడరె – క్రీస్తునకు జయ – మంగళంబని పాడరె – యేసునకు జయ – మంగళంబని పాడరె = మంగళంబని పాడి సజ్జ – నాంగ పూజితుడై కృపా త – రంగి[6] లోక సమూహ పాప వి – భంగుడని[7] యు – ప్పొంగి జయజయ ||మంగ||

1 ఘన యూద దేశంబులో – నను బేత్లెహే – మున యూదుల కులములో = వినుడు యోసే – పునకు సతియై – దనరు చుండెడి మరియ కడుపున – జననమై యీ మర్త్యవరులకు – సద్గతిని గల్గించు వానికి ||మంగ||

1 రాజునకు తగిన 2 కిరీట మది 3 తలను 4 స్వంతము 5 ఒప్పును 6 కృపాసముద్రము 7 పోగొట్టు వాడని 8 నరులకు

2 సోదరాళిభంగిని[1]–భక్తుల నెల్ల–జూచి బ్రోచెడు వానిని–యూదదేశపు వార లధిక–బాధ బెట్టుచు హింస జేసిన–సాదరంబున త్రిప్పిజన ములకు–సాధులకు కనఁబడిన ప్రభునకు ||మంగ||

3 ఘోర నిన్నొల్చెడి దాస జ–నములను బ్రోచు–దైవ తనయుడ వీ నిజ—పురము నలను స్మరించువారిని–గురుతరంబగు[2] కలుష జలనిధి[3]–దరికి జేర్చుచు పరమ పదమే–ఇవు[4] వొనర్చెద ననిన ప్రభునకు||మంగ||

---

## 74 *Praising Christ.*

క్రీస్తు దేవుడని స్తుతించుట.

రా—ముఖారి. తా—త్రిపుట.

నీవు నా దేవుండవై–యున్నావు యేసు–నాథ యీవుల–బ్రోవవే–నన్ను గావవే ||నీవు||

1 పాప మానవ–శాప భారము–నోపి శిల్వను బడిన క్షేమా–ధిపతి–సర్వ భూపతి ||నీవు||

2 శ్రేయమౌ కా–యంబు భక్తుల–కీయ సిద్ధము జేయు యేసు–నాయకా–మోక్షదాయకా ||నీవు||

3 జీవ మారెడి[5]–త్రోవనే బడి–చావనై యున్నాను పతిత–పావనా–ఆత్మ జీవనా ||నీవు||

4 జాగు సేయక–బాగు సేయను–రాగదె నే ఘోర పాప–రోగిని–దుఃఖ భాగిని ||నీవు||

5 పాపమున నా–రూపు మాపితి–ప్రాపు నీవని నమ్మితిని నను–లేపవా–కృపను జూపవా ||నీవు||

---

1 సహోదర సమూహము వలె 2 గొప్ప 3 పాప సముద్రము 4 నివాస-స్థలము 5 జీవము పోవు

# పెంతెకోస్తు.

## *Descent of the Holy Ghost.*

పరిశుద్ధాత్మ యొక్క కుమ్మరింపు.

రా—ఆనందభైరవి. తా—ఆది.

వినరే యపోస్తులుల కార్యముల్ - క్రైస్తవు - లను వారి కవి
యెంతో ధైర్యముల్ = మనసు లొక్క—టి జేసి - కొని యట్లు ప్రార్థింప-
ఘనముగా విమలాత్మ - చనుదెంచె[1] వారిపై ||వినరే||

1 పరమండలమునుండి వచ్చెను - పెద్ద కరువలి[2] వలె శబ్ద మిచ్చెను=
దిరముగ వార లం-దరు గూడియున్న మం-దిర మెల్ల నిండె బం-
ధురమైన[3] తన్నాదము[4] ||వినరే||

2 అనలార్చులను[5] దీప్తి మించుచు - బీట - లగు జిహ్వాల్వలె[6] గను
పించుచు = ఘనముగ నొక్కొ—క్క—జనునిపై నవి బిల్వ - గను బరిశుద్ధా
త్మచే - తను నింపబడి రంత ||వినరే||

3 వా రన్య భాషల నేర్చుచు - నాత్మ - ప్రేరేపణము జేయు
జాడను = ధారాళముగ భాషాం - తరము లాడిరి విన్న - వారి కబ్బురమై[7]
వి - చారము ల్బొడమంగ[8] ||వినరే||

4 ముందట వారిటుల గుంపుగ - మోద - మందుచు దేవుని గొల్చి
తా = మందరు చూడగ - వింత వింత పనుల - నందంమ జేసిరి - ఆత్మా
వేశముచేత ||వినరే||

5 మనము నా రీతిగ గుంపుగా - గూడి - మన దేవు గొల్వగ
భూమిలో = మనుజుల కాశ్చర్య - మగు కార్యముల జేయ - నొనగూడు
మది యం - దుత్సాహమును గల్గు ||వినరే||

---

1 వచ్చెను 2 గాలి 3 దట్టమైన 4 ఆ ధ్వని 5 అగ్నిజ్వాలలను 6 నాలుకలవలె 7 ఆశ్చర్యమై
8 పుట్టునట్లు

## 76 Our need of the Holy Ghost.

పరిశుద్ధాత్మ లేని సాధనము వ్యర్థము.

రా—కళ్యాణి. తా—అట.

పరిశుద్ధాత్మను గోరుము - జీవము యేసు - ప్రభుని పేరిట వేడుము= నరు లందరి మీద - నా యాత్మ నుంతునని - పరలోకపు తండ్రి - పలికె వేదమునందు ||పరిశుద్ధాత్మ||

1 పరిశుద్ధాత్మము లేనిది - వేదాగమము[1] - పఠన పఠనము గాదది= నెరి[2] చీకటింట - సరకులు వెదకు రీతి ప—ల్మరు[3] వెదకినను నిర - ర్థకమై పోవును వేగ ||పరిశుద్ధాత్మ||

2 పరిశుద్ధాత్మము లేనిది - వర్షము లేని - పైరు చందంబే యది = పరబోధకములు - వర్తితమైన[4] పనులు జీ—వము లేనివై యను - భవము గానివై యుండు ||పరిశుద్ధాత్మ||

3 పరిశుద్ధాత్మము లేనిది - యేసు ప్రభుని - నెరుగు టెరుగుట గాదది = నరరూపు దాల్చి మ—ర్త్యుల రక్షణ కొరకు - మరణ మొందిన ప్రభుని || కరుణాధికము వడయ[5] ||పరిశుద్ధాత్మ||

4 పరిశుద్ధాత్మము లేనిది - జీవము లేని - బ్రతుకే బ్రతుకు గాదది = మరి తేచ్ఛలను గొప్ప - యురులం దగిలి[6] భక్తి - తరిగి పోవుట కద్దు - దొరుక నంమనె సుమ్మి ||పరిశుద్ధాత్మ||

5 పరిశుద్ధాత్మను పొందుట - యన్నిటి కన్న - ప్రబలంబైన మేలిది = నెర[7] నమ్మి మొరబెట్టు - పరమ పావను డద్ది - కరుణించి నీ కొసగు - మరణాంత మగు దనుక ||పరిశుద్ధాత్మ||

---

1 పరిశుద్ధ లేఖనము 2 గొప్ప 3 పలుమారు 4 జరిగింప బడిన 5 పొంద 6 చిక్కులలో పట్టుబడి 7 పూర్తిగ

## 77 *Praise to the Holy Ghost.*

పరిశుద్ధాత్మకు స్తుతి.

పరిశుద్ధాత్మ మహాత్మ — పరమ పావురమా — దురి తేచ్ఛలను దూర — పరచె స్థావరమా ||పరిశుద్ధాత్మ||

1 నిత్యంపు వెల్గుచే — నింపు జ్ఞానాత్మ = సత్యంపు వార్త — సంధించు కృపాత్మ ||పరిశుద్ధాత్మ||

2 జీవ మార్గంబున — జీవింప నేర్పి = త్రోవ దప్పిన వారి — భావంబు మార్చి ||పరిశుద్ధాత్మ||

3 పాపాంధకారంబు — బాపు నీ వెలుగు = జూపి మింటికి నడిపి — కాపాడి మెలిగె ||పరిశుద్ధాత్మ||

4 భక్తుండు శోధింప — బడుచుండు నేని = యుక్తి దెల్పెడి సర్వ — శక్తి నీ దాను ||పరిశుద్ధాత్మ||

5 తిన్ననైన తెలివి — తేట నా కిమ్మ = నిన్ను సేవించెద — నిజము స్తోత్రిమ్మ ||పరిశుద్ధాత్మ||

---

## 78 *Come Holy Spirit, God and Lord.*

ఛాయ: యేసు నాయకుడ, యే వేళను నీ.

రా—యదుకుల కాంభోజి. తా—ఆది.

పరిశుద్ధాత్ముడ! దేవ! — ప్రభువా! నీ కరుణ మా — పైన వర్షింపుమయ్య = వరుడా! నీ భక్తుల — మనముల నాత్మల — బలపర్చి, రక్షించి — మరి స్వస్తి నిడు మయ్య ||పరి||

1 బలమా నీ వెలుగుచే — పలు దేశ భాషల — ప్రజల కందర కైక్యము = గలిగించి విశ్వాస — మున వారి నొనగూర్చి — వెలయుచుండెదము నీకే — వినుతుల్ సల్పుదు మయ్య ||పరి||

2 బలమా దుర్గమా! మిగుల - పావనంబగు వెలుగా! - ప్రభునా
దేవుని జ్ఞానము = కలిగించి మదితోడ - బిలువం దండ్రి యంచు - వెలుగు
సత్యమునా నీ - బల వాక్య మిదు మాకు ||పరి||

3 విపరీత బోధలను - వేరొ బోధకులను - విడువ మా కిడు సాయము =
కృప నొప్పు యేసే మా - గురు వంచు మది నమ్మి - యపనమ్మికను
మాని - యవనిం బ్రతుక నిమ్ము ||పరి||

4 పరిశుద్ధలోకపు నూటా! - నెర[1] నెమ్మదికి కర్తా! - జరిగింప నీ
యాజ్ఞలన్ = త్వర నొంద చరణములు - స్థిర డెందమును నిమ్ము - పరిశీల
నలు గల్గి - భయ మొంద నీయకుము ||పరి||

5 మరణ జీవంబు ల - స్థిర యోధులను[2] బోలి - పరుగెత్త నీ దారినే =
తిరత తప్పిన[3] వేళ - దేహంబునకు శక్తి - గరిమతో[4] నిడి సిద్ధ - పరు
చుము మము ప్రభువా ||పరి||

---

## త్రియేకత్వము.

## 79 *Praise of the Divine Trinity.*

త్రైయేక దేవుని స్తుతి.

రా—ముఖారి. తా—అట.

పరిశుద్ధ పరిశుద్ధ - పరిశుద్ధ ప్రభువా = ఎరదూతలైన నిన్ - వర్ణింప
గలరా ||పరిశుద్ధ||

1 పరిశుద్ధ జనకుడ - పరమాత్మ రూపుడ = నిరుపమ[5] బలబుద్ధి - నీతి
ప్రభావా ||పరిశుద్ధ||

2 పరిశుద్ధ తనయుడ - నర రూప ధారుడ = నరులను రక్షించు -
కరుణా సముద్రా ||పరిశుద్ధ||

---

1 గొప్ప 2 భటులను 3 స్థిరము లేనట్టి 4 గంభీరముగ 5 సాటిలేని

3 పరిశుద్ధ మగు నాత్మ-కరము లేదు నాత్మ=పరమానంద ప్రేమ-భక్తుల కిడుమా ||పరిశుద్ధ||

4 జనక కుమా రాత్మ-లను నేక దేవా=ఘన మహిమ చెల్లును దనర నిత్యముగా ||పరిశుద్ధ||

---

## 80 *Father of heaven! Whose love profound.*

చాయ: సిరులెల్ల వృథగాక.

రా—అసావేరి. తా—జంపె.

పరమండలపు తండ్రి-కరుణా సాగర[1] నిత్య-మరణంబు నుండి యా-త్మల బ్రోచితి=దురితాత్ములము గద్దె-దరి జేరి మ్రొక్క-మా-మరితంబు లణగింప-పరపు నీ ప్రేమ ||పరమండలపు||

1 సర్వలోకస్థుడ! సుతుడ! -సత్యావతారమా! -సర్వజనయాజక!-సద్వాక్యమా!=సర్వ రక్షణ కృప-పతితాత్ములము మాపై-నిర్వాణ[2] మొసగుము-నిన్ను జేరితిమి ||పరమండలపు||

2 పరిశుద్ధాత్ముడ! నీ యూ-పిరిచేత మా యాత్మ-మరణ బంధకముల మరి ద్రోచి లేచున్=పరమ జీవ బలంబు-పాపాత్ములకు మాకు-నిరతంబు నొసగుము-నిత్యాత్మ! దేవ! ||పరమండలపు||

3 జనక! కొమరుడ! యాత్మ!-ఘన యెహోవ! ప్రత్యేక! అనిశంబు[3] సింహాస-నాసీనుడ!=మనుజాధముల[4] మొర-విని పాప క్షమ జీవ-మును కృపయును నిమ్మ-నిను నమ్మితిమయ ||పరమండలపు-

---

1 సముద్ర 2 ముక్తి 3 ఎల్లప్పుడు 4 హీనపు నరులు

# దేవుని వాక్యము

## 81 *Blessed are the people that know the Joyful sound.*

సువార్తను విని తెలిసికొనువారు ధన్యులు.

రా—తోడి. తా—ఆది.

వారు భాగ్యవంతు లౌదురు - భూలోకమందు - వారు భాగ్య
వంతు లౌదురు = చారు[1] శుభవార్తా రవంబు[2] - గోరి యాకర్ణించి[3] భక్తి -
మీర దెలిసికొనిన యట్టి - ధీరు[4] లెవ్వ రెవ్వరో ॥వారు॥

1 వారు నడచు మార్గమందున - సుక్షేమ రాశి[5] - వారి ననుసరించు
చుండును = దేరి చూడరాని దే - దీప్యమాన[6] దివ్య సత్య - భూరి తేజ
మా జనముల - బొలుపు[7] మీర జుట్టుకొనుచు ॥వారు॥

2 విమోచకుని నామ మందున - సజ్జనంబుల - విశ్రుతానందంబు[8]
ప్రాణముల = నమందముగ[9] హెచ్చరించు - నతని నీతి రీతి జ - నముల గోర్కె
వృద్ధి బొం - దంగ జేయు సంతతంబు[10] ॥వారు॥

3 నరులపై బిశాచమును - నించా స్వాప - నంబు జేయంగ లేదు =
పరగు[11] సుప్రకాశమును - బ్రాపునైన సర్వే - శ్వరుడు బలము రక్షయు
న - వారితముగ[12] మనకు నిచ్చు ॥వారు॥

4 పర గుణ ప్రశస్తులారా - యోక్రైస్తవులారా - వన్నె మీర మీ
రాజు = సుచిరముగ[13] శాశ్వతము - బరిపాలించు మీ దేవుం డ - విరతము
గను[14] జీవింతు - నీతి భరిత చిత్తు[15] డగుచు ॥వారు॥

---

1 సొగసైన 2 ధ్వని 3 విని 4 బుద్ధిమంతులు 5 యోగ్యమైన సుఖరాశి 6 చక్కగా ప్రకాశించునది 7 సొగసు 8 మిక్కిలి ప్రసిద్ధికెక్కిన సంతోషము 9 చురుకుగ 10 ఎల్లప్పుడు 11 వ్యాపించు 12 అడ్డు లేకుండ 13 చక్కగ 14 పడతెగకుండ 15 నీతితో నిండిన మనస్సు గలవాడు

## 82 *Spread, O spread, Thy Mighty Word.*

ఛాయ: యేసు నీ నామా మృతము.

రా—యదుకుల కాంభోజి. తా—ఆది.

శక్తిగల యో వాక్యమా యా - సక్తిన్ వెళ్లవే = యతి - భక్తి గల వారెల్ల ప్రభు కడ - రక్త¹ హస్తులుగ వచ్చి - ముక్తిని బడయుదు రని ||శక్తిగల||

1 చిత్తమున జగత్తు నెల్లను - సృష్టి చేసిన = యా - యుత్త ముండగు తండ్రి ప్రేమను - నుద్ధరింప నీ నరుల - పుత్రుని పంపెనని ||శక్తిగల||

2 పావ నాత్ముని గూర్చి ప్రజలకు - ప్రకటపరచుమా = తన - ఠీవిచే² మనల నావరించుచు - భావముల మార్చి నూత్న - భావము నొసంగు నట్టి ||శక్తిగల||

3 ప్రాణమగు నో వాక్యమా నీ - పగిది³ జూపవే = మహా - వాణి⁴ నీ వెలు గెల్ల వారికి - వారిధిగ⁵ నిచ్చి వెర్రి - చీకటిని పారద్రోలు ||శక్తిగల||

4 పంట నాయక పట్టుదల నీ - పనిని జేయుటకై = బలు - బంటు లను రప్పించి లోకము - మింటి రాజు భక్తితోను - వెంట జను రీతి జూప ||శక్తిగల||

---

## 83 *The Gospel, the gift of God.*

శుభ వర్తమానము దేవ దత్తము.

రా—శంకరాభరణము. తా—అట.

దేవు డిచ్చిన దివ్య శాస్త్ర మిదేను - సున కో యన్నలారా = భావ శుద్ధుని జేయు ఘన శుభ - వర్తమానము దీని పేరు ||దేవు డిచ్చిన||

1 వట్టి 2 వైభవముచే 3 మార్గము 4 పలుకు 5 సముద్రమంత

1 భయముతో భక్తితో జదివిన = బ్రోపు క్రీస్తుడటంచు దెల్పును = దయా మయుడగు దేవుడే మన - తండ్రి యని బోధించు నెల్లెడ ||దేవు డిచ్చిన||

2 పాపముల మన్నింపు నొసగున్ - బరిశుద్ధియె మదికి నిచ్చును = శాపంబు దొలగ చేయు - సంతోషము జూపు నాత్మకు ||దేవు డిచ్చిన||

3 సత్య శాంతము లంకురించును[1] - సత్క్రియా ఫలములును బొడ మును[2] = నిత్య జీవము గలుగు దానన్ - నిస్సందేహముగా నుండును ||దేవు డిచ్చిన||

4 ఈ సుమంగళ దివ్య శాస్త్రము - నిప్పుడే మీ రనుసరింపుడు = దోసంబులు వాసి మోక్షపు - త్రోవ గోరిన వారెల్లను ||దేవు డిచ్చిన||

5 పాపములలో నుండి విడువల - బరమ సుఖమని దలతు రేనియు = దాప మార్పును లేచి రండీ - త్వరగ క్రీస్తుని శరణు బొందను ||దేవు డిచ్చిన||

6 దురిత ఋణములు దీర్చు మధ్య - స్థుండు గావలె నన్న వారలు = త్వరగ రండీ త్వరగ రండీ - వరమఙౌ[3] క్రీస్తు కడ కిపుడె ||దేవు డిచ్చిన||

7 సాధు పౌరోహిత్య సహితుఁ[4] - సద్గురుఁ వెదకెదర మేని యు = మోద మొప్పగ రండి రండి - మోక్షపతి యగు క్రీస్తు నొద్దకు ||దేవు డిచ్చిన||

8 నిర్మలాంతఃకరణ[5] సౌఖ్యము - నిజముగా నిల వెదకు వారలు = ధర్మ చిత్తుండైన క్రీస్తుని - దరికి రండి రండి వేగము ||దేవు డిచ్చిన||

9 మరణమునకై భయము నొందెడి - మానసము గల వారెల్లను = బరమ శాంతి యొసంగు క్రీస్తుని - పజ్జ[6] డాయగ రండి వేగము ||దేవు డిచ్చిన||

---

1 పుట్టును 2 కలుగును 3 వరము నిచ్చు వాడగు 4 మొదటనే హితము చెప్పుటతో గూడు కొనినవాడు 5 మనస్సునందు 6 సమీపము

10 మోక్ష రాజ్యము జేర గోరెడు- బుద్ధి గలిగిన వారలెల్లను = రక్ష కుండగు యేసు నొద్దకు - రండి రండి విశ్వసించుచు ॥దేవు డిచ్చిన॥

---

## 84 *Thy Word, O Lord, like gentle dew.*

ఛాయ: విడము చేయవే.

రా—ఖరహరప్రియ. తా—ఆది.

ప్రభువా పంపుమా నీ - శుభవర్షము నిమ్మా = ప్రబలంబుగ నీ వాక్యం బనెడి - విభ వామృతము[1] కురియజేసి ॥ప్రభువా॥

1 వాడి యున్నట్టి యీ - మోడు వృక్షములే = వడిగా జిగురు పెట్టి పూచి - గాఢంబుగను ఫలము లియ్య ॥ప్రభువా॥

2 నీ వాక్యానలమున్[2] శ్రీ - దేవా పంపుము = భావాఘములు[3] మాడ్చి మనముల్ - పావనంబు బొందునటుల ॥ప్రభువా॥

3 ధర జీకటి కిదియే వే గురు - చుక్క ప్రభువా = సరళంబుగ యాత్రికులు నడిచి - పరమ పదంబును బొందగ జేయుచు ॥ప్రభువా॥

---

## 85 *The Beatitudes.*

క్రీస్తువలన బోధితులు భాగ్యవంతులు.

రా—యదుకుల కాంభోజి. తా—ఆది.

ఎవరు భాగ్యవంతు లౌను - రవని[4] లోపల = మోక్ష - వివరమైన క్రీస్తు బోధ - చెవు లొగ్గి వినువారికన్న ॥నెవరు॥

1 కవులు లాభ మరసి[5] చేయు - కపట మంత్రముల్ = విధులు - దవుల[6] బోవ దరిమి యేసు - తత్వము[7] గొనువారికన్న ॥నెవరు॥

2 దీనమానసుల కిట్టి యుప - దేశ మిచ్చెను = దివ్య - మైన మోక్ష రాజ్యము వారి - దౌ నటంచు ప్రభువు చెప్పె ॥నెవరు॥

---

1 కుంభవర్షము 2 వాక్యమనే అగ్ని 3 మనస్సులోని పాపములను 4 భూమి 5 విచారించి 6 దూరముగ 7 నిజ స్థితి.

3 వృజినములకై[1] దుఃఖించెడి - సుజను లెవ్వరో = వారు - నిజముగ నోదార్పు బొందె - నిత్య సంతోషితు లని తెల్పె ||నెవరు||

4 శాంతి నీతి కరుణల యందా - సక్తిగల వారు = భూ స్వ- తంత్రులై పరి తృప్తినొంది - దయ బడసెదరని[2] ప్రభువు తెల్పె ||నెవరు||[3]

5 పరిశుద్ధ హృదయులు పరా - త్పరుని జూతురు = సర్వ - నరుల సమాధాన పరుచు - నరులె పరమ జనకుని సుతులు ||ఎవరు||

6 నీతి కొరకాపద నొందెడి - నిశ్చలాత్ములు = వారు - ఖ్యాతిగ పరలోక రాజ్య - ఘన సౌఖ్యము లెల్లను బడయుదురు ||ఎవరు||

---

## 86 *The Bible.*

దేవుని వాక్యము

స్వదాయ.

శ్రీ వినోద దాయకంబు - దేవుని వాక్యంబు -
జీవమునకు నాస్పదంబు[4] - చిరమగు ధనంబు =
భావంబుల మార్చు నంబు[5] - బహుళ సాధనంబు ||శ్రీ వినోద||

1. పాప తతికి[6] నాయుధంబు - పాపి కాశ్రయంబు -
భూ పతులకు దుస్తరంబు[7] - పుణ్య సాధనంబు =
శాప మడంచెడు శరంబు[8] - జగతికి విభవంబు[9] ||శ్రీ వినోద||

2. స్వాతంత్ర్య మిడు ధనంబు - సర్వ శ్రేయంబు -
ఘాతకులకు ఖడ్గంబు - నీతికి నిలయంబు =
ప్రీతిని గరపెడు విధంబు - ఖ్యాతికి పథంబు[10] ||శ్రీ వినోద||

3. సత్య విరాజితంబు[11] - నిత్య శోభితంబు[12] -
భృత్య వరుల సంచికరము[13] - భీతున కభయంబు[14] =
చేతో విభవంబు[15] సుగుణ - శిష్యుల హారంబు ||శ్రీవినోద||

---

1 పాపములకై 2 పొందెదరు 3 ప్రసిద్ధిగా 4 మూలము 5 బాణము 6 గుంపు 7 దొరకినది 8 బాణము 9 కాంతి 10 త్రోవ 11 సత్యముతో వెలుగునది 12 ఎల్లప్పుడు వెలుగునది 13 మంచి సేవకుల క్రయధనము 14 శరణ 15 మనస్సునకు అలంకారము

4. కర్త జూపు నద్దంబు – కర మహాత్మ్యతంబు –
దురిత తతికి నస్త్రంబు – దుఃఖశోషణంబు[1] =
బరమోపదేశంబు – బహుళ మానితంబు ||శ్రీ వినోద||

5. సర్వజనులకును హితంబు – సౌఖ్య సాధనంబు –
శాంతికి నిజమార్గంబు – జగడముల హారంబు =
జగము నంతకును వరంబు – సత్య విజయంబు ||శ్రీ వినోద||

6. కోలాహల కారణంబు – చాల ప్రాచీనంబు –
మూలమౌ ధనంబు జగము – నేలెడి తంత్రంబు =
జాలి యెదన సూత్రంబు – మేలు భూషణంబు ||శ్రీ వినోద||

7. జ్ఞానికి దుర్గ్రాహ్యంబు[2] – దాని బోధనంబు –
దీన జనుల కర్థంబు – దివ్య శోభితంబు =
మానిత భక్తిని దినంబు – మానని పఠనంబు[3] ||శ్రీ వినోద||

---

## బాప్తిస్మము, నిర్ధారణ.

## 87 *Baptism of Children.*

శిశువుల బాప్తిస్మము.

రా__నాదనామక్రియ. తా__అట.

దేవా శిశువులను దెచ్చితిమి – నీవు – దీవింపు వీరల – దివ్యకృప మీర ||దేవా||

1 వీరు పొందిన బాప్తిస్మంబు – గురుతు – వీరు నీ వారన – విశద పరపంగా – వీరిపై గురిపింపు దయను – వేగ – వీరికి గలుగంగ – విజ్ఞాన ధనము ||దేవా||

---

1 దుఃఖమును పోగొట్టునది 2 బోధపడనిది 3 చదువుట

2 నీ వొసగు శిశువుల మాకు - దేవ - నీవు చేర్చుకొనుము - నిన్ను కాపాడు - నీవు మార్గము నందు నిలుపు - నిత్య - జీవము దయచేసి - శ్రీ యేసు కతనన్[1] ॥దేవా॥

3 విమలాత్మ బాప్తిస్మ మొసగి - వీరి-విమలుల జేయుము - ప్రతి దేవా - క్షమ భక్తి ప్రేమ శాంతుల - నొసగు - ప్రేమముల వెలుగంగ - సత్య సాక్షులుగా ॥దేవా॥

4 వీరలకు కోర్కై యొసంగుము - తండ్రీ - వీరల జూడుము - వివిధ మార్గముల - వీరు లోకము విడువ నప్పుడు - దయను - వీరల జేర్చుము - విమలానందమున ॥దేవా॥

---

## 88

చిన్న పెద్దల బాప్తిస్మము.

రా___తోడి. తా___ఆది.

యేసొసంగె గొప్ప యాజ్ఞను - దన శిష్యులకును - యేసొసంగె గొప్ప యాజ్ఞను = దాసులనుగ జేయ బోయి - ధరణిమీది రాష్ట్రములకు - నాసను బాప్తిస్మ మిచ్చి - నా సుబోధ నేర్ప దనుచు యేసొసంగె ॥

1 జనక సుతాత్మల పేరిట - బాప్తిస్మ మియ్య - జనులను మీరు సకల దిశలను = దనయులైన - దల్లులైన - దండ్రులైన బొందవచ్చు - దగిన రీతి దాని నిపుడు - తండ్రియైన దేవు కృపను ॥యేసొసంగె॥

2 బాలురెల్ల బొందవచ్చును - బాప్తిస్మ మిపుడు - జాలి జూపి క్రీస్తు సెలవున = బాలురను బ్రేమనుంచి - ప్రభువు పిలుచు వారి నెల్ల - జాల మేలు సేయ గోరి - సకల కాలములయందు ॥యేసొసంగె॥

---

1 కారణము చేత

## 90 *Blessed Saviour, Who hast taught us.*

ఛాయ: పరమ తండ్రి నిన్ను మేము

రా__జంఝూటి. తా__ఏక.

దివ్య రక్షకా యొసంగి - తివిగ యాజ్ఞను = భవ్యముగను[1] నీ విష
యమై - బ్రతుకుచుండను ॥దివ్య॥

1 నీదు వాడనైన నాటి - యాదిగను నను = ఈ దినంబు దనుక
తెచ్చి - తీవు ప్రేమను ॥దివ్య॥

2 స్నానమున గరారులు మ - జ్జనని జనకులు[2] = నా నిమిత్తమై విభు
నకు - బూని సల్పిరి ॥దివ్య॥

3 వాని మీరకుండు నటుల - నేను జేయుచు = న్నాను నీదు బల్ల
యొద్ద - నా నిబంధనల్ ॥దివ్య॥

4 అన్ని సమయములను నీదు - నాదరింపును = జెన్నుగ నీ చేతి
నాను - కొన్న వాడను ॥దివ్య॥

5 ఆపదలను బాప నీవె - కాపరి వెపుడు = నీ పదంబె వీడకుండ -
నేను నడ్తును ॥దివ్య॥

6 నీదు రక్షణంబు నిపుడు - నేను పొందగ = నీదు సంఘ క్రమ
మునందు - నీవు రమ్మయా ॥దివ్య॥

7 నీ నిర్ధారణంబు నేను - నీదు భయముతో = నీ నిజంబు తోడ
బొంద - నే డొసంగుము ॥దివ్య॥

8 స్థిరత బలము నాపదలను - పర నిరీక్షణ = సరగ[3] నొంద నిమ్ము
సంత-సంబు వంతలన్ ॥దివ్య॥

9 సత్యమైన యట్టి యీ వి - శ్వాసమందు నే = నిత్యమేను బాగు
గాను - నిలువ జేయుమీ ॥దివ్య॥

10 నా విమోచకుని పుణ్యంబె - నాకు దిక్కగు = పావనాత్మ
బలమె నాకు - బలకరంబగు ॥దివ్య॥

---

1 శుభముగను 2 మా తల్లిదండ్రులు 3 త్వరగా

11 తుదను నీదు భక్తజనుల - తోడ నేనును = జదల[1] తండ్రి ముఖ
మును నొం - దుదును రూఢిగా ||దివ్య||

---

## ప్రభు రాత్రి భోజన సంస్కారము.

### 91 *Deck thyself, my soul, with gladness.*

ఛాయ: ఓ మా తండ్రి నీదు నామము.

రా—ఆనందభైరవి. తా—ఆది.

మనసా! యాత్మ! తేజరిల్లుము - అలంకరించు - కొనుము పాప
మంత వీడుము = వినుము నేడు యేసు నీకు - ఘనముగాను విందు జేసి -
నిను దలంచి జేర వచ్చె - ఘనుని వెల్గులోని కేగుము ||మనసా||

1 హృదయ మనెడు తలుపు దట్టుచు - ప్రభు యేసు నిలిచి -
సదయు డిదిగో నిన్ను బిలుచుచు = నెదురు చూచుచుండు విభుని - పద
యుగముల[2] కెరగి[3] మ్రొక్కి - ముదముతోడ జేర్చుకొనుము - సదమల
మగు ప్రేమ జూపి ||మనసా||

2 ధరను సర్వ శ్రేష్ఠ భాగ్యములెల్ల - వరములును ధనము - నరులు
బొందుచుందు రుచితము = పరమ రక్షకుం డొసంగు - వర శరీర రక్తము
లకు - ధరణి రత్న రాసులైన - జాలునా మరేవియైన ||మనసా||

3 ఎందు గానరాని ప్రేమను - జూపించి నీకై - పొందుగా దన
ప్రాణ మిచ్చెను = చిందిన రక్తమును యాగ - మందినట్టి శరీరంబు - నంద
ముగను రాత్రి భోజ - నంబు నందు సిద్ధపరచె ||మనసా||

4 యేసు తనదు బల్లమీదను - సుజీవ మిచ్చు - నెల్ల నష్టములు నశిం
చును = భాసురముగ[4] మోక్షమున ని - వాసివై శ్రీ యేసు తోడ - నీ
సుభోజనంబు దినుట - కా సదుపాయముల నొసగు ||మనసా||

---

1 ఆకాశమందున్న 2 రెండు పాదములకు 3 నమస్కరించి 4 ప్రకాశమానముగ

## 92 *Invoking blessing at Communion.*

ప్రభు భోజన సంస్కార మాచరించు నపుడు దీవెన గోరుట.

రా— హుసేని. తా— చాపు.

దేవా దీవించు మిప్పుడు - దీన జనాళిన్ - గావ రా రమ్ము ఇప్పుడు = నీ దర గద్దె చుట్టు - నిజ దాసాళిటుల గూడి - పావన సంస్కారమును - పంచి పాలొందుచుండ ||దేవా||

1 మము గావ నైను గాయముల్ - బొందిన దేవా - సముదా నీ రక్త కాయముల్ = విపులంపు భక్తి ద్వారా - వీక్షించి[1] మనసులందు - నమిత సుఖ మొందుటచే - నలిగిన భక్త జనులన్ ||దేవా||

2 నీ రాజ్యమునకు మము జేర్చన్ - నిజము మా పాప - ఘోర శాపమ్ములన్ దీర్చ = నోరిమిచే మా కొరకు - దారుణముగ నొందిన - క్రూర మరణమును దలచి - కుములుచున్న[2] హృదయులను ||దేవా||

3 కోరి నిను గొలుచు భక్తుల - కోరిక లభివృద్ధి - గా రాజిలజేయు శక్తుల = ధారాళముగ నొసంగు - ధన్యాత్మ నీ దివ్యా - కార మందుండి యీ సం - స్కార సమయమున మమ్ము ||దేవా||

4 మా దారిద్ర్యములు బాపనే - మా పాపభార - మ్రానను నీ దివ్య మూపున నే = గాదిలిచే[3] భరియించి - గడి దొంగ లిరువురలో - బాధ లొందితి రనుచు - బహుగా దుఃఖించు మమ్ము ||దేవా||

5 నీ వీ విధంపు మరణముచేన్ - నిజముగా మమ్ము - జీవింపజేసి నిల్పుటచే = పావనదేవ మే మీ - ప్రభు సంస్కారమ్ము మా మా - జీవాత్మ లాదరణకై - జే మనముగ గైకొనను ||దేవా||

---

1 చూచి 2 లోలోపల మండుచున్న 3 ప్రేమచే

# సంఘము

## సంఘమును గూర్చిన సాధారణ విషయములు.

## 93 God is our Refuge and Strength.

46 వ దావీదు కీర్తన.

దేవుడే నా కాశ్రయంబు - దివ్యమైన దుర్గము[1]ను - హా విరోధము డాపదల స - హాయుడై నన్ బ్రోచును। అభయ - మభయ - మభయ మెప్డు - నానంద - మానంద -మానంద మౌగ ॥దేవుడే॥

1 పర్వతములు కదలిన - నీ - యుర్వి[2] మారుపడినను = సర్వమున్ ఘోషింపుము - నీ - సంద్ర ముప్పొంగినన్ । అభయ - మభయ- మభయ మెప్డు - నానంద - మానంద - మానంద మౌగ ॥దేవుడే॥

2 దేవు డెప్డు తోడుగాగ - దేశము స్థిరిల్లును = ఆ - తావు నందు ప్రజలు మిగుల- ధన్యులై వసింతురు । అభయ - మభయ - మభయ మెప్డు- నానంద - మానంద - మానంద మౌగ ॥దేవుడే॥

3 రాజ్యముల్ కంపించిన - భూ - రాష్ట్రముల్ ఘోషించిన = పూజ్యుడౌ యెహోవ వైరి[3] - బూని సంహరించును । అభయ - మభయ - మభయ మెప్డు - నానంద - మానంద - మానంద మౌగ ॥దేవుడే॥

4 విల్లు విరుచు నాయనే - తెగ - బల్లెము నరకు నాయనే = చెల్ల చెదర జేసి రిపుల[4] -నెల్ల ద్రుంచు నాయనే। అభయ - మభయ - మభయ మెప్డు - నానంద - మానంద - మానంద మౌగ ॥దేవుడే॥

5 పిశాచి పూర్ణబలము నాతో - పెనుగులాడ జడియను = నశించి శత్రు గణము[5] దేవు - నాజ్ఞ వలన మడియును । అభయ-మభయ - మభయ మెప్డు - నానంద - మానంద - మానంద మౌగ ॥దేవుడే॥

---

1 కోట 2 ఈ భూమి 3 శత్రువును 4 శత్రువుల 5 సమూహము

6 కోటయు నాశ్రయమునై యా - కోబు దేవు డుండగ = ఏటి[1] కింకఁ వెరువ వలయు - నెప్డు - నాకు పండుగ । అభయ - మభయ - మభయ మెప్డు - నానంద - మానంద - మానంద మౌఁగ ॥దేవుఁడే॥

---

## 94 *Fear not, O little flock, the foe.*

చిన్న మందా భయపడకుము.

ఛాయ: ప్రభు సేవ కిదియే సమయంబు.

రా—సౌరాష్ట్రి, తా—అట

భయ మొంద కో చిన్నమందా - నీవు - భజియించు క్రీస్తే నీ - ప్రాపైన యండ ॥భయ॥

1 నిను గెల్వ వెదకు శత్రువుని - శక్తి - యును నుగ్రతయు[2] వీక[3] - గని భీతి గొనకు = నిను నొక్క - వేళ మూర్ఛిల్ల - జేసి - నను వాని గెలుపు క్ష-ణము మాత్ర ముండున్ ॥భయ॥

2 నీ పోరాటపు కారణంబు - దేవు - నిదె గాన కరుణతో - నీ కై ఖడ్గము తా = నే పూని సలుపు యుద్ధంబు - తుదకు - నీ పాలౌ జయ మెన్న - డును నుల్లసిల్లన్ ॥భయ॥

3 భూమి నరకము శత్రు బలము - లన్ని - నీ మీద జయ మొంద - నేరవు నిజము = స్వామి నీ యందు వసించు - నీ కి - కేమి కొదువ నిత్య - క్షేమము గలుగు ॥భయ॥

4 ప్రభు యేసు సభ నాయకుండు - మనకై - ప్రఖ్యాతముగ బోరి - ప్రణుతుండౌ[4] గాక = విభు శుద్ధులును హతసాక్షులును - భూ - నభములు[5] యుగయుగా - లభినందింతురుగ ॥భయ॥

---

1 దేనికి 2 కోపమును 3 ధైర్యముతో 4 స్తుతింప బడువాడు 5 భూమ్యాకాశములు

## 95 The Church of Christ a ship

క్రీస్తు సంఘమను ఓడ.

రా — అసావేరి. తా — మిశ్రచాపు

దారుణ మగు మరణ - వారిధి[1] దాట నె - వ్వారి శక్యము సోదర=
ఘోర మగు కెరటముల వలె వి - స్తారముగ నేరములు పైగొని - పారు
చుండు నప్పు డద్దరి - జేర బెట్టు దారి గనరే ||దారుణ||

1 ఒక్క పెట్టున నెగసి - చక్క వెల్లువ మన ని - నైక్క లక్కరకు
రావు = ఎక్కడైనను నోడ గనుగొని - యెక్కి పోవుదమని తలంచిన -
చెక్క నిర్మితమైన యోడలు - అక్కరకు రావేమి చేతుము ||దారుణ||

2 మంగళ ధ్వనులతో - శృంగారపురము వె - లుంగుచున్నది
ముందట = పొంగి పారుచు మరణ నది త - రంగములు[2] జెలంగుచున్నది -
భంగపడకుడి మనకు క్రైస్తవ - సంఘమను పెను నావ[3] ఇదిగో ||దారుణ||

3 వాద రహితుడైన - యాది దేవుడు దాని - నాథుండనం బర
గును = బాధ లొందిన నరుల నందరి - జేరదీసిన క్రీస్తు యేసు - నాథుడే
నావికుడు క్రైస్తవ - వేదమే చుక్కాని[4] దీనికి ||దారుణ||

4 మానవు లందరు - మరణాంబుధిని[5] దాట - మహనీయ నావ
యిదియె = దీనిలో నెక్కుటకు ముందే - మానుగ వాక్యమును విని సు - జ్ఞాన
మొందినవారు క్రైస్తవ - స్నాన మను పత్రికను బొందరె ||దారుణ||

5 విదితంబుగా[6] నిందు - విజ్ఞాన బోధకుల్ - వినిపించెదరు వాక్య
ము = గొదగొనిన[7] యాత్మములు తృప్తి - గొనును ప్రభు భోజనములో నె-
హృదయములలో దేవు నాత్మ - యెప్పుడు దీపంబై వెలుంగును ||దారుణ||

6 పలువిధ సంగీత - ములతో సాగుచు మనము - అలయ కుండగ
బోదము = బలముగల యీ యలలు దాటి - పరమపుర ద్వారముల వెలుపల-
గలిసికొని పరిశుద్ధ జనమును - కడకు మోక్షము చేరుకొందుము ||దారుణ||

---

1 సముద్రము 2 అలలు 3 గొప్ప పడవ 4 మార్గము చూపునది 5 మరణ సముద్రమును
6 స్పష్టముగ 7 ఆకలి గొనిన

7 కరుణామయుని సభలో - జొరక పోయిన నిత్య - నరక మంతె మంమన = మరియు నంత్యదినపు బాధలు - విరివిగ విన గోరు వారలు - మరణ మొందక మును ప్రత్యక్ష - కరణ మను గ్రంథమును వినరె ॥దారుణ॥

---

## 95—A.

బిడ్డుబాటు శారణ.

రా___శుద్ధసావేరి. తా___జంపె.

జనులారా దేవుడే - జగ మంతటికి ప్రభువు - నిజము తా నయ్యుం డెను - మనకు నాశీర్వాద మర్యాదలను నిచ్చి - తన సంఘమందు నే - మొనసి వాసము చేసె ॥జనులారా॥

1 సీయోనులో ముందు - నిరు డగుచు నెఱుగబడె - ఆ యెహోవను ఘెంచ నలివికాకు - న్యాయ నులకు నుండు నిండు యాపద లెల్ల - బాయ జేయుచు నున్న - ప్రభువు గనుడీ ॥జనులారా॥

2 బుద్ధి నేరక ముందు - భూపతుల వర్గంబు - గద్దించి పల్కుచును గన లేకను - అద్దిరా దేవుండే యాధారభూతుండని - దిద్దుకొని తమ తప్పు - తెలిసికొనిరి ॥జనులారా॥

3 సుతులార దేవుండు - స్వంత మందను నెపుడు - మితిమీర దయచేత మెప్పు వడసి - యతులితంబుగ బ్రోచె - ననుచు మన కందరకు - పితలు చెప్పిన మాట - సతతంబు నమ్మడి ॥జనులారా॥

4 ఆపదలు రాగానె - యందఱము పలుగిడుచు - ఆ పరేశుని యింటి కనవరతము - తేప తేపకు బోయి తీర్చవే ముప్పన్న - కాపురు షుల నయిన - కాపాడు నెహోవా ॥జనులారా॥

---

## బోధకులు.

### 96 *Awake Thou, Spirit, Who didst.*

ఛాయ: పరిశుద్ధాత్మను గోరుము, జీవము యేసు.

రా—కళ్యాణి. తా—ఆది.

పరిశుద్ధాత్ముడ, లెమ్ము నీ-సంఘముపై నీ-వర దీవనల నుంచుమీ= చిరత కాలపు సభ కా - పరు లొంది నీ యగ్ని - యరుల నెదిరించి చాటిరి నీదు సత్యంబు ||పరి||

1 బలుడా, యీ కాలంబునఁ - దివారాత్ర - ములు నీదు సేవ కులుఁ = నలుదిక్కులను దిరిగి - విలసిల్లు నీ వార్త -పలు జనాంగములకు- బ్రకటింపుచుందురు ||పరి||

2 ప్రతిదేశమం దిప్పుడు - ఉజ్జీవము-పడసెరి నీ బిడ్డలు = అతులుండు[1] నీ పుత్రు-డాజ్ఞాపించిన యట్లే - యతి తీవ్రతను[2] వేడ - నధిపా మా కొసగుము ||వరి||

3 పరిశుద్ధాత్మ బలంబును - వాక్యపు ధృతిని[3]-బడసిన బోధకులను = ఇరుల[4] శక్తిని ద్రోసి - నరులను నీ తట్టు - మరల జేసెడువారి - ద్వరలో బంపుము దేవ ||పరి||

4. నీ యాత్మ కాంతితోడ - పూర్వము వలెనే - డాయంగ[5] మము జేయుమా = ఏ యడ్డున్నను బాపి - యెలమి నింగిని జీల్చి - దాయుము మము స్వేచ్ఛ - దయచేసి నీ యొద్ద ||పరి||

5 జను లెల్ల నీ వాక్యపు - శక్తి నెరింగి-ఘనపరుప ద్వరచేయుము= పెను సంఘములు లోక - మున నాటి యిశ్రాయేల్ - జనపు నిద్రను బాపు-జయ మొందు నీ వాక్కు ||పరి||

---

1 సాటిలేని 2 ఎక్కువ ఆశతో 3 సారము 4 చీకటి 5 సమీపించునటులు

6 ఇల సంఘమున నెడారులే[1] – కప్పుము దేవ – తొలగింపు మహాటంకములే = అల నీ వాక్యమునకు – నడ్డంబు లేమియు – గలుగకుండగ నిమ్ము – ఘన సంఘాభ్యుత్థానం దే ॥పల్ల॥

7 నీ సంఘమును నబద్ధ – బోధలనుండి – నిర్మలంబుగ గావుమా = గానీ[2] జేసెడు జీత – గాండ్లను బాపి నీ – ఛాపిల్లు నుద్యాన – వనముగ నుంచుమా ॥పల్ల॥

---

## 97 *Prayer for Ministers.*

బోధకుల కొరకైన ప్రార్థన.

రా — శంకరాభరణము. తా — ఆది.

అడుగుచున్నామో దేవ – కడు దయను గావ = చెడుగులమైన మేము ని – న్నడుగుటకు యే బిడియ మొందము = అడుగుడి మీ కిడి యెద నంచు – నాన తిచ్చిన వాగ్దానము గని ॥యడుగు॥

1 వేడుకలర్రగ గూడి నిను గొని – యాడి యడిగెడు నీదు భక్తుల = గోడు గని[3] దయతోడ నెప్పుడు – వీడకను నెరవేర్తువని ని ॥న్నడుగు॥

2 సారె సారెకు నిన్ను విడిచి – ఘోర దురితపు భారమందు = జేరి నిను మరచితిమి గద మా – క్రూరతన మెడ బాపుమని ని ॥న్నడుగు॥

3 దుష్టుడు మాతోడ బోరగ – శ్రేష్ఠమగు మా నిష్ఠ[4] తోడుత = కష్ట మనక వాని గెల్వ – బుష్టిని బుట్టించు మని ని ॥న్నడుగు॥

4 తోరమగు[5] విశ్వాస నిరీక్షణ – కూరిమి విమలాత్మ వరములు = వారకను హృదయాంతరంబుల – జేర్చి మము వెలిగించుమని ని ॥న్నడుగు॥

5 మోద మొప్పగ నీదు వాక్యము – మేదినిపై బోధపరచెడు = బోధకులపై శోధనంబులు – పొర్లి రాకుం డాదరింప ॥నడుగు॥

6 దురితములచే భరితు లయ్యెడు – నరులపై నీ కరుణ జూపి = గురుతరంబగు[6] మారు పుట్టుక – వరము గుమ్మరించు మని ని॥న్నడుగు॥

---

1 జీవము లేని చోట్లు 2 నాశము 3 దుఃఖమును చూచి 4 స్థిరత 5 గొప్ప 6 మిక్కిలి గొప్ప

రోగములచే నేగి[1] నొంచుచు – జాగు సేయక నిన్ను దలచుచు = బాగు గోరుచు నున్న భక్తుల – రోగములు వెడలించుమని ని॥న్నడుగు॥

8 ధరణిపైన మరణ మయ్యెడు – తరుణమందో కరుణ కలితా[2] = పరమ పురమునందు జేరి – వర సుఖంబు లనుభవింప ॥నడుగు॥

---

## 98 *Universality of Sin.*

పాపము యొక్క సర్వ సాధారణత్వము.

రా—కేదారగౌళ. తా—త్రిపుట.

నిజముగా బుణ్యాత్ముఁ డొకఁడీ – నేలపై లేడు = వృజినములచే జెడిన మదిని బ – విత్ర మూలం బెటుల బొడమును[4] ॥నిజముగా॥

1 దురిత లతలకు[5] మూల కందము[6] – దుస్స్వభావము దాని గూడిన – నరులలో పరిశుద్ధ విధు లెన్నటికి గనరావు = నెరవుగా[7] సద్ధర్మముల నే – తెరగునను[8] గావింప నేరరు[9] – ధరణి లోపల ముసిడి చెట్టున – చెరుకు రస ముండని విధంబుగ ॥నిజముగా॥

2 మనసు క్రియ లన్నిటికి మూలం – బనుచు శాస్త్రము బల్కు – మరియా – మనసు శుచి గాకున్న నగునే – తనకు ఫలసిద్ధి = యనిశ[10] మా హృదయము మరిచ్ఛల – నలరి[11] మిథ్యా[12] సక్తి నుండఁగ – ఘనతగల సత్కా – ర్యముల నిల – మనుజు డెట్లొనరింప జాలును ॥నిజముగా॥

నిరతమును పాపాగ్ని చేతను – గరుగుచున్న మనంబు లోపల – పరమ ధర్మము భక్తి యెటువలె – బాదుకొని యుండున్ = నిరపరాధి యొకండు లేడని – నిక్కముగ గనవచ్చుచున్నది – పరమ దేవుడు క్రీస్తు కృతమున[13] – బంధు పుణ్యము వడయ కుండిన ॥నిజముగా॥

---

1 బాధ 2 కృపగల వాడా! 3 పాపములచే 4 పుట్టును 5 తీగలకు 6 మూలమైన దుంప 7 చక్కగా 8 విధముగా 9 చేయలేరు 10 ఎల్లప్పుడు 11 సంతోషించి 12 మాయ 13 క్రీస్తు కార్యము వల్ల

# 99 Gospel Doctrine.

యేసు నాధ కథా సుధారసము.

రా—బిళహరి. తా—త్రిపుట.

యేసు నాధ కథా సుధా - రస[1] మిదిగో పానము జేయరే = దోస
కారి జనంబులారా - దురిత భవముల బాయరే ||యేసు నాధ||

1 ఇహపరంబు లెవనిచే సృజి - యింపబడియెను జూడరే = అహహ
యా విభు డవతరించెను - అతని గుణములు బాడరే ||యేసు నాధ||

2 దురిత భరితుల[2] దుష్ట చరితుల - నరయ[3] వచ్చెను జూడరే = స్థిరముగా
మది నమ్మి యా ప్రభు - కరుణ మది గొనియాడరే ||యేసు నాధ||

3 పనికిమాలిన వేలుపుల వెస - పరుగు లెత్తుట మానరే = తనువు మీ
కొరకిచ్చు క్రీస్తుని - దయకు పాత్రత బూనరే ||యేసు నాధ||

4 మరణ బలి రక్తమున మనయం - దరిని బ్రోవను[4] వచ్చెను = గరు
ణతో పాపుల బిలుచు గురు - దరికి బోవుద మిచ్చను[5] ||యేసు నాధ||

5 పరమ తత్వ నిధాన[6] బోధలు - బాగుగ ప్రకటించెను = చిర
సుఖాస్పద పదము[7] గోరిన - జీవులకు వినిపించెను ||యేసు నాధ||

6 మరణ మొందిన కొందరికి దా - మరల ప్రాణము లిచ్చెను =
వర[8] మహాద్భుత కార్యముల నీ - ధర[9] ననేక మొనర్చెను ||యేసు నాధ||

7 కుటిల బుద్ధుల ద్రోచి సజ్జన - గోష్ఠి[10] నుండుట గోరరే = దిట
ముగను నెమ్మదిని మీ రొం - మటకు క్రీస్తుని జేరరే ||యేసు నాధ||

8 పాపములను దలంచి పశ్చా - త్తాప మెదలో బొందరే = ప్రాప్త
క్రీస్తు డటంచు నమ్మి య - పార[11] సౌఖ్యము లందరే ||యేసు నాధ||

9 మధురమగు సువిశేష వాక్యాలు[12] - మనసు లోపల బెట్టరే =
యధమ గుణములు వదలి భక్తి ప్ర - యత్నముల తుద ముట్టరే ||యేసు నాధ

---

1 అమృత సారము 2 పాపముతో నిండి యున్నవారిని 3 వెదకుటకు 4 కాపాడుటకు 5 ఇష్టముతో 6 స్థానమైన 7 నిత్య సుఖ మొందు స్థలము 8 శ్రేష్ఠ 9 భూలోకములో 10 సహవాసము 11 మితిలేని 12 మాటలు

## 100 Come to see Jesus.

క్రీస్తుని చూడ రమ్మనుట.

రా—శంకరాభరణము. తా—ఆది.

రారే మన యేసు స్వామిని - జూతాము కోర్కె - లూర[1] బ్రియు
లారా పేర్మిని[2] = గూరిమి[2] భక్తుల - జేరున విందట[3] - భూరి[4] దయామృత-
సారము లొలికెడి - చారు కటాక్ష వి - శాలేక్షణుడట[5] - నారకులగు నర-
నారీ[6] జనులకు - దారక[7] మొసగను - దానె బిలుచు నట - దారుణ[8] పాప
మ - హారణ్యములకు - గారు చిచ్చు గతి[9] - గన్పడు వాడట - ఘోర దరి
ద్రిత - గూల్చెడి వాడట = సారంబగు తన - సభకు మకుటమట[10] ||రారె||

1 పతిత పావనమా[11] వేల్పట - అనాది దేవ - సుతుడై యిల జేరి
నాడట = సతతము[12] కడు దురి - తతమో యుతమగు[13] - ప్రతి దేశమునకు-
హిత భాస్కరుడట[14] - అతులిత[15] మోక్షో - న్నత గుణ గణుడట[16] - కుత
లంబున[17] స - ద్గతి రహితంబగు[18] - పతితుల గావను - బ్రతికిన వాడట -
అతి పుణ్యతను - క్షతి శోణితమును[19] - వ్రతముగ[20] బలిహిత - మతి
నొనరించెనట - మృతిని జయించుచు - బ్రతికి లేచెనట = మతి నమ్మిన
మన - గతి యితడౌనట ||రారే||

2 తుద లేని మహిమ వాడట - తిను గొల్చు సాధు - హృదయుల సొమ్ము
మూటట = చెదిరిన గొర్రెల - వెదుక వచ్చెనట - చిదురుపలగు[21] జన - హృద
యము లన్నిట - బదిలముగా నె - మ్మది నిడు వాడట - నది తట మఠ[22] జన-
పద[23] వనములస - మ్మొద[24] సువిశేషము - బలికిన వాడట - సదయత నంధుల-

1 వృద్ధి పొందునట్లు 2 ప్రేమ చేత 3 బంధువుడు 4 గొప్ప 5 మిక్కిలి దయతో చూచు పెద్ద కన్నులు గల వాడు 6 నరక సంబంధులగు పురుషులు, స్త్రీలు 7 జీవము 8 గొప్ప 9 భయంకరమైన అగ్నివలె 10 కిరీటము 11 పాపులను పవిత్ర పరచెడు 12 నిత్యము 13 పాపమనెడు చీకటితో గూడు కొనిన 14 అనుకూలమైన సూర్యుడు 15 సాటిలేని 16 మోక్షముకంటె ఎత్తయిన గుణ సమూహము గలవాడు 17 భూమియందు 18 మంచి గతిలేని 19 శరీరముయొక్క గాయపు రక్తము 20 పట్టుదలగా 21 ముక్కలయిన 22 నదీతీరములయందు గుడులలో 23 గ్రామములలో 24 సంతోష

కత్తులు[1] నిడె నట - వెదకి బధిరులకు - వీను[2] లొసగెనట - సదమల[3] సాక్షి - ప్రసుడగు[4] విభుడట = యిదిగో మమ్మిత - డేలిన వాడట ॥రారే॥

---

## 101 *Serve Christ.*

యేసు క్రీస్తును గొలుచుట

రా—ముఖారి తా—ఆది.

యేసు క్రీస్తుని గొల్వ రన్న - యీ జగతిలోను-ఎవ్వరు లేరు వాని కన్న = యేసుని వాక్యము - లెవ్వరి కబ్బునో - దోసము విడి పర-వాసము దొరుకును ॥యేసు క్రీస్తు॥

1 సత్యుడు నిత్యుడాయ నన్న - ఈ సర్వ సృష్టి - చక్కగ సలిపి నిలిపె నన్న = నిత్యాత్మ్యాసము లే-మియు లేకుండగ - సత్యుడు జేసెను - సర్వ జగంబును ॥యేసు క్రీస్తు॥

2 నిరాకారుడు నిశ్చయుడన్న - నరుల రక్షింప- నరావతారుడైనా డన్న = నరుల పాపములు - పరిహరించుట - కొరకై మరియ - కొడుకై పుట్టెను ॥యేసు క్రీస్తు॥

3 పరిశుద్ధ మంతుడాయ నన్న -ప్రభు యేసు నందు - పాపహేతువు గానబడుట సున్న = పరులను గావను - ధరలో దిరిగెను - నరుల మధ్య బహు - నిరపరాధముతో ॥యేసు క్రీస్తు॥

4 భేదా భేదములు గాని బోధ - నాథు డొనరించె - సాధు లెలను సంతోషింప = బాధలు బడు స-ద్రిక్తులకు తోడను - సాదర వాక్యాలు- చక్కగ బలికెను॥యేసు క్రీస్తు॥

5 మహిలోను మనుజు లెవ్వరైన - జేయ లేనట్టి- మహా మాహాత్మ్యములు జేసె నన్న = మహా రోగులను - మరి మృతులను - మహాత్ముడు స్వస్థుల - మరి గావించెను ॥యేసు క్రీస్తు॥

---

1 గుడ్డివారికి కన్నులను 2 చెవిటి వారికి చెవులను 3 పరిశుద్ధమైన 4 ఇచ్ఛాధీనుడు 5 మిగుల దీనులు.

6 వర్ణింప నల్లకాని వాడు - మన కోసర మయ్యో - మరణమై
మరల బ్రతికినాడు = బరలోకమునకు - మరి వేంచేసిన - పరమగు
క్రీస్తుని - పాదము బట్టుము ||యేసు క్రీస్తు||

7 పరిశుద్ధ దూతల నాదముతో[1] - ప్రభు యేసు క్రీస్తు - ప్రకాశ
వస్త్రమహిమలతో = పరమునుండి బహు - త్వరగా వచ్చును - ధరలో
నమ్మిన - నరులను బ్రోచును ||యేసు క్రీస్తు||

8 న్యాయంబు దీర్చు దినము గలదు - నమ్మని వారెల్ల - పాయంబు
నెదకిన గనుపడదు = నడుమడి చొప్పున - న్యాయము దీర్చును - నమ్మని
పాపులు - నరక మొందుదురు ||యేసు క్రీస్తు||

9 నమ్మండి నష్టము నొందరు - యేసుని నమ్మిన - పొమ్మని
చెప్పడు సుమ్మండీ = ఇమ్ముగ[2] కృపతో - నిలలో గాచును - పిమ్మట
మోక్ష - పురమున జేర్చును ||యేసు క్రీస్తు||

---

## 102 *"Ye must be born again."*

క్రొత్తజన్మము (యోహాను 3: 1-16)

రా—శంకరాభరణము. తా—ఆది.

పరమ రాజ్యమునకు నరులు - తిరిగి పుట్టవలయు ననుచు - బరమ
గురువు యేసు క్రీస్తు - స్థిరము జేసెను ||పరమ రాజ్య||

1 వేదశాస్త్ర మెరుగు నికో - దేమను పరిసయ్యు డొకడు - భావ
మందు దెలియ డాయె - బ్రభుని బోధను ||పరమ రాజ్య||

2 అతడు రాత్రివేళ ప్రభుని - వెతికి పోయి యెదుట స - న్మతిని
నిల్చి పిల్చి పల్కె - హితవు[3] తోడను ||పరమ రాజ్య||

3 బోధకుండ నీవు మోక్ష - నాధుడౌ యెహోవా యొక్క - బోధ
వార్త జెప్పెదౌ నీ - బోధ నెరుగుమన్ ||పరమ రాజ్య||

---

1 శబ్దముతో 2 బాగుగా 3 సుబుద్ధి

4 మఱియు నీవు చేయుచున్న - గురుతు లెవ్వియైన దైవ - వరము
లేని యట్టి పాప - నరులు చేయరు ॥పరమ రాజ్య॥

5 అనుచు పరిసయ్యుండు పల్క - వినుచు యేసు కనికరమున -
దనకు నిట్లు దెలిపె జాలి - మనసు తోడను ॥పరమ రాజ్య॥

6 క్రొత్త జన్మ మెవ్వడైన - నెత్త కున్న మోక్షమునకు - నెత్త బడ
డటంచు నిజము - క్రీస్తు పల్కెను ॥పరమ రాజ్య॥

7 వినుచు పరిసయ్యుండు ముసలి - జనుడు మరల దల్లి గర్భ -
మునను తిరుగ నెట్లు పుట్టు - ననుచు బల్కెను ॥పరమ రాజ్య॥

8 ఆగు కతము చెప్పె బలము - నందు బొందు నాత్మ జన్మ -
మొందకున్న మోక్ష రాజ్య-మందరనుచును ॥పరమ రాజ్య॥

---

## 103 *How beautiful upon the Mountains.*

సువార్తికుల ఘనము.

రా—కళ్యాణి. తా—అట.

ఎంతో సుందరమైనవి - ఘన గిరులపై[1] - నెంతో యందమైనవి =
సంతతంబు బరము - జనకు ప్రేమను దెల్ప - సంతస మందుచు - నరగ
ప్రకటన జేయ = నంతటను బని పూని ప్రభు న - త్యంతముగ ప్రకటించి
వసుధ న - నంతమగు శుభ వార్త జాటెడు - వింత యగు బోధకుల
పాదము ॥లెంతో సుందర॥

1 హిందు ముసల్మానులు - మూర్ఖత్వంబు - నొందు నాఫ్రిక జన
ములు = నందుచు గుందుచు[2] - వనగిరి కందరము[3] - లందు నున్న సకల.
మహా మోటు జన మెరుగ = బొందుగా ప్రభు యేసు సంగెడి - సుందరం
బగు సత్యవాక్యం - బందుకొని చాటించు చుండెడి - నందమగు బోధకుల
పాదము ॥లెంతో సుందర॥

---

1 కొండలపై 2 పశ్చాత్తాప పడుచు 3 అడవులలోను, కొండలలోను గల గుహలు

2 మదిలో ప్రభువును నమ్మిన - పాపుల నెల్ల - సుదిని మోక్ష పదమ్మన = విదితమ్ముగా జేర్చి - ప్రీతి జూపునటంచు - నిదిగో రమ్మని క్రీస్తు - పద సన్నిధిని జేర్ప = సదయులై శుభవర్తమానము - ముదముననుమది లోన నిడికొని - పదిలముగ ప్రకటింపుచుండెడి - విదితులగు[1] బోధకుల పాదము ||ఎంతో సుందర||

3 యేసు క్రీస్తు రారాజై - యున్నాడనుచు - భాసురంబుగ దెల్పుచు = వాసిగా ప్రభు యేసు - విసుధ రక్షకు డనుచు - నీ సువార్తను జాటి - యిచట నెమ్మది నొంద = దోసకారి జనంబు లందరి - కీ సుమంగళ వార్త దెలుపుచు - దోస మంతయు బాపు మన ప్రభు - యేసు చూపెడు వారి పాదము ||ఎంతో సుందర||

---

# 104 *Proclamation of the Gospel.*

శుభవర్తమాన ప్రకటన

రా__ బేహాగ్. తా__ఆది.

యేసుని సుచరిత - మెంత పావనరినది - ఎన్నడు వినియెద - రీ జగతిజ్ఞ = భాసుర నయమును - బంధను గలిగిన - భక్తుల కిది సౌ - భాగ్యముగా నా ||యేసుని||

1 దాసుల మొరలను - దప్పక వినుచును - ధైర్యము నొసగెడి - దాత సుమీ = దోసములను గమి - ద్రోయ బలము గల - దొడ్డ దొరకు నుతి - దూతల చేన్ ||యేసుని||

2 పాపి నరుల గని - పావనంబు నొనర్ప - భార మునక నెద - బంధువుడు = ఆ పరమ జనకు - నాజ్ఞ నడసి నెరి[2] - యాపన్యం డిడుముల[3] - నంచె నిలన్ నా ||యేసుని||

---

1 తెలివి గల 2 కరముగ 3 కష్టముల

3 సిలువపై నిలచి - చేటు నేమియు లేక - చివరకు జనకుని - చిత్త
మునన్ = జెలువుగ మనవిని - జేసెను నసలకు - శిక్ష దొలగుటకు -
శ్రీకరుడౌ నా ||యేసుని||

4 పాప రహితయ - పార మహిమమున - పాత్రము మరి నుడి -
పార్శ్వమునన్ = బాపుల విషయము - ప్రార్థన నొనర్చెడి - భావము
గల హిత - భాస్కరుడౌ[1] నా ||యేసుని||

5 దుష్టులు నను గని - దూషణ నుడువులు[2] - దుగ్ధము లనక - దూరిన
నా = దుష్టుని నడపిన - యిడుములు దలచి - యించుక పగ మది -
నెంతును నా ||యేసుని||

6 కల్మష విషయము - కష్టములు పడుచు - కర్తని విడనక - కంప
ముతోన్[3] = జెల్మిగ నొకరిడి - క్షేమము గనుగొన - చెంతను వేసగా[4] -
చేరద నా ||యేసుని||

7 గండము లిల బహు - గానను గదిసిన[5] - గత్తర దొరయక[6] -
గాటముగా = మండిత గుణమణి[7] - మాటప జన పలు - మాటు విషయ
మును - మప్పను నా ||యేసుని||

8 వారక నయ సు - వాక్యం[8] మధురమున - వాంఛను విడమర -
వారములన్ = దేరి కను గొనగా - దేటపరచబడి - తీరము గదా మది -
తీవ్రముగా నా ||యేసుని||

---

## 105 *Praise the Lord each tribe and nation.*

వరుస: యేసు నామమే పావనము.

రా—ఆనంద భైరవి. తా—అట.

దేవునికి స్తోత్రములు సేయుడి-సర్వ-దేశ జనులార పొందించుడీ=
జీవ రక్షణ సేన నెరిగిన - శిష్యులందరు - సంతసంబున ||దేవుని||

---

1 సూర్యుడౌ 2 తిట్లులు 3 వణకుతో 4 త్వరగ 5 సమీపించిన 6 భయపడక 7 శ్రేష్ఠ
మయిన గుణములచే నలంకరింప బడిన వాని 8 ఎడతెగక నీతి యుక్తమయిన మంచిమాటల

1 కూడి యెల్లరు స్తుతి చేయుడి - ప్రభుని - గుడిలోన నుతచేసి కీర్తిం
పుడి = పాడు డీరు[1] సగోన్నతుండగు - ప్రాజ్ఞ[2] ప్రభుపాట - పూర్ణస్వర
మెత్తి ||దేవుని||

2 ఆయనే మన దేవుండును - ప్రభు - వాది స్రష్టయు గాపరియున్ =
ఆయన యేర్పర్చుకొన్న గొర్రెల - మై యున్నాముగ - ఈ యిలయందు
||దేవుని||

3 రక్షకుడు మాదు పాపంబుల - బాపె - గావు మాకిక నాపదలు =
శిక్ష తొలగెను ముక్తి కల్గును - చిట్టచివర నీ - చిన్నమందను ||దేవుని||

4 అంగణములందు ద్వారంబులన్ - ప్రభు - నాతడీరగ స్తోత్రిం
చుడి = రంగుగా మన రక్షకుని పేరు - రాగ స్వరములతో - పాడుటకు
రండి ||దేవుని||

5 ముక్తి నడసిన మర్త్యులారా - మన - ముక్తినాథుని గొనియాడుండి =
రక్తి[3] నెప్పుడు నాడి తప్పని - రాజు దయగల - దేవుడీయనే ||దేవుని||

---

## 106 *Warning with reference to the Judgment.*

విమర్శను గురించి జాగ్రత్సూచన.

రా—సావేరి. తా—త్రిపుట.

ఇప్పటి నరులార - యిక నచ్చు లయ[4] బాధ - తప్పించు కొన మీరు -
త్వరపడ రయ్య = మెప్పు బొందిన యట్టి - గొప్పవారు మీరైన - తప్పు
లే నటువంటి - దారిలో నున్నారే ||ఇప్పటి నరులార||

1 పండితులైనను - బలశాలులైన భూ - మండలాధిపులైన[5] - మాన్యుల్[6]
మీరైన = ఖండితమగు తీర్పు - కాలంబులో బడ్డ - నిందు నెన్నదిలేని -
నేర్పులు వృథ గాన ||నిప్పటి నరులారా||

---

1 మీరు 2 మంచిబుద్ధిగల 3 ప్రేమ 4 నరక 5 భూలోకపు రాజులైన 6 ఘనులు

2 ధనవంతులైనను-దగువారలైనను - గుణవంతులైన సత్-కులజుల్[1] మీరైన=నెనలేని తుది దిన - మునకు లోబడు వేళ - మనసు నెమ్మదిలేని - మహిమలు వృథగాన ॥నిప్పటి నరులార॥

3 ఉపవాస పరులైన - జపమాల ధరులైన[2] తపసులైనను నెంతో - నిపుణుల్[3] మీరైన=నుపమ[4] లేనట్టి న్యా - యపు వేళ మీ మదికి - విపుల శాంతత లేని - విధు లన్ని వృథగాన ॥నిప్పటి నరులార॥

4 సకలంబు విడచి సం-శయ మెల్ల విడిచి న-మ్మికను క్రీస్తుని గొల్చి-మ్రుము భక్తులైన=నకలంకమగు[5] హృద - యానందముల నుందు - రొక బాధ మది నంట - కుండు నంతమునందు ॥నిప్పటి నరులార॥

---

## 107 *The Gospel of Salvation.*

రక్షణ శుభ ధ్వని.

రా__శంకరాభరణము. తా__ఆది.

మనంబునకు జేయు మోదము - క్రీ-స్త్వనూన[6] రక్షణ సునాదము= అనంత పాపంబు లనెడు నరకుల - కును[7] మహౌషధ మిది భయ హరంబు ॥మనంబునకు॥

1 వినోధి దుష్కృత పరంపర[8]-దుః-ఖ రాశి లోపల మునుంగుచు= దురంత దుర్గతుల[9]మైన మన మా - పరేశు[10] దయ బరమదినము జూతుము ॥మనంబునకు॥

2 సమస్త భూస్థలిని నిండును - దో - రమైన[11] మంగళ[12] నినాదము[13]= అమంద గతి[14] నప్పుడే పరమ సై - న్యముల్ ధ్వనుల్ జేయ గూడి పత్తురు ॥మనంబునకు॥

---

1 కులజులు 2 భక్తికై కంఠములో దండలు వేసికొనువారయిన 3 జ్ఞానులు 4 పోలిక 5 మచ్చలేని 6 తక్కువకాని 7 గాయములకు 8 పాపసమూహము 9 గొప్ప పాపాత్ములము 10 పరమాత్ముని 11 పొంగైన 12 శుభ 13 ధ్వని (సువార్త) 14 త్వరగ

## 108 *Proclamation of the Gospel.*

శుభవర్తమాన ప్రకటన.

రా—కళ్యాణి. తా—త్రిపుట.

చాటుండి శుభవార్తను - బోధకులారా - చాటుండి శుభవార్తను = చాటుండి శుభవార్తన్ - సకల రాష్ట్రములలో - జాటింపుడని చెప్పె - ధాటిగ ప్రభు యేసు ||చాటుండి||

1 లోకమును ప్రేమించి - లోక రక్షణకొరకు - ప్రాకటంబుగ సుతుని - బంపె దేవు డటంచు ||జాటుండి||

2 శత్రువుల రక్షింప - మిత్రుడుగా వచ్చి - మైత్రి నసువు లిచ్చి[1] - మరల లేచె నంచు ||జాటుండి||

3 ఎట్టి పాపులైన - ఇట్టి యేసుని మాట - దిట్టముగ నమ్మిన - బట్టుగ క్షమియించు ||జాటుండి||

4 హృదయ శుద్ధిని గోరి - సదయుడగు రక్షకుని - బదిలముగ ప్రార్థింప - బరిశుద్ధాత్మ నొసంగు ||జాటుండి||

5 నమ్మి బాప్తిస్మంబు - నెమ్మి బొందిన మనుజు - లిమ్మగ బొందుదు - రిలను ఘన రక్షణను ||జాటుండి||

6 ఇందు నందు మీకు - బొందుగ నొసగును - సందియము లేకుండ - సకల భాగ్యము లనుచు ||జాటుండి||

---

## 109 *Place of Worship hallowed.*

దేవాలయ ప్రతిష్ఠ.

రా—ఎమకుల కాంభోజి. తా—ఆది.

యెహోవా నీ మహిమ స్తవము[2] - యేసుని సుందర మందిరము - ఇది యెంతో నిత్య శుభకరము = సాహసమున క్రైస్తవాళి తోడను - స్నేహ మమర నీ శిష్యులు నిపుడీ - గేహమునకు[3] భక్తిని జేరిరి నీ - బాహు[4] బలము గన్పడ దీవింపుము ||యెహోవా||

---

1 ప్రాణము లిచ్చి 2 స్తుతి 3 ఇంటికి 4 నీ చేతి

1 ఆకాశము నీ సింహాసనంబగు - నవని నీ యడుగుల పీఠముగ - నమరు దేవ నీ కెవ్వరు సాటి = నీ కొఱ కొక మందిర మొనరించుట - కీ కుంభినిలో[1] నేరికి శక్యము - ప్రాకటమైనను నీ సద్భక్త - నికరంబులే[2] నీ నికేతనంబులు[3] ||యెహోవా||

2 సగమండలము లందుండి నీ - కరుణ జల్లి యీ యాలయము - పైని సుప్రకాశ మంపవె = తరతరముల క్రైస్తవ సముదయములు - విరివిగ నీ మందిర పూరితములై - చిరకాలము నీ సేవ యొనర్పను - వరముల నిమ్మని నెరి[4] ప్రార్థింతుము ||యెహోవా||

3 అందముగాను నిందులో ని - న్నారాధించు ప్రియ భక్తుల - డెందములే నీ మందిరములుగా = ముందొనరింపుచు పొందుగ నలు దెస - లందు నుండు నర బృందంబులు[5] తమ - సందియములు విడి సద్గతి పొందుట - కిందు రాను నీ వింక నొసగుము ||యెహోవా||

4 పతితాత్ములైనట్టి నరుల - పాప రోగాములకు మందు - వెతకు వారి కీ గృహమున నుండున్ = హితవుగ క్రీస్తుం డీ గృహపతియై - ప్రతి పాపికిని సతతంబును వా - గ్వితతిని[6] బిలుచును వినయముతో దన - క్షత రక్త[7] మహౌషధ మిడి ప్రోచును ||యెహోవా||

5 ధారుణిలో మర్త్యవర్గుల - పేరైన గుడారంబులలో - జేరియుండు దానికంటెను = పేరిమిగల యీ నీ సదనాంగణ[8] - ద్వారపాలకత్వము మా కిచ్చిన - భూరి భాగ్య పరిపూర్ణులమై వి - స్తారశాంతి మది సౌఖ్య మొందుదుము ||యెహోవా||

---

1 భూమిలో 2 భక్త సమూహములే 3 ఇండ్లు 4 మిక్కిలి 5 గుంపులు 6 మాటల సమూహముచేత 7 గాయపు రక్త మనెడు 8 ఇంటి ముంగిట

## 110 *Praying for God's blessing.*

దైవాశీర్వాదమును కోరుట.

రా—హుసేని. తా—ఝాప్.

దేవా యాశీర్వదించుము - దివ్యానంద ప్రభావ మమ్మాద రించుము = దేవా నీ యాలయంబున - కేవలంబుగ నీదు - పావన వాక్యములను - భావింప జేరితిమో ॥దేవా॥

1 రంగైన నీ నామము - రంజిల్లుగాక - శృంగార మందిరము నందు = సంగీత రావముల[1] ప్ర - సంగంబుల నీదు - మంగళంబగు నామ - మంగీకార మగునట్లు ॥దేవా॥

2 పరిశుద్ధ శాస్త్ర బోధనలు - విరళింప బోవు - పరమార్థంబైన బోధనలు = గురిబెట్టి వినుట కొరకై - పరివేష్టించితిమి[2] మా - మరతంపు భావములను - బరిమార్చి[3] చక్కబరచి ॥దేవా॥

3 గురి నిల్పి వినుటయే గాక - పరిశుద్ధ వాక్య - పరిశీలనంబు జేయుచు = బరిపూర్ణ విశ్వాస - భరితాత్ములమై భువిని - వెరి[4] శోధనములు గెలిచి - చిర జీవన్ముక్తి నొంద ॥దేవా॥

4 పరమార్థంబైన బోధలన్ - మరల సబ్బాతు - వరకు నిలువరముగా నుండ = బరిశుద్ధాత్ముని సహాయము - బరిపూర్ణముగ నొసంగి - తిర మొప్ప[5] హృదయములు బల - కరముగ నిన్ సేవింప ॥దేవా॥

5 ధరపై మరణాంతము వరకు - విరళింప బడెడి - పరిశుద్ధ శాస్త్ర సారములన్ = మరిగి మా యాత్మ లెల్ల - బరిపూర్ణ బలము నొంది - మరణాంతము నందు నీదు - పరమోక్ష మహిమ నొంద ॥దేవా॥

---

1 ధ్వనుల 2 కూడితిమి 3 తీసివేసి 4 గొప్ప 5 స్థిరముగా

# క్రైస్తవ జీవనము—పిలుపు.

## 111 *The Purifying Word.*

క్రీస్తు వాక్యము పతిత పావనమైనది

రా—శంకరాభరణము. తా.—త్రిపుట.

వినరయ్య నరులార - విశ్వాసమున క్రీస్తు - వేద[1] బోధ = పాప - మనుజుల కెల్ల పా - వన[2] జీవనము జేయు - వసుధ[3] మీద ॥వినరయ్య॥

1 పాపాత్ములను పశ్చా - త్తాపము పడుమంచు - ప్రభువు తెల్పెన్ = దన్ను - దాపు గోరిన వారి - గాపాడుటకు దాను - దక్షుడయ్యెన్[4] ॥వినరయ్య॥

2 భారాక్రాంతులైన[5] - పాపుల దను జేర - ప్రభువు పిల్చెన్ = శ్రమలు - దూరంబు జేసి త - ద్దురితముల్ బాపి సం - తోష మియ్యన్ ॥వినరయ్య॥

3 అనుమానింపక యెవ్వ - రైన వచ్చిన ద్రోయ - ననుచు పల్కెన్ = బెల్కె - మనుజుల కొరకు జీ - వన మియ్య నే వచ్చి - తనుచు దెల్పెన్ ॥వినరయ్య॥

4 సర్వాంతఃకరణతో - సర్వేశ్వరుని ప్రేమ - సలుప నేర్పెన్ = ఇంక - నుర్విలో దన పోల్కె - నొరులను ప్రేమింప - నుక్తి దెల్పెన్ ॥వినరయ్య॥

5 తన శిష్యులకు నైక్య - మును ప్రేమించుట కాజ్ఞ - లొసగ నిచ్చెన్ = ఎంతో - ఘన సత్ప్రభువు కాళ్లు - గడిగి భక్తుల చోట - వినతు డయ్యెన్[6] ॥వినరయ్య॥

---

1 వాక్య 2 పవిత్ర 3 భూమి 4 శక్తిగలవాడాయెను 5 భారముచే నిండిన 6 వినయము గల వాడాయెను

## 112 *Invitation to Sinners.*

రక్షణాహ్వానము.

రా—శ్రీ. తా—త్రిపుట.

రారో జనులారా – వేగము గూడి – రారో ప్రియులారా – శాశ్వతమైన ఘన రక్షణ జేర = సారా సారములు[1] – సమ్మతిగా జూచి – ధీరత్వమున[2] క్రీస్తు – వాకి దాకి నేకి ||రారో||

1 అనుమానము లన్ని – మీరిక మాని – యాద్యంతము లేని[3] = కని కరము చేత – మనల రక్షింపను – దన జీవము నిచ్చె – ఘనుని క్రీస్తుని గొల్వ ||రారో||

2 మన పాపము లన్ని – మోయను దే – వుని చే బని బూని = మను జావతారుడై – వినుట కద్భుతమైన – పను లెన్నో చేసి సి – ల్వను బడ్డ ఘను జేర ||రారో||

3 పాపాత్ము లగు వారి – భారము ద్రుంచు[4] – బలువైన యుపకారి = ఓపికతో దన – దాపు జేరిన వారి – శాపము తా మోసి – కాపాడు ఘను వేడ ||రారో||

4 ఒక మానవుడైన – పాపము లేని – యకళంకుడు[5] దేవ తన్యా = సకలాపస్థల – సంసార మగ్నులై[6] – మేకముల[7] వలె జ్ఞాన – మెరుగని వారెల్ల ||రారో||

5 తన యాత్మకు కీడు – గల్గించెడు – ఘనత లెల్లను బాడు[8] = తనవు[9] నిత్యము గా – దనుమఱి సురభిమాన – మును వీడి ఘన క్రీ – స్తుని జూడ గతి జూడ ||రారో||

---

1 సారము గలవి, సారము లేనివి 2 ధైర్యముతో 3 నిత్యమైన 4 తెగివేయు 5 పరిశుద్ధుడు 6 మునిగినవారై 7 మృగముల 8 పనికిరానివి 9 శరీరము

6 సకలాంతర్యామి[1] - నిరాకారుడు - దేవుడే యంతటను స్వామి[2] = ప్రకటముగా మర్త్యులను నెల్ల మధ్యస్థుడౌ - దేవుడే క్రీస్తుడు సంరక్షకుడై యిలకు వచ్చె ॥రారో॥

---

## 113 Come to Jesus.

యేసు నొద్దకు రండి.

రా—సారంగ. తా—ఆది.

రండీ యేసుని యొద్దకు - ప్రియులారా మీరు - రండీ యేసుని యొద్దకు = రండి రండి యని రంజిల[3] బిలుచుచు - నుండెడి రక్షకు డొసగెను బ్రాణము ॥రండీ॥

1 మీరు పాపంబుల ద్యజించి - యేసుని కడకు - రారే వేగము విశ్వసించి = మీరు వచ్చినను మిమ్మును ద్రోయడు - చేరెడు వారిని చేర్చును దన దరి ॥రండీ॥

2 మీకు బ్రతు కేమి శాశ్వతము - ప్రియ జనులారా - పోకుడీ యాశించి లోకమును = లోకాశలకును లొంగుట చేతను - మీకు ఘటిల్లును[4] మెండగు దుఃఖము ॥రండీ॥

3 మీ రేల జాలము[5] చేసెదరు - ప్రియులారా వేగ - రారే కడు భాగ్య మొందెదరు = చేర వచ్చి చిర జీవము నొందుడ - పార ముదంబును[6] బడయగ దేవుడు ॥రండీ॥

---

## 114 Invitation to Sinners.

పాపులను పిలుచుట

రా—యమునా కళ్యాణి. తా—రూపకము.

పాపులార రండి - మన - ప్రాపు యేసు సుమండి - యతి - పాపులార రండి = రండి రండి పాపులారా - నిండు ధైర్యపడండి వేగ మే - దండియై యుండు మన - కుండు యేసుండని ॥పాపులార॥

---

1 అందరి హృదయములలో నుండువాడు 2 అంతటను దేవుడు 3 అనురాగము పొంద 4 సంభవించును 5 ఆలస్యము 6 మితిలేని సంతోషమును

1 దాహ మణచు దేవవాక్యము- దేహధారులార రండి - దేహీయని విహీనపు-సాహాయ్యము నోహోయని॥పాపులార॥

2 దరిద్య్ర మించుక లేని విక్రియ - మయ్యా నీ యేసయ్య రక్తము - చేయ లేమయ్య మన - మయ్య దుర్నయముల్ ॥పాపులార॥

3 నిండు మనసు గలిగి యే - సండ[1] జేర రండి వేగమె - నిండు ప్రియుండు[2] య - ఖండు[3] పురుషుండని ॥పాపులార॥

4 నింద లన్ని బొంది ప్రభువు - మందలో వెలుగొంద రే తరి బొందుగ మందలో - నుందు రానందమున ॥పాపులార॥

---

## 115 *Jesus knocking at the door.*

యేసు హృదయ ద్వారము తట్టుట.

రా— భైరవి, తా— ఆది.

హృదయ మనెడు తలుపునొద్ద - యేసు నాథుండు = నిలిచి- సదయు డగుచు[4] దట్టుచుండు - సకల విధములను ॥హృదయ॥

1 పరుని బోలి నిలుచున్నాడు - పరికించి చూడ = నతడు - పరుడు గాడు రక్షకుండు - ప్రాణ స్నేహితుడు ॥హృదయ॥

2 కరుణా శీలుం[5] డతడు గాన - గాచి యున్నాడు = యేసు - కరుణ నెరిగి గౌరవింప - గరము[6] న్యాయంబు ॥హృదయ॥

3 ఎంత సేపు నిలువబెట్టి - రెయేడ్పింతు = రతని - నాథ - డెంతో దయచే బిలుచుచున్నా - డిప్పుడు మిమ్ములను ॥హృదయ॥

4 అతడు మిత్రు డతడు మిత్రు - డఖిల[7] పాపులకు = మీర - లతని పిలుపు వింటిరేని - యతడు ప్రియుడగును ॥హృదయ॥

5 జాలిచేత దన హస్తముల - జాపి యున్నాడు = మిమ్ము - నాలింగనము[8] సేయ గోరి - యనిశము[9] కనిపెట్టు ॥హృదయ॥

---

1 చెంతను 2 గొప్ప దయగలవాడు 3 సమీపముగ నున్న 4 ప్రేమతో 5 కరుణ స్వభావము గలవాడు 6 మిక్కిలి 7 సమస్త 8 కౌగలింత 9 ఎల్లప్పుడు

6 పోటి లేని దయగల వాడు - సర్వేశు సుతుడు = లేన - మాటి వినెడు వారి నెల్ల - నూటిగ రక్షించు ||హృదయ||

7 తలుపు తెరచి చేర్చుకొనుడి - నిలచెడు రక్షకుని = మిమ్ము-బలు విధముల శుద్ధి చేసి - బలము నిచ్చును ||హృదయ||

8 చేర్చు కొనుడి మీ హృదయమున - శ్రీ యేసు నాథు = నతడు - చేర్చు కొనుచు మీ కిచ్చును - జిర జీవము కృపను ||హృదయ||

9 అతడు తప్పక కలుగ జేయు - నఖిల భాగ్యములు = మీర - లతని హత్తుకొందు రప్పు-డానందము తోడ ||హృదయ||

10 బ్రతుకు శాశ్వతంబు కాదు - పరికించి చూడ = గాన - బ్రతికి యుండు కాలముననే - ప్రభువును గొలువుడి ||హృదయ||

---

## పశ్చాత్తాపము.

## 116 *The sinner invited to Christ.*

పాపిని బిలుచుట.

రా.—యదుకుల కాంభోజి. తా.—ఆది.

పాపి రా - రమ్మి లెమ్మి - ప్రభు నొద్ద కిపుడే రమ్మి = నీ పాలి తండ్రి యేసు - నేడు నిన్ను రమ్మనుచున్నాడు ||పాపి||

1 ఇపుడే యేసుని యొద్దకు - నిపుడే యేసుని సన్నిధికి = నిపుడే క్రీస్తుని దగ్గరకు - నెపము లేమి చెప్పక వేవేగమె ||పాపి||

2 నిన్ను రక్షించు ప్రభువు - నిన్ను రక్షించు గురుడు = నిన్ను రక్షించు కర్త - యున్న పాటుననె వడిగా లేచి ||పాపి||

3 నమ్మి నీ మానసమున[1] - నమ్మి నీ బుద్ధియందు = నమ్మి నీ యాత్మలోన - నిమ్మళమ్మి నీ కిపుడే దొరకును ||పాపి ||

---

1 మనస్సులో

## 117 *Why will ye die.*

ఎరిగి చెడి పోతివి.

రా—ముఖారి. తా—ఆది.

ఎరిగి యెరిగి చెడిపోతివి మనసా - ఇక నీ దిక్కెవ్వరు చెపుమా = దురితం బిది సచ్చరితంబిది[1] యని _యెరుక[2] సరకుగొన[3] కేమియు నీ॥ వెరిగి॥

1 ఇది దేవుని దయ యిది క్రీస్తుని ప్రియ - మిది విమలాత్మని[4] గుణ మనుచు = నెదలో[5] ననుభవ మెరిగి యెరిగి దు - ర్మదమున దుష్కృత పదమున బడితివి ॥ఎరిగి॥

2 సకలము చూచెడు దేవుని కంటికి _ జాటుగ జరిగెడి పనియేది = యిక చెవి గుసగుస లెల్లను దిక్కుల - ప్రకటము జేసెడు ప్రభు వున్నాడని ॥ఎరిగి॥

3 ఎన్ని మార్లు సిలువను వేయుచు ప్రభు - యేసును వెతలను[6] బెట్టెదవు=తిన్నని మార్గము తెలిసియుండి నీ - కన్నుల గంతలు గట్టితివయ్యో ॥ఎరిగి॥

4 గద్దించెడు మానస సాక్షికి గడ _ గడ లాడక పోతివి నీవు = హద్దు మీరి దైవాజ్ఞలు ద్రోయుచు _ అటు నిటు పరుగెత్తితి వయ్యో ॥ఎరిగి॥

5 పాలను ముంచిన నీళ్ళను ముంచిన - ప్రభు క్రీస్తుడె నీ దిక్కనుకో = తాళుచు[7] పశ్చాత్తాపము పడి యిక - చాలించుము కలుషపు[8] యత్నంబు ॥ వెరిగి॥

6 అపరిమిత దయా శాంతులు గల ప్రభు - వనిశము కోపింపడు నీ పై=కృప వాగ్దత్తము లెపుడు దలచి నీ - యపవిత్రత గని హా యని యేడ్వు ॥ మెరిగి॥

---

1 మంచినడవడి 2 జ్ఞానము 3 లక్ష్యపెట్టక 4 పరిశుద్ధాత్మని 5 మనస్సులో 6 కష్టములు 7 సహించుచు 8 పాపపు

## 118 *Exhortation to Repentance.*

పశ్చాత్తాపము నొందుటకు ప్రేరేపించుట.

రా__ముఖారి. తా__ఆది.

పాపము దలచు సుమీ - పశ్చా-త్తాపము పొందు సుమీ=దాపని యెంచి యేసును మదిలో - పాపము వీడు సుమీ ||పాపము||

1 పాపము సేయకుమీ - యేసుని - గాయము రేపకుమీ = పాయక[1] పాపము జేసిన మనసా - కాయడు యేసు సుమీ ||పాపము||

2 ఈశ్వరన్ నమ్మకుమీ - ఆత్మకు - శోధన లుండు సుమీ = శోధన మాన్పెడు క్రీస్తును నమ్మి - శ్రద్ధగ నుండు సుమీ ||పాపము||

3 తెగువగ పోరాడు సుమీ - రిపులకు[2] - బెగ్గిల[3] వద్దు సుమీ = తెగువగ ప్రార్థన ఖడ్గము బట్టి - పగతుని గెల్వు సుమీ ||పాపము||

4 అంతము వచ్చు సుమీ - రక్షణ - ఇంతలో వెదకు సుమీ = అంతరంగుడగు[4] క్రీస్తు రక్షకుని - చెంతను జేరు సుమీ ||పాపము||

---

## 119 *Time passing away and to be improved.*

కాలము అనిత్యము గనుక సఫలపరచబడ వలసినది.

రా__ధన్యాసి. తా__ఝాప్.

పోయెగ పోయెగ - కాలము వెళ్ళి - పోయెగ పోయెగ = మాయ సంసార సం - పద గూర్చి మరిగి - యాయువంతయు వ్యర్థ-మై పోయె దరిగి ||పోయెగ||

1 ఇలలో నెందరు నీతో-నీడైన వారు =కల గాంచి మేల్కొన్న- గతి మడిసినారు[5] ||పోయెగ||

2 జల బుద్బుదము[6] కంటె - చులకని బ్రతుకు = దలపోసి దీని యా - శలు గొయ్య వెదకు ||బోయెగ||

---

1 విడువక 2 శత్రువులకు 3 భయపడ 4 ప్రాణస్నేహితుడగు 5 చనిపోయిరి 6 నీటి బుడగ

3 ఎన్నాళ్లు సుఖపెట్టె - నెరవా[1] యీ మేను = కన్ను మూసిన నాడె - కాటి పాలౌను ॥పో॥యెగ॥

4 మద మత్సరముల వెం - బడి గూడి నీవు = హృదయాభిమానము[2] - వదలు కొన్నావు ॥పో॥యెగ॥

5 చెడు దుర్గుణముల పో - షించుట విడుచ = గడ బాట్లు[3] పరికింప - గనులు గన్పడవా ॥పో॥యెగ॥

6 జవ్వన[4] బలముచే - గొవ్వుచు నీవు = నవ్వులాటల పొద్దు - నడిపి యున్నావు ॥పో॥యెగ॥

7 విన జెవుడు కన గుడ్డి - వృద్ధ దశయందు = నిను నవ్వ జొత్తురు - నీ వారు ముందు ॥పో॥యెగ॥

8 చెడ్డ వేల్పుల సేవ - జేసితివి మిగుల = గుడ్డిగవ్వంతైన - గుణ పరప దగిర ॥పో॥యెగ॥

9 ఇకనైన శుభవార్త - నెదలోన బెట్టు = ప్రకటంబుగా క్రీస్తు - పాదముల బట్టు ॥పో॥యెగ॥

10 చాలించు మిక పాప - సరణిలో[5] నడక = గీలించు మెండ భక్తి - క్రియ వెనక బడక ॥పో॥యెగ॥

11 నిను నీవె తలపోసి - నీ పాప మెంగుగు = దినము ప్రార్థించి క్రీస్తుని ముందు[6] నెరుగు[7] ॥పో॥యెగ॥

---

## 120 *Contrition for Sin.*

పాపమును గురించి విలపించుట.

రా — యమునకల్యాణి కాంభోజి. తా — ఆది.

త్రాహి[8] మాం[9] క్రీస్తు నాథ - దయ జూడ రావే = నేను దేహి యనుచు నీ పాదములే - దిక్కుగ జేరితి నిపుడు ॥త్రాహి మాం॥

---

1 స్వంతదికాని 2 ఆత్మ గౌరవము 3 చివరి కష్టములు 4 యౌవనపు 5 మార్గములో 6 ఎదుట 7 నమస్కరించు 8 రక్షించుము 9 నన్ను

1 గప్పు చేయరాని చెడ్డ - కర్మెంగ్రి యాధీనుడనై - రప్పు[1] పాలై నే నెంతో - నెవ్వ[2] బొందితి = దప్పు మన్న కొలది పెరుగు - తరగను నా పాప రాశి - యిప్వింగమున చెడిపోతి నే - నేమి చేతు నోహాహాహా ||త్రాహి మాం||

2 నెయ్యము భయక్షమలు లేని - నిర్లజ్జా చిత్తము[3] బూని - చెయ్య రాని మష్కర్మములు - చేసి నాథను = దయ్యముల రాజు చేతిలో - జెయ్యి వేసి వాని పనుల - జెయ్యి సాగి నే నిబ్భంగి[4] - చెడిపోతి నే - నయ్యయ్యయ్యో ||త్రాహి మాం||

3 నిబ్బర మొక్కించుకైన - నిజము రవ్వంతైన లేక - దబ్బర[5] లాడుటకు ముత్తాతనైతిని = అబ్బురమైన ఘోర పాపాంధ కార కూపమందు[6] - దబ్బున పడిపోతినయ్యో - దారి చెడి నే నబ్బబ్బబ్బా ||త్రాహి మాం||

4 నిన్ను జేరి సాటిలేని - నిత్యానంద మంద బోవు - చున్నప్పుడు నిందలు నా - కెన్ని చేరి నా = విన్న దనము[7] లేకుండ నీ - వే నా మదికి స్థైర్య మిచ్చి - యన్నిట రక్షించితివి నా - యన్న నీకు స్తోత్ర మహాహా ||త్రాహి మాం||

---

## 121 *Confession of Sin.*

పాపము నొప్పుకొనుట.

రా—కేదారగౌళ. తా—ఆది.

దిక్కు లేని వాడ నో ప్రభో - నీ యండ చేరి - మ్రొక్కి సేవజేతు నో ప్రభో = మ్రొక్కి విన్నవించు వారి - యక్కరలను దీర్చు సత్యము - గ్రక్కున[8] నిడి యాదరించు - మక్కువైన దేవ తనయ ||దిక్కు లేని||

---

1 అపకీర్తి 2 ఆపద 3 సిగ్గులేని మనస్సు 4 ఈ విధమున 5 అబద్ధములు 6 నూతిలో 7 చిన్నతనము 8 వెంటనే

1 ఘోర పాప భరము నెల్లను - మోయుచు నలయు - వారలార
రం డటంచును = భూరి[1] దయను బిలిచి యున్న - సారవాక్య-
మెఱుగ కధిక - భార మొంది తుదిని నీ దరి - జేరితి న న్నాదరింపుము
॥దిక్కు-లేని॥

2 బలము లేని వాడ నో ప్రభో - కేవలము పాప - ములను చేసి
యలసితిని ప్రభో = యిలను నే నొనర్చినట్టి - కలుషజాలములను[2] నీవు -
దొలగ జేసి యాత్మ కధిక - బలము నొసగి మనుపు[3] మయ్య ॥దిక్కు-లేని॥

3 పాపపుండ నౌట వల్లను - నే నెఱుగనైతి - క్షేమ మిచ్చు పదవు
లెల్లను = కామ క్రోధ లోభములను - క్షమనమున[4] విడచి యేసు - నాము
మందు విశ్వసించి - ప్రేమను వర్తింప జేయు ॥దిక్కు-లేని॥

4 మిక్కుటంపు పాపి నో ప్రభో - నే నిక్కముగ నీ - చక్కి[5]కి
రా దగను మా ప్రభో = పుక్కిటి[6] పురాణములను - గ్రక్కున విడలేక
విడచి - నిక్కమైన పదవి వెదకి - చక్కికి నే తెంచి తిపుడు ॥దిక్కు-లేని॥

5 వందనం బొనర్తు నో ప్రభో - నా డెందమందలి[7] - సందియము
లణంచు మో ప్రభో = సందియ మెడబాపి శాస్త్ర - మందు నుండు
సారవాక్య - నంద పదవు లనుభవింప - డెందము వెలిగింపుమయ్య
॥దిక్కు-లేని॥

---

## 122 *The Return of a Sinner.*

పాపి మరలుట.

రా—ముఖారి. తా—త్రిపుట.

నన్ను దిద్దుము చిన్న ప్రాయము - సన్నుతుండగు నాయనా =
నీవు - కన్న తండ్రి వనుచు నేను - నిన్ను జేరితి నాయనా ॥నన్ను॥

---

1 గొప్ప 2 పాప రాశిని 3 రక్షింపుము 4 వైరాగ్యముచేత 5 సన్నిధికి 6 పాత
7 హృదయములోని

1 దూరమునకు బోయి నీ దరి - చేరనైతిని నాయనా = నేను -
కోరు మూర్ఖపు పిల్లనై కా-రడవి దిరిగితి నాయనా ||నన్ను||
2 మంచి మార్గము లేదు నాలో - మరణ పాత్రుడ నాయనా =
నేను-వంచితుండ[1] నైతి నీ ప్ర-పంచమందున నాయనా ||నన్ను||
3 చాల మారులు తప్పిపోతిని - మేలు గానక నాయనా = నా -
చాల మొరల నాలకించుము - జాలిగల నా నాయనా ||నన్ను||
4 జ్ఞాన మంతయు పాడుచేసి - కాన నైతిని నాయనా = నీవు -
జ్ఞానము గల తండ్రివని - జ్ఞప్తి వచ్చెను నాయనా ||నన్ను||
5 కొద్ది నరుడను దిద్దు నను నీ - యొద్ద జేర్చుము నాయనా = నీ -
యొద్ద జేర్చి బుద్ధి చెప్పుము - మొద్దునైతిని నాయనా ||నన్ను||
6 ఎక్కడను నీవంటి మార్గము - నెరుగ నైతిని నాయనా = నీ -
రెక్క-చాటున నన్ను జేర్చి - చక్క-బరచుము నాయనా ||నన్ను||
7 శత్రువగు సైతాను నన్ను - మిత్రు జేయను నాయనా = ఎన్నో -
సూత్రములు గల్పించెను నా - నేత్రముల కో నాయనా ||నన్ను||
8 వాసిగా[2] నే పాపలోకపు-వాసుడ నో నాయనా = నీ - దాసు
లలో నొకనిగా నను - జేసి కావుమి నాయనా ||నన్ను||

---

## 123 *Just as I am, I come to Thee.*

ఉన్న విధముననే క్రీస్తు నొద్దకు వచ్చుట.

రా___అసావేరి. తా___చాపు

ఉన్న పాటున వచ్చు-చున్నాను నీ పాద సన్నిధి కో రక్షకా =
యెన్న శక్యము గాని పాపము - లన్ని మోపుగ వీపుపై బడి-యున్న
విదె[3] నడలేక తొట్రిలు-చున్న వాడను నన్ను దయ గను||నున్న పాటున||
1 కారుణ్య నిధి[4] యేసు - నా రక్షకా నీ శరీర రక్తము చిందుట =
భూరి[5] దయతో నన్ను నీ దరి - జేర రమ్మని బిలుచుటయు ని- ష్కారణ
పు నీ ప్రేమ యిది మరి - వేరె హేతువు లేదు నాయేసా ||నున్న పాటున||

---

1 పాపము గలవాడ 2 నిజముగా 3 ఇదుగో 4 దయా సంపూర్ణుడు 5 గొప్ప

2 మనసి బొగ్గువలె నా మా - నస మెల్ల[1] గప్పె దో - ష సమూహ
ములు మచ్చలై = యసితమగు[2] ప్రతి డాగు తుడుచను - గసటు[3] గడిగి
పవిత్రపరుపను - నసువు లిడు[4] నీ రక్తమే యని - మసల[5] కిప్పుడు సిలువ
నిదె గని ॥యున్న పాటున॥

3 వెలపట బహు యుద్ధ - ములు లోపటను భయము - గలిగె
నెమ్మది దొలగెను = బలు విధములగు సందియంబుల - వలన పోరాటము
లచే నే - నలసి యిటునటు కొట్టబడి దు - ర్బలుడనై గాయములతో నిదె
॥యున్న పాటున॥

4 కడు బీదవాడ నం - ధుడను[6] దౌర్భాగ్యుడను - చెడిపోయి పడి
యున్నాను = సుడివడిన[7] నా మదికి స్వస్థత - చెడిన కనులకు దృష్టి
భాగ్యము - బడయవలసిన వన్ని నీచే - బడయుటకు నా యొడయడా[8]
యిదె ॥యున్న పాటున॥

5 నీ వాగ్దత్తము నమ్మి - నీపై భారము పెట్టి - తీస మార్గము
గంటిని = గేవలంబగు[9] ప్రేమ చేతను - నీవు నన్ను క్షమించి చేకొని -
భావ శుద్ధి[10] నొనర్చి సంతో - షావసరముల నిడుదు వని యిదె ॥యున్న
పాటున॥

6 దరిలేని యానంద - కరమైన నీ ప్రేమ - తరమె వర్ణన చేయను =
దెరువు[11] కడ్డంబైన యన్నిటి - విరుగ గొట్టెను గాన నే నిపు - డపదుగా
నీ వాడ నవుటకు - మరి నిజము నీ వాడ నవుటకె ॥యున్న పాటున॥

---

## 124 *Ask ye what great thing I know?*

చాయ: సకలేంద్రియములారా.

రా___కాంభోజి. తా___జంపె.

నా కింత ప్రోత్సాహా - నందంబుల్ గల్గుట - కే కర్త ఘనమైన -
హేతువై యుండు ? = నాకు గల యున్నత కారణ మే - నాధు డగును ?

---

1 హృదయమంత 2 నల్లని 3 మురికి 4 జీవము లిచ్చు 5 ఆలస్యముచేయక 6 గుడ్డివాడను
సొమ్మసిల్లిన 8 రక్షకుడా 9 ముఖ్యమైన 10 మనస్సుశుభ్రముగా 11 దారి

నేను మరియు – శ్రీకరంబగు[1] సాటి మేది – సిల్వబడ్డ యేసు క్రీస్తె
॥నా కింత॥

1 ఎవరు నా భక్తికి – హితమైనట్టి పునాది? – ఎవరు నా కంఠంబు – నెత్తెన్ పాటలతో? = ఎవరు నా పాపముల భారము – నెత్తుకొని దేవునికి నాకను – చివరకున్ స్నేహంబు కలిపిరి? – సిల్వబడ్డ యేసు క్రీస్తె
॥నా కింత॥

2 నేను నా విధు లెల్ల – నిశ్చయంబుగ నెరుగ – జ్ఞాన మిచ్చుచు నుండు – జ్ఞాని యెవ్వారు? = వాని యెడల నను యథార్థ – పరుని గా గావించి యవి నా – చే నెరవేర్పించు నెవరు? – సిల్వబడ్డ యేసు క్రీస్తె
॥నా కింత॥

3 ఎవరు నా శత్రువు – నెదిరించి గెల్చిరి – ఎవరు నా శోకంబు[2] – నెగుర గొట్టిరి? = ఎవరు నా హృదయంపు మూర్ఛను – దిడ్చి సేదను[3] దీర్చి మనసు – చివుకు మను గాయంబు మాన్పిరి? – సిల్వబడ్డ యేసు క్రీస్తె
॥నా కింత॥

4 మరణంబులో నాకు – చిరజీవ మెవ్వారు? – మరణంబునకె గొప్ప మరణ మెవ్వారు? = విరివిలేని[4] మహిమ సేనలు – దరిని నుండగ నన్ను చెంతను – స్థిరముగ స్థాపించు నెవరు? – సిల్వబడ్డ యేసు క్రీస్తె ॥నా కింత॥

5 నన్ను రక్షింప మర – ణం బొందియు సమాధి – నెన్నటికిని గెల్చి – యున్న ప్రభువనుమ = నున్న విశ్వాసంబె నాకు – నుత్సవంబును గలుగ జేయును – చెన్నగు[5] నా ప్రభు వికెవ్వారు? – సిల్వబడ్డ యేసు క్రీస్తె
॥నా కింత॥

---

1 సౌఖ్య మిచ్చు 2 దుఃఖము 3 బడలికను 4 లెక్కలేని 5 ప్రేమగల

## 125 *Confession of Sin.*

పాప మొప్పుకొనుట.

రా—నాథనామక్రియ. తా—అట.

పాపినయ్యా - నే - పాపినయ్యా - కాపాడనయ్యా - పాపభార మునుండి - బాపుమయ్యా - నన్ను - పాపభారమునుండి - బాపుమయ్యా ॥ పాపి॥

1 కావుమయ్యా - నను - గావుమయ్యా - నా పావనయ్యా - జీవమైన యేసు - నీవే నయ్యా - నా - జీవమైన యేసు - నీవే నయ్యా ॥ పాపి॥

2 ప్రాపు[1] నీవు - నా - ప్రాపు నీవు - నన్నోపినావు[2] - నా పాలి దైవమా - నన్ను గావు - ఓ - నా పాలి దైవమా - నన్ను గావు ॥ పాపి॥

3 ఏలనయ్యా - న - న్నేలనయ్యా - మేలియ్యవయ్యా - చాల నమ్మితి కరుణా - శాలివయ్యా - నే - చాలా నమ్మితి కరుణా - శాలినయ్యా॥ పాపి

4 మంటివాడ - నే - మంటివాడ - నన్నొంటి వీడ - కెన్నంటి కైన ని - న్నంటువాడ - నే - నెన్నంటికైన ని - న్నంటువాడ ॥ పాపి॥

5 శాంతిపరచు - నను - శాంతిపరచు - నీ శాంతి మిడుచు - నా సాంతమగు దనుక[3] - చెంత నునుచు - నే - నా సాంతమగు దనుక చెంత నునుచు[4] ॥ పాపి॥

---

## 126 *Exhortation to Repentance.*

మనః ప్రేరేపణ.

రా—సౌరాష్ట్రి. తా—ఆది.

దేవా బోధ్రివు మంచు పాధ్రింపవే మనసా - సేవ యేసు ద్వారా గావింపవే మనసా - జీవ మార్గమందు నిలువ లేవ - నిన్ను నిలుపు జుమ్మీ[5] - పాపనాత్మ నొసగి శాశ్వ - తానందంబు[6] నిచ్చు నమ్మి ॥ దేవా॥

1 దిక్కు 2 నన్ను క్షమించినావు 3 చనిపోవు వరకు 4 చెంత నుండుము 5 సుమీ 6 నిత్యతృప్తి

1 ఆధారమైయున్న నీ - శుద్ధాత్మ నీ చుట్టు వ్యాపించి - వాదులాడి విడక సత్య = బోధ మార్గమందు దించి - మీది రుచులం[1] జూపి నిన్ను - మిసిమిగా[2] చేయు ధ్యానించి - ఖేద[3] మొందు చేసియున్న - కిల్బిషంబు లందలంచి[4] ||దేవా||

2 కారుణ్య భావంబుతోడ - గాచుచున్న వాని విడిచి - సారహీనమైన శా = రీర భోగములను గుడిచి[5] - దూరమైతి విపుడు ది - క్కేరి నీ కన్నీరు విడిచి - పారమార్థికంబు[6] జూపు - వారి దారి గోరి నడిచి ||దేవా||

3 లోక భ్రమల గూడి యాడ - చీకుపరచు[7] తుదకు మంచి యాకరంబు[8] గూర్పక ప = రాకుచే[9] కాలంబు ముంచి - భీకరాగ్ని బడును నవి - వేక వర్తనంబు ద్రుంచి - పాకు లన్ని మాని త్రి - యేక దేవు ప్రేమ గాంచి ||దేవా||

4 పాప మధికమైన చోట - ప్రభుని కారుణ్యాధికంబు - చూపబడిన సొంపు బాట[10] = జూచి దుస్స్వభావికంబు - నాపు నిను మన్నించును ని - రాశపడక నమ్మకంబు - మోపుగా నీ దేవునందు - జూపుచు మనవే నిరతంబు ||దేవా||

5 పారిశుద్ధ జీవనంబు - గోరి నిత్యానంద మొందు - సారవంతమైన పదవి = సాధించు విశ్వాసమందు - నీరసంబు బడకు నిన్ను - నిర్వహించు[11] ప్రభువే ముందు - భారంబు మోసి యున్నట్టి - వారలం బిల్చె దయ నిండు ||దేవా||

---

1 పరలోకపు రుచి 2 ప్రకాశముగా 3 దుఃఖము 4 పాపములను తలంచి 5 అనుభవించి 6 పరలోక మార్గము 7 దుఃఖపెట్టు 8 రూపము 9 అజాగ్రత్తతో 10 మంచిమార్గము 11 రక్షించు

## విశ్వాసము.

## 127 *True Peace of mind the greatest blessing.*

మనమున నిజమైన నెమ్మదే ముఖ్య భాగ్యము.

రా—సౌరాష్ట్ర. తా—ఆది.

మనసానందము బొందుట కన్నను – మరి యే భాగ్యము గల దన్న = అనుమానము లేక నఖిల[1] సుఖంబులు – విన మొక గడి యొక తీరై యుండును ||మనసానందము||

1 దిటముగ బ్రార్థన యను ఖడ్గము గని[2] – తిరుగు పిశాచము వెరచును గా = పటు దీప్తులు గల ప్రభు శాస్త్రోక్తులు – బహు సంశయ పంకము[3] నింకించును ||మనసానందము||

2 సాధు జనోత్తమ క్రైస్తవ సంగతి[4] – సమకూడిన మేలౌ నన్న = శోధన లన్నిటి స్థిరముగ నోర్చెడి – శుభమతి కన్నను సుఖ మే మున్నది ||మనసానందము||

3 తనువున దానను[5] వానికి పరితము–దగి లెడు విధి గనపలె నన్న = ఒనరగ[6] క్రీస్తుని వధ్య స్తంభము[7] – గని విశ్వాసము గట్టిగ బెంచిన ||మనసానందము||

4 క్షమయును[8] స్నేహము ప్రభు కడ నేర్చిన – శత్రువు లేక భువి లేరన్న = సమ దృష్టి[9] జగజ్జనుల గనుంగొను – సత్క్రైస్తవులకు సాధనములు నగు ||మనసానందము||

5 పరమ దయానిధి క్రీస్తుని బలమున – పాప భరంబులు విడు నన్న = పరిశుద్ధాత్ముని బంధుత్వంబున – నరమర[10] చీకటు లన్నియు దొలగును ||మనసానందము||

---

1 సమస్తమైన 2 చూచి 3 బురద 4 స్నేహము 5 శరీరమే ఆత్మ అనుకొను 6 చక్కని 7 సిలువ మ్రాను 8 ఓర్పుచు 9 పక్షపాతము లేకుండ 10 సందేహము

## 128 *Nearer my God, to Thee.*

ఛాయ. తనువు నిచ్చెదను గైకొనుమీ

రా—మాళవ. తా—ఆది.

ఓ దేవ! నేను నీ – దాపునం దుండెదన్ – నీ దాపునం దుండెదన్ = నా దేవ నను లేపు – నది సిల్వ క్రమ్మైనను – నీ దాపున నుండును – నీ సన్నుతిని పాట ||ఓ దేవ||

1 బాటసారి లాగు – నేను భానుడు[1] గ్రుంకి – మేటి[2] చీకటి గ్రమ్మినన్ = నేటి విశ్రాంతికి – జోలు బండయైనన్ – మాటమాటకి గలలో – సూటిగా నిను దలతు ||నో దేవ||

2 ఆకాశ మండల – మార్గంబు నెప్పుడు – నాకిపు చూపింపుమా = ఏ కార్మ్యచే[3] నాకు – జేకూరు నంతయు – లోకేశ్వరా! దూత – లే కోరి నను బిలువ ||నో దేవ||

3 నీకు స్తోత్రము చేసి – యపుడు నా మదిలోని – వాకిటంబగు నెనరుతో = భీకరంబులైన – శోకంబు[4] లను రాళ్ళన్ – నీకు నాలయంబు – నే గట్టెదను కర్తా ||ఓ దేవ||

4 సంతసంపు రెక్క – లెత్తి నాకమునందు – నెంత పైకి లేచినన్ = వింతగ జ్యోతుల – వితతి[5] మించి నే న – త్యంత మెగసినను[6] నీ – చెంత కేగును బాట ||ఓ దేవ||

---

## 129 *The Author of eternal salvation.*

నిత్యమైన రక్షణకు కారకుడు.

రా—శంకరాభరణము. తా—రూపకము.

శరణు నా యేసు ప్రభువా – నీవెగా – పరలోకమునకు త్రోవ = కరుణతో నన్ను గావ – నీకన్న – గర్త యెవ్వడు యేసువా ||శరణు||

---

1 సూర్యుడు 2 కటిక (గొప్ప) 3 వేగిమువల్ల 4 దుఃఖము 5 నక్షత్రముల గుంపు 6 లేదినప్పటికి

1 పర సుఖము విడిచినావు - కన్య - మరియ గర్భమందు నీవు = ధరణి నుదయించినావు - నీ కన్న - దాత యెవ్వడు యేసువా ॥శరణు॥

2 పాప భారము క్రిందను - బడి యున్న - పాపాత్ములను నెల్లను = చేపట్టి రక్షింపగా - నీ కన్న - శ్రేష్ఠు డెవ్వడు యేసువా ॥శరణు॥

3 మరణమై లేచినావు - జీవింప - మార్గంబు జూపినావు = పర మహిమ మడిచినావు[1] - నీ కన్న ప్రభు వెవ్వడో యేసువా ॥శరణు॥

---

## 130 *Jesus, the sinner's Refuge.*

యేసు పాపికి ఆశ్రయుడు.

రా—శంకరాభరణము. తా—అట.

పాపి కాశ్రయుడవు నీవే - యేసు ॥నీవే॥

1 ఉన్నత లోకము విడిచిన నీవే = కన్నియ గర్భమున బుట్టిన నీవే - యేసు నీవే ॥పాపి॥

2 అజ్ఞాన నాశన బ్రధ్నుడవు[2] నీవే = విజ్ఞాన దాయక[3] పరగురువు నీవే - యేసు నీవే ॥పాపి॥

3 చెదరిన పాపుల వెదకెడు నీవే = చెదరిన గొర్రెల కాపరివి నీవే - యేసు నీవే ॥పాపి॥

4 రోగిష్ఠులను స్వస్థ ప్రదుడవు[4] నీవే = వ్యసనార్తుల[5] యొక్క - మొర విను నీవే - యేసు నీవే ॥పాపి॥

5 నరపుత్రులను నీతి గరపించు నీవే = కరము[6] చాపి కష్టములు ద్రోయు నీవే - యేసు నీవే ॥పాపి॥

6 శాత్రవాంతరమున[7] మృతుడవు నీవే = మైత్రి జూపగ మృత్యువ్యధ తుడవు[8] నీవే - యేసు నీవే ॥పాపి॥

---

1 దాచినావు 2 సూర్యుడవు 3 ఇచ్చునట్టి 4 ఆరోగ్యము నిచ్చువాడవు 5 దుఃఖితుల 6 చేయి 7 దుష్టుల క్రోధముచేత 8 మరణము గెలిచినవాడవు

7 భవదీయ[1] పదకంజ దాసుడ[2] నేనే = భవ మగ్న నేను[3] ముక్తి జేయుము నీవే - యేసు నీవే ||పాపి||

---

## 131 *Jesus our best friend.*

యేసు మన ప్రియ బంధుడు.

రా___ఆహిరి. తా___ఆదిఛాప్.

యేసువంటి ప్రియ బంధుడు నా కిక - నిహపరములలో లేడన్న = భాసురముగ[4] నిజభక్తుల కది యను - భవ గోచర[5] మెప్పు డగు నన్న ||యేసువంటి||

1 ఊరు పేరు పరువులు మురువులు[6] మరి - యూడ గొట్టబడినన్ గాని = కూరిమితో క్రీస్తుడు మా కుండిన - గొమవ రాము గొప్పయు పోము ||యేసువంటి||

2 ఆడికలు[7] తిరస్కారంబులు మా - కవమానము లున్నన్ గాని = తోడు క్రీస్తుడు మాకు నుండిన - దోవ దప్పము వాడిపోము ||యేసువంటి||

3 తగ్గుపాటులును సిగ్గుపాటులును - తల మీదను వ్రాలిన గాని = దగ్గర మా పాలిట ప్రభు వుండన్ - సిగ్గును బొందము తగ్గన గుందము[8] ||యేసువంటి||

4 ఎన్నెన్నో శోధన బాధలు పై - కెగిరి మనల జుట్టిన యప్పుడు = కన్న తండ్రివలె నోదార్చుచు దన - ఘన వాగ్బలమున[9] మనుమును[10] వానిని ||యేసువంటి||

5 మనసు కుంగి బలు చింతలచేతను - మట్టబడిన[11] వేళను మాకు = దన వాగ్దత్తములను చేతుల లే - వనెత్త యెంతో సంతస మొసగును ||యేసువంటి||

6 తల్లిదండ్రులు విడచిన గాని - తాను వదల డెప్పుడు మనల = నెల్ల వేళల విను మన ప్రార్థన - నుల్లసింప జేయున్ మనల ||యేసువంటి||

---

1 నీయొక్క 2 పాదసేవకుడను 3 నిన్ను సేవించు నన్ను 4 నిజముగ 5 తెలియబడినది 6 సొగసులు 7 అపకీర్తులు 8 దుఃఖింపము 9 మాటల బలముచేత 10 ఖండించును 11 అణపబడిన

7 అత డుండని పరమండలము మది - యక్కర కగపడను = క్షితి[1]
నాతడు మా మతిని వసించిన - నతుల్య[2] సౌఖ్యం బదియె మోక్షము
||యేసువంటి||

---

## 131—A. *The name of Jesus sweet.*

యేసు నామము మధురము.

రా—మారువా. తా—అట.

యేసు నామ - మెంతో మధురం - ప్రభు - యేసు నామ - మెంతో మధురం = దోసములు మోసము ని - రాస[3] మొనరించు ప్రభు ||యేసు నామ||

1 స్వాంతమునను[4] - శాంతి నిడును = చింతలను భ్రాంతులను - వింతలుగ ద్రుంచు ప్రభు ||యేసు నామ||

2 నెమ్మి జేయు - కమ్మి వేయు = నమ్మికలు సొమ్ములుగ - ముమ్మరము[5] జేయు ప్రభు ||యేసు నామ||

3 ప్రేమ కరము - క్షేమ కరము = కామ గుణ పామరత - లేమి చేర నీదు ప్రభు ||యేసు నామ||

4 మోక్ష దశకు - సాక్ష్య మొసగు[6] = నక్షయ సురక్షణకు - దక్షత[7] వహించు ప్రభు ||యేసు నామ||

5 శీల మతుల[8] - పాలి వెతల = దూల జన[9] దోలి తన - జాలి కన పరుచు ప్రభు ||యేసు నామ||

6 దారి దప్పి - దాప మొందు = వారిపై కరుణా రస - మేరుగ[10] బారించు ప్రభు ||యేసు నామ||

---

1 భూమి 2 అసమానమైన 3 నాశము 4 మనస్సు 5 అతిశయము 6 ఒప్పును 7 సమర్థత 8 మంచి స్వభావము 9 పడిపోవునట్లు 10 దయారసపు నది

## 132 *Christ's presence sufficient.*

క్రీస్తు తోడై యున్న చాలును.

రా__బిళహరి. తా__ఆది.

నీవు తోడై యున్న జాలు - యేసు - నిత్యము నా కది మేలు = నీవు ధరణి నుండు - నిచ పాపుల నెల్ల - గావ బ్రేమ వచ్చి - నుచ ప్రాణ మిడి నట్టి ॥నీవు॥

1 నిను బోలు రక్షకుం డేడి - క్రీస్తు - నను బోలు పాతకుం డేడి = నిను నమ్మి వారలకు - నీ వొసగుచుందువు - దనర[1] బాపక్షమ - దయ చేత నిల లోన ॥నీవు॥

2 నీ పాటి బలవంతు డేడి - ప్రభు - నా పాటి దుర్బలు డేడి = కాపాడుచుందువు - కల కాలమును నీవు - నీ పాదసేవకుల - నీ నేర్పు రంజిల్ల ॥నీవు॥

3 నీ వంటి యుపకారి యేడి - కర్త - నా వంటి కడు దీను డేడి = జీవులకును గల్గు - జీవంబు లిచ్చుచు - జీవాధారము లొసగి - జీవుల బ్రోచెడి ॥నీవు॥

4 నీ వంటి ధనవంతు డేడి - యేసు - నావంటి ధనహీను డేడి = పోగ్రవు లై[2] యున్నవి - యీవులు నీ యందు - నీవు వాని నొసగి - నిర తంబు నను గావు ॥నీవు॥

---

## 133 *Trusting in Christ.*

క్రీస్తును ఆశ్రయించుట.

రా__శహాన. తా__ఝాప్.

నీ చరణములే[1] నమ్మితి నమ్మితి నమ్మితి = నీ పాదములే - పట్టితి పట్టితి బట్టితి ॥ నీ చరణములే॥

---

1 బాగుగ 2 రాసులై 3 పాదములే

1 దిక్కిక నీవే - చక్కగ రావే = మిక్కిలి - మ్రొక్కుదు మ్రొక్కుదు మ్రొక్కుదు ||నీ చరణములే||

2 ఐహిక[1] సుఖము - నరసితి[2] నిత్య = మహాహా - ద్రోహిని ద్రోహిని ద్రోహిని ||నీ చరణములే||

3 న్యాయము గాని - నా క్రియలన్ని = రోయుచు[3] - ద్రోయుదు ద్రోయుదు ద్రోయుదు ||నీ చరణములే||

4 ధ్యానము మార్చి - నా వెత[4] దీర్చి = దేవర - బ్రోవవే[5] బ్రోవవే బ్రోవవే ||నీ చరణములే||

5 చంచల బుద్ధి - వంచన[6] యెద్ది[7] = యుంచక - త్రుంచవె త్రుంచవె త్రుంచవె ||నీ చరణములే||

6 చుట్టుకొని యున్న - శోధన లున్న = పట్టు విడ - గొట్టవె కొట్టవె కొట్టవె ||నీ చరణములే||

7 నాదు పిశాచి - నరకపుట గాచి = కాచుకో - దాచవె దాచవె దాచవె ||నీ చరణములే||

8 బల మెద లేని[8] - నా పుడె నని = బిలచెద - పల్కవె పల్కవె పల్కవె ||నీ చరణములే||

9 నీరసుడ నంచు - నీ దయ నుంచు = దరికి - జేరితి జేరితి జేరితి ||నీ చరణములే||

10 కరుణ దలంచి - శిర మిదె వంచి = శరణని - దూరితి దూరితి దూరితి ||నీ చరణములే||

11 నేరము బాప - గూరిమి జూప = సారెకు - గోరితి గోరితి గోరితి ||నీ చరణములే||

1 భూలోక 2 వెతకితిని 3 అసహ్యించుకొనుచు 4 కష్టము 5 రక్షింపవే 6 మోసము 7 ఏదియు 8 హృదయములో బలములేని

12 నీచుల బిల్చి - నిర్భయ మిచ్చి = నీ చెయి - దాచకు దాచకు దాచకు ||నీ చరణములే||

18 వాడుక నున్న - నరకృప యెన్న[1] = నే డది - చూపవె చూపవె చూపవె ||నీ చరణములే||

14 యేసుని తోడి - యెవ్వరు సాటి = దోసము - బాపును బాపును బాపును ||నీ చరణములే||

15 నిస్తుల[2] ప్రేమ - క్రీస్తుని నామ = ప్రస్తుతి - సేయరె చేయరె చేయరె ||నీ చరణములే||

---

## 134 *Taking Refuge in Christ.*

క్రీస్తుని ఆశ్రయించుట.

రా—మధ్యమావతి. తా—ఆది.

యేసు కరుణ - దాసుల శరణ - యేసు కరుణ = యేసుని కరుణ - యిదె నాకు శర ణని - యాసతో వచ్చితి - యేసు కడ కిపుడు ||యేసు కరుణ||

1 పాప భారము చేత - బాధింపబడు వాడ - నీ పాదమును బట్టి - నిజము వచ్చితిని ||యేసు కరుణ||

2 ఉన్న పాటున వచ్చు - చున్న వాడను నన్ను - మన్నింప నీ కంటె - మరి యెవరు లేరే ||యేసు కరుణ||

3 వీక[3] జెడి నమ్మి - చీకాకు[4] నొందుచు - నేకాకి నైతిని - నా కీవే శరణు ||యేసు కరుణ||

4 ముష్కరుడన్[5] పాప - మోహాంధ కారుడ - దుష్కర చిత్తుడ - ద్రోహుడ నాహా ||యేసు కరుణ||

5 కల్లోలమును[6] బోలి - తల్లడిల్లెడు నాదు - ఉల్లములో[7] భీతి - నెల్ల హరింపు ||యేసు కరుణ||

---

1 తలంచుటకు 2 సాటిలేని 3 ధైర్యము 4 శ్రమము 5 మూర్ఖుడను 6 పెద్ద అల 7 మనస్సులో

6 మరణపు జంఝా - మారుతమున[1] జిక్కి - కరుణాబ్ధి[2] నే నీ - కడ కేగు దెంచితి ||యేసు కరుణ||

---

## 135 *Christ will never leave nor forsake.*

క్రీస్తు ఎన్నటికి విడిచి పెట్టువాడు కాదు.

రా—సావేరి. తా—ఆది.

ఎందుకే చింతించెదవు నా - డెందమా నీకందమా = ఇందాక రక్షించెడు వాడు - ఇకను నిన్ను విడువబోడు ||ఎందుకే||

1 తొల్లి నీ వొనరించినట్టి - దోష మెంతో యరసి[3] చూడు - చెల్ల చెదరై పరచు[4] తరిని - చెయ్యి చాపి పట్టినాడు - అల్లుకొనిన నీ దుర్గుణము-లణగద్రొక్కి వేసినాడు - తల్లడిల్ల జేయు నీ శా - త్రవుల[5] దరిమి బోఁచినాడు = ఎల్ల గాదన్నాడా నేడు - వద్దు సందేహములు వీడు ||ఎందుకే||

2 తల యెత్త రాని చోట - గళల నిచ్చి నిలిపినాడు - పలుమారు నీ యక్కరలు - తెలిపి యందిచ్చియున్నాడు - బలహీన మపుడు నీకు ని - ర్భయమియ్య వచ్చెడువాడు - పలువిధంబు లగు బాధల - బారదోలి వేసినాడు = వెళి విప్పుడు లేదన్నాడా - నీతో నిక సరి యన్నాడ ||ఎందుకే||

3 ఒక్క నీ తలవెంట్రుకయైన - నూడి పడదని చెప్పెడు వాడు - దిక్కు నీ కిక నేనే యని తన - దివ్య వాక్కుల వెలిపెడు వాడు - చిక్కులను బెట్టెడు పగవారి - చేత నిను జిక్కింపనివాడు - ఇక్కట్టు మెట్టుల దాటించుట - కిదిగో యని చెయి యిచ్చెడు వాడు = హక్కు లేదన్నాడ నేడు - అతడు నిను వెలివేయబోడు ||ఎందుకే||

4 యేసు తన రక్తముతో నిన్ను - నెంచి ముందే గొనుకొన్నాడు - దోసములు వెడలించు విమలా - త్ముండు[6] నీ సాక్షిగ నున్నాడు - ఆశతో నీవు గొలిచెడు తండ్రి - యంతటం గాపై యున్నాడు - నీ

---

1 గాలివానలో 2 దయాసముద్రుడ 3 ఆలోచించి 4 పారిపోవు 5 విరోధులను 6 పరిశుద్ధాత్ముడు

సురక్షణ జేయు వారు - నిను జుట్టియున్నా రెల్లపుడు = భాసుర పరలో కానందము - బాగుగా గనపడుచు నున్నది ||ఎందుకె||

## 136 *God being ours we shall not want.*

దేవుడు మన వాడై యుండగా మనకు కొదువ లేదు.

రా__నవరోజు. తా__ఆది.

యెహోవా మా తండ్రి గాద - యేసుడు మా యన్న గాద = మహిమ గల శుద్ధాత్మ యిట్టి-వరుస[1] గలిపెం గద మాతోడ ||యెహోవా||

1 మోక్ష నగరి మా పుట్టిల్లు - ముఖ్య దూతల్ మా స్నేహితులు = సాక్షాత్కారమై యున్నపుడు[2] - లక్ష్య పెట్ట మిహ బాధలను ||యెహోవా||

2 అబ్రాహాము దావీదు మొదలై - నట్టి వర భక్తాగ్రేసరులే[3] = శుభ్రముగ[4] మా చుట్టాలైనన్-సుఖము లిక మా కేమి కొదువ ||యెహోవా||

3 పేతు రాది సకలాపొస్తుల్ - పేర్మిగల మా నిజ కుటుంబుల్[5] = ఖ్యాత[6] సభలో మే మున్నపుడు - ప్రీతి మా కిం కేమి వెలితి ||యెహోవా||

4 తనువు బలి బెట్టెను మా యన్న - తప్పు ల్మాఫ గొట్టెను మా తండ్రి = మనసులో సాక్ష్య మిట్లున్న - మనుజు లెట్లున్నను మా కేమి ||యెహోవా||

5 పరమ విభు జీవ గ్రంథములో - ప్రభుని రక్తాక్షర ముద్రితమై = చిరముగా నుండు మా పేరు - చెరుపు బెట్టెడు వారిం కెవరు ||యెహోవా||

6 కరములతో[7] నంట రాని - కన్నులకు గోచరము గాని = పరమ ఫలము మా కున్నపుడు - సరకుగొన[8] మిక్కడి లేములను[9] ||యెహోవా||

---

1 బంధుత్వము 2 కంటికి కనుపడుచుండగా 3 భక్తులలో శ్రేష్ఠులే 4 పూర్తిగా 5 స్వంత సంఘస్థులు 6 ప్రసిద్ధి కెక్కిన 7 చేతులతో 8 లెక్క చేయము 9 కొరతలను

## 137 *Peace from Trust.*

విశ్వాసము యొక్క నెమ్మది.

రా—మాగువా. తా—అట.

సందియము వీడవె - నా మనసా యా - నందమున గూడవె = సంది
యము లింకేల నిను సుఖ - మొంద చేసెడు క్రీస్తు రక్తపు - బిందువులు
సువిశేష వాక్యము - లందు గని తెలి వొంది బ్రతుకుచు ||సందియము||

1 చింత యిక మానుము - లోకులు జెల్పు - భ్రాంతుల్[1] బడ
బోకుము = ఎంత వింత మరంత[2] పాపము - లంతటను దన రక్తమునను
గొ-రంత[3] లేకను మడుచు నని సిద్ధాంత మగు[4] ప్రభు వాక్యముల్
విని ||సందియము||

2 పాపములు వీడుము - నీ విక పశ్చా - త్తాపమున గూడుము =
ఏపుమీరిన[5] యోర్పుతో నొక - పాపికైన లయంబు[6] గోరక - పాపు
లందఱు దిరిగి వచ్చెడు - కోపు గోరెను కర్త వరి జని ||సందియము||

3 నేరముల నెంచుకో - యేసుని కరుణా - సారము దలంచుకో =
భారముల్ మోయుచు శ్రమల్ బడు - వార లందరు నమ్మి నా దరి - జేర
విశ్రమ మిత్తు నను ప్రభు - సార వాక్యములు చక్కగా విని ||సందియము||

4 నిమ్మళము నొందుము - రక్షకుని పలుకు - నమ్ముకొని యుండుము =
ఇమ్మహిని[7] పాపులకునై ప-క్షమ్ము జేసి[8] పరాత్పరుని సము - ఖమ్ము నం
గుచితమ్ముగా కా - యమ్ము[9] నొసగెడు నీ ప్రభుని గని ||సందియము||

5 ప్రేమ దయ శాంతముల్ - కర్తను భూషా[10] - స్తోమము[11] లనం
తముల్[12] = నీ మొర ల్విని యేసు నాథ - స్వామి తన రక్తమున బాపము -
దోమి[13] నిన్నకళంకి[14] జేయును - నీ మదిన్ దగ[15] నమ్ముకొని యిక
||సందియము||

---

1 మాయలు 2 భయంకరమైన 3 లేమి 4 సత్యమగు 5 మహాగొప్ప 6 నాశనము 7 ఈ లోకములో 8 అనుగ్రహించి 9 శరీరమును 10 అలంకార 11 సమూహము 12 విస్తారములు 13 శుభ్రముచేసి 14 పవిత్రునిగా 15 గట్టిగ

## 138 *What shall I render unto the Lord ?*

ప్రభువు కేమి చెల్లింప గలను?

రా—ఆనంద భైరవి. తా—అట.

ఏమి నేను సమర్పింతు – యేసూ – ఎట్లు నిన్ను స్తుతియింతు – నేమి సమర్పింతు – హీనుడ నగు నేను – గామితార్థము లెల్ల[1] – గలుగ జేయు నీకు ‖నేమి‖

1 నేను మార్గము దప్పి యుండగ – నన్ను – నీవు గంటివి కరుణ నిండగ – దీన పాపులను – దృఢముగ బ్రోవను – దాన మిచ్చితివి – దనర నీ ప్రాణము ‖ఏమి‖

2 అందరి కొరకు నీవు దెచ్చిన – మిగుల – నందమైన నిత్య రక్షణ – మంది[2] నిన్ను వినుతి – పొందుగ జేసెద – నొందు మట్టి నుతి – యుత్తమ ప్రభువు ‖ఏమి‖

3 నీయందే యానంద మొందగ – యేసు – నీదైన యాత్మ నా కందగ – చేయు మంచు నిన్ను – జేసెద ప్రార్థన – నాయందు దయచేసి – నా మనవి నాలింపు ‖నేమి‖

4 నేను జేసిన యఘము లెల్లను[3] – కర్త – నీ యెదుట దలంచుకొం దును – నేను సిగ్గు నొంది – నిజముగ గుందుచు[4] – నేను వేడుకొందు – నీ క్షమాపణ కొరకు ‖నేమి‖

5 నన్ను నీవు స్థిరపరచుము – కర్త – యన్నిట నను బలపరచుము – తిన్నని మార్గమున – దృఢముగ నేగుచు[5] – నిన్ను నే స్తుతియింతు – నిండుగ నెప్పుడు ‖ఏమి‖

---

1 కోరబడిన వన్ని 2 తీసికొని 3 దోషము లన్నియు 4 దుఃఖించుచు 5 పోవుచు

# ప్రేమ, సహవాసము.

## 139 *We cannot live without Christ.*

యేసుని విడచి బ్రతుక లేము.

రా—ముఖారి. తా—ఆది.

నిన్నెడబాసి యొక – నిమిషంబు నే బ్రతుకజాల – నిన్న నే డేక రీతి – నున్న నా యేసు ప్రభువా ॥నిన్నె॥

1 మున్నీటిలో[1] బడి – మునుగనై వేడిన పేతు – రన్న శిష్యుని గాచిన నీ – హస్తము నందించు ప్రభువా = ఎన్నతరము గా – కున్న శోధనసు – మున్నీటను బడి – నిన్ను వేడితిని ॥నిన్నె॥

2 నిన్ను దప్పక చూచు – చున్న సమయమున మునుగ – కున్న విశ్వాసంపు గురి విడి – యున్న వానిని బోలియుంటి = ఎన్నడు నీ మహి – మోన్నత పురమున – కన్నులార నే – నిన్ను జూచెదను ॥నిన్నె॥

3 చిన్నరికంబు[2] నుండి – ఎన్ని యపాయములలో – నన్ను గాపాడినావో – సన్నుతి సన్నుతి ప్రభువా = చిన్న కుమారుని[3] – తెన్ను[4] బట్టిరి నా – కున్న జ్ఞానమును – భిన్నము చేసితి ॥నిన్నె॥

4 అన్నువగు[6] విశ్వాసపు – చిన్నెను[7] గద్దించి యతని – మున్ను బలపరచి నట్లు – నన్ను బలపరచ వయ్యా = తిన్నని మార్గము – లెన్ని ! నడచి నీ – సన్నిధానమున – నున్నటు లుండెద ॥నిన్నె॥

---

## 140 *Delighting in Christ.*

క్రీస్తునందు ఆనందించుట

రా—అసావేరి. తా—అట.

మా యేసు క్రీస్తుని – మరుగు గల్గెనురా = నా యాత్మ ఘనరక్షా – నగము[8] నెక్కెనురా ॥మా యేసు॥

---

1 సముద్రములో 2 చిన్నతనము 3 తప్పిపోయిన కుమారుని 4 మార్గము 5 వలె 6 బలహీనమగు 7 గుర్తును 8 కొండ (దక్షిణ పూర్వముగ దొరికినది)

1 ముందు నాలోని పాప - ములు జూడబడెరా - దండము తో నన్ని - టిని నొప్పు కొనెరా = అందుకై బలు సుఖ - మాత్మ జెందెనురా - సందేహములు వీడు - జాడ గన్గొనెరా ॥మా యేసు॥

2 సువిశేష బోధ నా - చెవు లాలించెనురా - యవివేక శాస్త్ర - లంటు వీడెనురా = నవ[1] సత్క్రైస్తవ గోష్ఠి[2] - భువి నా కబ్బెనురా - వివిధములగు వేల్పు - ల్విషమైరి గదరా ॥మా యేసు॥

3 రాగ ద్వేషముల[3] సం - భ్రమ మెల్ల జెడెరా - మూగి బొమ్మలు పాప - ముల ద్రొక్క బడెరా = యోగ మార్గము లన్ని - యోటికుండ లురా - సాగు[4] పాపపు బుద్ధి - చతికిల బడెరా ॥మా యేసు॥

4 బాధ గురువుల మోము - ల్బహు లజ్జ[5] బడెరా - గాఢ[6] మంత్ర ములన్ని - కడగండ్లయి[7] చెడెరా = శోధించి నా యాత్మ - శుద్ధి గొరె నురా - సాధించి ప్రభు క్రీస్తు - శరణు జొచ్చెనురా ॥మా యేసు॥

5 మతిలోని లోతు మ - ర్మము గాన బడెరా - మితిలేని ఘనపాప - మే నిండు కొనెరా = హితముగ తన జీవ - మిచ్చె క్రీస్తుడురా - మృతిచేత మన పాప - వితతి[8] గొట్టెనురా ॥మా యేసు॥

6 కులగోత్రముల బుద్ధి - కుటిలంబు[9] చెగెరా - బలవత్పిశాచ శృం - ఖలము[10] విరిగెనురా = సిలువ మోసిన వాని - చిరసౌఖ్యోన్నతిరా - నెలవుగ[11] నాలోన - నిలిచి యున్నదిరా ॥మా యేసు॥

7 తన పోల్కె నొరుల గ - న్గొన ప్రేమయ్యెనురా - మనసు దేవు నికి న - ర్పణ సేయబడెరా = ఘనకృప శాంతులు - గొనెను నెమ్మదిరా - మనసు మార్పడి మోక్ష - మహిమ గన్గొనెరా ॥మా యేసు॥

---

1 క్రొత్త 2 సహవాసము 3 కామక్రోధముల 4 విస్తరించు 5 సిగ్గు 6 వట్టి 7 బాధకరములై 8 సమూహము 9 చెడ్డబుద్ధులు 10 సంకెల 11 స్థానముగ

# క్రీస్తును వెంబడించుట.

## 141 *Resolution to serve Christ.*

క్రీస్తుని సేవకు తీర్మానించు కొనుట.

రా__బేహాగ్. తా__రూపకము.

యేసు భక్తవరులతో ని - వాస ముందము _ యేసు దాసు లౌదము ||యేసు భక్త||

1 దోసములను తీగ లన్ని _ గోసి వేతము - మిగుల - మోసపుచ్చు నాస లెల్ల - ద్రోసి వేతము - యేసు-దాసు లౌదము ||యేసు భక్త||

2 దోసి లొగ్గి ప్రభుని వేడ-గాసి[1] పడుదము - వాసిగాను - యేసు మీద-నాస పడుదము - యేసు-దాసు లౌదము ||యేసు భక్త||

3 జార చోర దుష్కృతములు - పారవేతము - సత్య - సార మెరుగ బరమ గురుని _ జేరుకొందము - యిక - గోరుకొందము ||యేసు భక్త||

4 ప్రాపు[2] లేని వారి కెల్ల _ దా ప్రాపగును _ యేసు - శాప రాసు లన్ని తా నే - యోపి మోసెను - తండ్రి - దా ప్రాపగును ||యేసు భక్త||

5 శరణు జొచ్చు నందరకును - దురిత మెంచక - ఘోర - మరణ బాధ లెల్ల దీర్చి - పర మొసంగును - స్థిర - పరము లిచ్చును ||యేసు భక్త||

6 లోక భోగముల మది న్ని - రాకరింతము - ప్రభు - రాక కెదురు జూడగ మన _ మేక మౌదము - ఇపుడె _ యేక మౌదము ||యేసు భక్త||

---

## 142 *Christian experience and practice.*

క్రైస్త వానుభవాభ్యాసములు.

రా__శంకరాభరణము. తా__అట.

యేసు నామం బెత్తి _ పాడుదము = క్రీస్తు _ దాసులతో బొత్తు[3]_ గూడుదము ||యేసు నామం||

---

1 బాధ 2 దిక్కు 3 స్నేహము

1 ఇహ సంబంధుల పొందు[1] - జాలింతము = మహా - మహుండౌ దేవుని యాజ్ఞ - బాలింతము[2] ||యేసు నామం||

2 సువిశేషార్థము లన్ని - శోధింతమా = యను - భవ మాత్మ గొను దాక - సాధింతము ||యేసు నామం||

3 దోషములను బైట - బెట్టుదము = కపట - వేష భాషల గుంగ - బట్టుదము[3] ||యేసు నామం||

4 మన రక్షకుని పొట్లు[4] - మది నెంతము = మన - మనసు లోపలి గర్వ - మణుపుదము ||యేసు నామం||

5 జనుల నిందల కెల్ల - నోర్చెదము = బోధ - కని పెట్టి ప్రభు చెంత - నేర్చెదము ||యేసు నామం||

6 మానాపమానముల్[5] - భరియింతము = యోర్వ - లేని గుణముల వేరు - బెరుకుదము ||యేసు నామం||

7 పరిశుద్ధాత్మను బొంద - నడుగుదము = బుద్ధి - పరమానందము జాడ - నడుపుదము ||యేసు నామం||

8 సకల మానవు లాత్మ - సరి జూతము = యింక - మొక మిచ్చకపు మాట - విడిచెదము ||యేసు నామం||

9 దినము ప్రార్థన జేయ - గురి యుంతము = చెడ్డ - మనసు బద్ధకము పై - నెదిరింతము ||యేసు నామం||

10 గురు బోధ సలిల[6] బిర - బిర బోదము = బుద్ధి - తిర మంచి వాక్యార్థ - మెరుగుదము ||యేసు నామం||

11 మనసు లొక్కటి జేసి - ప్రార్థింతము = తండ్రి - కనికర మగు భాగ్య - మర్థింతము[7] ||యేసు నామం||

---

1 స్నేహము 2 కాపాడుదము 3 అణగ ద్రొక్కుదము 4 శ్రమలు 5 మర్యాదలు అమర్యాదలు 6 గ్రలముకు 7 యాచింతము

12 ఒకరి తప్పొకరు - క్షమించెదము = చిత్త - మకళంకము[1] గను - బ్రేమించెదము ॥యేసు నామం॥

13 ఎప్పు డితరుల మేలు - భావింతము = మనల - శపియించు పగ వారి - దీవింతము ॥యేసు నామం॥

14 ఇతరుల మన పోల్కె - స్నేహింతము = క్రీస్తు - మతసార మిది యని - యూహింతము ॥యేసు నామం॥

15 ఘనుడైన దేవుని - దలచెదము = మనము - మనసార ప్రేమను - సలుపుదము[2] ॥యేసు నామం॥

16 మంచి మానసు సాక్ష్య - మాశింతము = దాని - బెంచి భక్తులలో బ్రి - కాశింతము ॥యేసు నామం॥

17 దిటమైన విశ్వాస - మున నిల్తము = వహ్ని[3] - బుటము బెట్టిన ధైర్య - మతి దాల్తము[4] ॥యేసు నామం॥

18 ధర నున్న న్నాళ్లు సె - మ్మది గొందము = మన-మరణ కాలము క్రీస్తు - దరి నుందము ॥యేసు నామం॥

---

## 143 *Christian Comfort.*

క్రైస్తవాదరణము

రా—ముఖారి. తా—చాప్.

భయము నొందకుము - క్రైస్తవ సోదర యింక - భయము నొందకుము = భయము నొందకుము హృ - దయ వాసు డగు క్రీస్తు - దయ నీ తలపు లెల్ల - రయముగ[5] నెరవేర్చు ॥భయము॥

1 దీవింపబడెదు - జగమున కిరుకా - తోవ జను నపుడు = భావ జ్ఞానము వీడ - భయపు జీకటి గూడు - గావున మది యేసు - భావింప గతి జేర్చు ॥భయము॥

---

1 నిర్మలముగ 2 చేయుదము 3 అగ్నియందు 4 నిలుపుదము 5 శీఘ్రముగ

2 నీ యాత్మ జూచి - కయ్యము[1] జేయ - డాయు[2] పిశాచి = యా యుద్ధమున ప్రత్య - యమ్మనెడు డాల్పట్టి - నా యెడ క్రీస్తు సహాయుడై గెల్పించు ||భయము||

3 జగము నిన్బట్టి - వెన్కకు నీడ్చి - పగ దీర గట్టి = యెగతాళి గావించు[3] - పెరిగి క్రీస్తుని సిల్వ - దగ[4] బట్టు మప్పుడు నీ - వగ[5] మాన్పి విడిపించు ||భయము||

4 కలుష[6] జాలంబు[7] - మాయా కీట - కముల[8] జాలంబు[9] = గల బావి నీ యాత్మ - గలియకుండగ యేసు - దలపు మప్పుడు నిం జే - తం బట్టి గాపాడు ||భయము||

5 శ్రమ దండనముల[10] శిశు శిక్షించు - జనకు విధముల = సమకూర్చు నీ దేవు - డమిత ప్రేమను గాంచి - యమలహా[11] మతి నోర్చు - మప్పుడు మే లిడు నీకు ||భయము||

6 కన నీదు చటుల[12] - మఃఖాదు లె - ట్లను వీడు నటుల = గొన[13] దినమున న్యాయ - మును దీర్పగా క్రీస్తు - చనుదెంచి[14] నిత్య జీ - వన కిరీటము నిచ్చు ||భయము||

---

## 144 *Forsaking the World.*

లోకమును త్యజించుట.

రా—బిళహరి. తా—త్రిపుట.

పోపొమ్ము ఓ లోకమా - చాలిక చాలు - నీ పొందు[15] మే మొల్లము[16] = పాపేచ్ఛ లున్నంత - సేపు నోపగ రాని - వేసాట్లు బెట్టితి - వీపట్లు నను వీడి ||పోపొమ్ము||

---

1 యుద్ధము 2 సమీపించు 3 చేయుట 4 గట్టిగ 5 దుఃఖము 6 పాప 7 సమూహంబు 8 పురుగుల 9 గుంపు 10 శిక్ష 11 పవిత్రమైన 12 చంచలమైన 13 అంత్య 14 వచ్చి 15 స్నేహము 16 ఇష్టపడము

1 సకలేంద్రియ[1] వ్యాపృతులు[2] - నీ సేవ బా-యక చయ దివ సౌఖ్యము[4] = లిక దీరి పోయె భ్రా - మికము జూపకు మిపుడు - ప్రకటముగా క్రీస్తు - పద భక్తి మా కబ్బె ॥పో పొమ్ము॥

2 నీ రాజు బహుమానము - గంటిమి ఘోర - నర కాంబుధి[5] తీరము = దారి దొలగి నిన్ను - జేరి దుఃఖముల వే - సారి[6] తిప్పుడు క్రీస్తు - సదయుడై నను బిల్చె ॥పో పొమ్ము॥

3 ఎర[7] జూపి బలు మీనము[8] - బట్టెడు వాని - కరణి[9] వస్తుల రూపము = బోరి[10] జూపి లోభము - బుట్టించి నను బట్టె - బరిమార్చితివి[11] యింక - మరి యేమున్నది చాలు ॥పో పొమ్ము॥

4 ఎండమావుల తేటలు - నీ విచ్చెడు - దండైన యిహ సుఖములు = కండ గర్వముచే నీ-యండ జేరితిగాని - నిండు నెమ్మది దయా - నిధి క్రీస్తు డిపు డిచ్చు ॥పో పొమ్ము॥

---

## 145 *Vanity of the world.*

లోకసౌఖ్యములు నిష్ఫలములు.

రా—పున్నాగ. తా—అట.

చాలును లోక భోగములు - చాలును చాలును మీనమును[12] బట్టు - గాలమై యున్న భోగములు ॥చాలును॥

1 ఎండమావులే నీ రనుచు - మెండుగ బరుగిడు జింక కుప - ముండనై[13] బలహీన మయితి ॥చాలును॥

2 బూరుగ పండారగింప - గోరి కాచికొని యున్నట్టి - కీర సామ్యమైతి[14] నయ్యో ॥చాలును॥

3 దీపపు దీప్తి[15] నాశించి - యూపిరి విడు బుఱుగు రీతి - బాపపు భ్రమచే నట్లయితి ॥చాలును॥

---

1 సమస్త అవయవముల 2 పనులు 3 వదలక 4 దినములయొక్క సమూహము 5 సముద్రము 6 విసికితిని 7 ఆహారమును 8 పెద్ద చేప 9 విధమున 10 విస్తారము 11 చంపితివి 12 చేపను 13 పోలిక గలవాడనై 14 చిలుక వలెనే 15 కాంతి

4 పూలతోటయందు బెరుగు - బూరుగ వృక్షంబునై నే - మేలు
నకు మూలము గానైతి ||చాలును||

5 చల్లిన విత్తనము ల్లంపు - చోట భూమి వలె నే గాగ - సత్యము
నిష్ఫల మయ్యె కట ||చాలును||

6 మాయ సంత నైతి యేసు - నాయక నన్విడక మార్పు - జేయుమి
నెన రుంచి[1] నాపై ||చాలును||

7 తొల్లి నన్[2] రప్పించినట్టి - చల్లని సువార్త తేజ - ముల్లమందు[3]
నుండ జేయు ||చాలును||

8 మంచు పోల్కె నను జేయుటకై - ముంచు మీ రక్తాంబుధిలో[4] -
బెంచుమి నీ వాక్సారముచే ||చాలును||

9 చెడ్డ బిడ్డ నయ్య నేను - దొడ్డ రక్షకుండ వీవు - అడ్డి లేక[5] నన్ను
బ్రోవు ||చాలును||

---

## మెలకువయు, పరిశుద్ధతయు.

## 146 *My soul be on thy guard.*

చాయ: యేసు క్రీస్తుని గొల్వరన్న.

రా—ఆహిరి. తా—ఆది.

నా యాత్మ! లెమ్మి! సిద్ధము కమ్మి - నారాజి[6] బూని - పో
యక బోరవలెను[7] నిజమ్మి = వేయి శరంబుల[8] నేయుచు శత్రువ -
మేయత నిను పడ - ద్రోయ దెగించెను ||నా యాత్మ||

1 వేచి ప్రార్థించి యుద్ధము సలుపు[9] - వీరాకృతి బోరుమ - వే
జయము కలుగునని యెంచకుము = ఏచుచు ప్రతి దిన - మేసట బోరుచు -
యాచించి గురు స - హాయము బొందుము ||నా యాత్మ||

---

1 దయ యుంచి 2 మొదట నన్ను 3 హృదయమునందు 4 రక్త సముద్రములో
5 ఆటంకము లేక 6 కత్తి 7 యుద్ధము చేయవలెను 8 అంబుల 9 చేయుము

2 జయము నొందితి నని తలపకుము – సౌఖ్యమునకై స = మయ మపేక్షించి[1] కూర్చుండకుము = నియమిత మకుటము – నీ వొందు వరకు – నిర్భర యుద్ధము – నిలువను నమ్ముము ॥నా యాత్మ॥

3 పోరు పోరాడు నిన్ను మరణము – నీ దేవు నొద్ద – జేరుచు దనుక వీడకు రణము = శ్రీరమ్యుని[2] ది – వ్యారామంబున[3] – జేరి సుఖింపగ – జేకొని నిను విను ॥నా యాత్మ॥

---

# 146 - A.

## సమర్పణ.

ఛాయ : కరుణ సాగర పరమ జనకుడ

దీవనల నిడు దేవా నీదు – సేవకై వెడలెదు దీనులపై – పావనాత్మ నంపుము – పనులలో నడ్పింపుము = కేవలంబుగ మా తనువులు నీ – సేవకై యర్పింపగ జేయుము ॥దీవనల॥

1 మాటి మాటికి బాప యుతంబౌ – మార్గమున జను మనసుల ద్రుంచి – మేటి క్రీస్తుని నామా – మృతము గోరిలుచు నే యెడల = పాటుపడి యాత్మల రక్షణకై – పనులు సల్పగ బంపుము కృపచే ॥దీవనల॥

2 దివ్యజ్ఞాన మెదను గల్గి – దీనతను రక్షణ మార్గమును – భవ్యముగ బోధింప పరమార్థ మెఱిగింప = సేవ్య ! నేర్పవె దినదినమును నీ – సేవ కాళికి నీ మర్మముల ॥దీవనల॥

3 దురిత రోగాదులచే మిగుల – దూలి చను మనుజాళికి నీవే – పరమ విశ్రాంతి నిడు – వరదుడ వంచు కడు = వెరవునను బోధింపంగను నీ – వరములను నింపుము దాసులను ॥దీవనల॥

---

1 కోరి 2 మిక్కిలి మనోహరుని 3 సుందరమైన తోటలో

4 గొర్రెమందల సంఘంబుల బిడ్డల - క్షేమముగ గాపాడి పెంపు - ఓ మహాత్మా నీ కృప - తో మమ్ము గాచి సదా = స్వామి మాలో నీవును నీలో - మేము మనగను బ్రోవుము ఆమేన్ ॥దీవనల॥

---

## 147 *Take my life and let it be.*

దాయ: యేసు నాయకుడ - ఏ వేళను నీ - దాసుల నేలుమయ్యా.

రా—యదుకుల కాంభోజి. తా—ఆది.

తనువు[1]నాదిదిగో గై - కొనుమీ యో ప్రభువా నీ-పనికి ప్రతిష్ఠింపుమీ = దినములు క్షణములు - దీసికొని యవి నీదు - వినుతిన్[2] ప్రవహింపజే - యను శక్తి నీయుమీ ॥తనువు॥

1 ఘనమైన నీ ప్రేమ - కారణంబున నీకై - పనిచేయ జేతు లివిగో = అనయంబు నీ విషయ - మై సొగసుగా చురుకు - దనముతో బరుగెత్త - వినయ పాదము లివిగో ॥తనువు॥

2 స్వర మిదిగో కొనుమీ - వరరాజ నిను గూర్చి - నిరతమ్ము పాడ నిమ్ము = మరియు పెదవు లివిగో - మహనీయమైన నీ-పరిశుద్ధ వార్తతో - పరిపూర్ణముగ నింపు ॥తనువు॥

3 వెండి పసిడి[3] యివిగో - వీసమైనను[4] నాకై - యుండవలెనని కోరను = నిండైన నీ యిష్ట-నియమంబు చొప్పున - మెండుగ వాడ బరి-మితియగు[5] జ్ఞానం బిదిగో ॥తనువు॥

4 నా యిష్ట మిదిగో యిది-నీ యిష్టముగ జేయ - నా యిష్ట మిక కాదది=నా యిచ్ఛ యున్నట్టి-నా హృదయ మిదిగో నీ-కే యయ్యది రాజ - కీయ[6] సింహాసనమా ॥తనువు॥

---

1 ప్రాణము; శరీరము 2 మహిమను 3 బంగారము 4 కొంచెమైనను 5 సామాన్యమైన 6 ప్రభుత్వ సంబంధమైన

5 ఉన్న నా ప్రేమ నీ-సన్నిధానమున నే-నెన్నడు ధార బోయన్ = నన్ను నీ వానిగ - నాధా[1] గైకొను మపుడు - చెన్నుగ[2] నీ వశమై - స్థిర ముగ నుండెద ॥తనువు॥

---

## 147 - A *Consecration Hymn.*

రా—దర్బారు కన్నడ. తా—ఏక.

శ్రీకర శుభకర - శేఖర - త్రైకర - యే కరణి[3] గొనియాడెదము = నీ కరుణా మృత వృష్టిని గ్రోలితి[4] - మో కరుణానిధి పాడెదము ॥శ్రీకర॥

1 బహుజన లభ్యము కాని వరంబుల[5] - ప్రమద[6] తరుణముల బడ సితిమి = మహిత యశంబుల మండిత శక్తుల - మహిగను పథముల నరసితిమి ॥శ్రీకర॥

2 ప్రవిమల[7] వాక్య ప్రకాశము లరిమురి[8] - ప్రబలముగ బ్రిచురించె దము = అవిరతమును[9] నిన్నర్మిలి[10] డెందము - లలరగ భువి భజియించె దము ॥శ్రీకర॥

3 దురిత భరిత సంకలిత జనంబుల[11] - నిరతిని[12] శోభిల జేసెదము = పరమ వినోదము పృధుల సునాదము[13] - లిరవుగ హృది గన నోచె దము ॥శ్రీకర॥

4 ఇమ్ముగ నీ చరణారవిందముల[14] - సొమ్ముగ[15] శిరముల నుంచె దము = ఇమ్ముల దనువుల[16] నసువుల[17] సకలము - నెపుడు నీకు నర్పించె దము ॥శ్రీకర॥

5 బంధు మిత్ర పరివార వర్గముల - పొందున నిను సేవించెదము = డెందము లలరగ దివ్య వినోదము-నందుచు నిను బూజించెదము ॥శ్రీకర॥

---

1 ప్రభువా 2 బాగుగ 3 ఏ విధముగ 4 నీ దయ అనెడు అమృతమును త్రాగితిమి 5 అనేకులకు దొరకని మేళ్లను 6 సంతోష మిచ్చు 7 పరిశుద్ధ 8 ప్రేమతో 9 ఎల్లప్పుడు 10 ప్రేమతో 11 పాపముతో నిండిన వారిని 12 ఆసక్తితో 13 విస్తారమగు మంచి స్వరము 14 నీ పాద పద్మములను 15 అలంకారము వలె 16 శరీరములను 17 ప్రాణములను

6 నీతి శక్తి ప్రశాంత జీవముల-నే తరి[1] మీరి వెలింగెదము=ప్రీతిని మోక్షపు రాజ్యము నుర్వర[2] - ఖ్యాతిగ గట్టి చెలంగెదము ॥శ్రీకర॥

7 ధరణీతలి ఘన భరమును[3] దీర్పగ - వరమయి నిరతము గ్రాలెదము[4]=సురచిర మోక్షా పుర మందిరముల - శోభ లీనుచును నేలెదము ॥శ్రీకర॥

8 సర్వ జనంబుల సమ్మతి గాంచుచు - సత్య సౌఖ్యముల గొలిపెదము = ఉర్వర వర దయా కరమగు వాక్యము - నొప్పుగ వ్యాపన సలిపెదము ॥శ్రీకర॥

9 జనక సునందన పరిశుద్ధాత్మల-ననిశము[5] హృదిని నుతించెదము= ఘనతా మహిమలు కలకాలంబును-గలుగగ నెన్నడు మించెదము॥శ్రీకర॥

---

## పరలోక వాంఛ.

## 148 *Christian Pilgrimage.*

### క్రైస్తవ యాత్ర.

రా—బిళహరి. తా—అట.

పదరే సోదరులారా - పరమ పురి జేర -మధుర జీవాధార -పదవి[6] చేకూర[7]=తుది మొదలును యా-పద రేబగలు[8] లేని - సదనంబునకు[9] జేర సదయు[10] నేసుని గూడి ॥పదరే॥

1 ఎన్ని దినములు బ్రతుక - నేమి సౌఖ్యం-బన్ని విధముల జూడ-నధిక కష్టంబు =కన్ను మూసిన నాడు-మన్ను పాలౌదుము - మున్ను[11] జాగ్రత్త నొంద - కున్న నష్టము గల్గు ॥పదరే॥

---

1 ఎప్పుడు 2 లోకమందు 3 బరువును 4 ప్రకాశింతుము 5 ఎల్లప్పుడు 6 మోక్షము 7 దొరకునట్లు 8 రాత్రిపగలు 9 పట్టణమునకు 10 ప్రేమగల 11 ముందు

2 ధరణి బ్రతుకను గోర - మరణ భయంబు - దరి[1] లేని చింతల - దగిలి నిత్యంబు = పరి పరి విధముల - పరుగు లెత్తుట లేల - నిరతంబును సువార్త - సరణి[2] గన్గొని వడిగ ||పద రే||

3 ధనము సంపాదించి - ఘన మధిక మున్న - తనువు సతము[3] గాదు - అనుభవము[4] సున్న = విను డెండమావు - లను[5] గోర నేపాటి - తనివి దీరును యిచ్చో - టను నా పాటే[6] దీరు ||పద రే||

4 పరలోక మార్గం - బిరుకై గన్పడును - చోరగా సంకటములు - నెరి[7] జుట్టుకొనును = పరమ జనకుని కృప - పరము తోడుగ నున్న - వెరపు[8] నొంద మింక - సరకుసేయుము పద ||పద రే||

5 ఇచట నొందెడి శ్రమల - కచట నొందనవు - ప్రచుర[9] సంతోషభర - మున కెన్నబడవు[10] = అచట నొందెడి సౌఖ్య - మరయ శక్యము గా - దిచట నస్థిర సుఖ మీక్షించకను[11] వేగ ||పద రే||

6 ఇహ స్నేహములు మన - కిక చాలు చాలు - బహు దినంబులు సేయ - బడె నేమి మేలు = మహిమ దూతల స్నేహ - మమరు[12] నచ్చటను మన - మహహ యేసుని జూడ - నధిక సంతోషంబు ||పద రే||

7 మనల దోడ్కొని పోవ - ఘనుడు యెహోవా - యనయంబు తన శుద్ధా - త్మను నిచ్చి గావ = నెనలేని[13] యడ్డంకు - లను[14] దాటించను కృప - గనుపర్చ తోడుగ - నునిచె[15] వేగము గూడి ||పద రే||

8 భక్తులై యున్నట్టి - బంధు మిత్రాదిన్ - రక్తి[16] గుణములతోడ - రంజిల్ల గనినన్[17] = ముక్తి రాజ్యంబున - మురుపుతోడ[18] సర్వ - శక్తుని మహిమ నా - సక్తితో జూతుము ||పద రే||

---

1 అంతము 2 మార్గము 3 నిత్యము 4 బుద్ధి 5 అగ్నిపాలను 6 అంత వరకే 7 ఎక్కువగా 8 భయము 9 గొప్ప 10 సంతోష పూర్ణతకు సాటి కావు 11 కోరకుండ 12 దొరకును 13 లెక్కలేని 14 అడ్డములను 15 ఉంచెను 16 పరిశుద్ధ 17 చూచి నట్లయితే 18 సంతోషముతోడ

## 149 *A pilgrim and a stranger.*

ఛాయ: మహిమ మహిమ మహిమ యనుచును.

రా—ఆనందభైరవి. తా—ఆది.

నేను యాత్రపరుడ నిచటను - నాకు లేదు - నిత్యమైన తావు
వసుధను = నేను పోవు దేశ మింక - నిందు దూరమందు గలదు-నా నివేశ
మింక దవ్వు[1] - నా నేత్ర - మునకు - గానంగ - నానదు ||నేను||

1 ఇచట నాకు బాధ లుండును - తరుచుగాను - నిడుమల బడి[2]
యలసి యుండును = అచట నాదు దేవు డొసగు - నచల[3] నిత్య శాంతి
నాకు - నుచితముగను ముక్తి గల్గు - నుండు బ్ర - భుండు నా-యండెను-
మెండుగ ||నేను||

2 అందె యుండ నేను గోరుదు - నాదు తలపు-లచట నే చరించు[4]
చుండును = సుందరుండ! ప్రభువ! నీదు - సేవకుండ నైన నన్ను-నందు
జేర బిల్వ రమ్మి - పొందుగ - నందు నా - నంద మే - నొందగ[5] ||నేను||

3 నాదు కష్ట మంత పోనగ - ధరణిపైని - నాదు తిరుగు లంత
మొందగ = నీదు ముదల[6] నియ్యు మయ్య - నేను దారియందు నిల్వ -
నీదు కృపను నన్ను బిల్చి - మోద[7] స - మాధాన - సౌధాన[8] - నం దాచు
||నేను||

4 అచట జేరి యుగయుగంబులు - నే వసింతు - నన్యునిగను
గాక స్వేచ్ఛతో = సుచిరమౌ[9] విశ్రాంతియందు - శోణితమున[10] నీవు
గొన్న[11] - సుచయమందు[12] గూడి నేను - సుందరా - నందంబు-నందుచు -
నుందును ||నేను||

---

1 దూరము 2 కష్టములలో బడి 3 స్థిరమైన 4 తిరుగు 5 అనుభవించునట్లు 6 ఆజ్ఞల 7 సంతోషము 8 గృహామునందు 9 నిరంతర ముండు 10 రక్తమున 11 సంపాదించిన 12 భక్తుల గుంపుయందు

5 నేను మరతు యాత్రి బోధలన్ - ఇకను సాకు - మానిపోవు
యాత్ర యుద్ధముల్ = నేను విడుతు భూ విచార - నివహామంత[1] వెనుక
నెపుడు - పోని నిత్య సంతసంబు - ముందు నే - గంచును[2] - సందియ -
మొందను ||నేను||

---

## 150 *The Cross of Christ our Glory.*

సిలువ యెదుట సిరులెల్ల వ్యర్థమనుట

రా—అసావేరి. తా—జంపె.

సిరులెల్ల[3] వ్యర్థ[4] గాక - బరికించి[5] నాగున్న - గర్వము[6] దిరస్క-
రింతున్[7] = వెర[8] మహిమ రారాజు - మరణాశ్చర్యపు సిలువ - నరయు[9]
చున్నట్టి వేళన్ - ముఖ్యములైన ||సిరులెల్ల||

1 ఓ కర్త నా దేవుడా - క్రీస్తు మృతియందు - గాక మరి యుబ్బ
నీయకు[10] = ప్రాకట[11] భ్రమకారి[12] - వ్యర్థ వస్తువులను - ప్రభుని రక్తంబు
కొరకై - త్యజించెదను[13] ||సిరులెల్ల||

2 చారు[14] మస్తక[15] హస్త పాదముల వల్లను వి-చారంబు దయయు
గలసి=సారె[16] ప్రవహించు - చున్నది చూడు మెప్పు డిట్టి - దారి గలదా
ముళ్లు - తగు కిరీటంబాన ||సిరులెల్ల||

3 వాని నిజ[17] రక్తంబు - వస్త్రంబువలె సిలువ-పై నతని తనువు
గప్పెన్=ఐన నే నీ లోక - మంతటికి మృతుడనై-నాను నాకీ లోకము-
మృతం బయ్యె[18] ||సిరులెల్ల||

---

1 సమూహామంత 2 చూచును 3 భాగ్య, భోగ్యములన్ని 4 వ్యర్థము 5 ఆలోచించి 6 గర్వము 7 విడిచి పెట్టుదును 8 ఆశ్చర్యమైన 9 విచారించుచు 10 సంతోషింప నీయకుము 11 ప్రసిద్ధముగ 12 మోసపుచ్చువాడు 13 వదలి పెట్టెదను 14 సొగసైన 15 శిరస్సు 16 తరుచుగా 17 స్వంత 18 చచ్చిన దాయెను

## 151 *The Journey of Life.*

ఈ జీవన యాత్ర.

రా__ముఖారి. తా__ఆది.

పరదేశులమో - ప్రియులారా మన = పుర మిది గా దెప్పుడు - నిజ ముగ ||పరదేశుల||

1 చిత్ర వస్తువులు - చెల్లెడి యొక వి = చిత్రమైన సంత - యీ లోకము ||పరదేశుల||

2 సంత గొల్లు[1] శ్రమ[2] - సడలిన[3] చందం[4] = బంతయు సద్దణ గున్ - నిజముగ ||పరదేశుల||

3 మాయ లోక' మిది—ఛాయను[5] బోలును = మాయ మాయ మాయ_ యంతయు ||పరదేశుల||

4 స్థిరమని నమ్మకు - ధర యెవ్వరికిని = పరలోకమె స్థిరము - నిజ ముగ ||పరదేశుల||

5 మేడలు మిద్దెలు - మేలగు సరకులు = పాడై కనబడవే - నిజముగ ||పరదేశుల||

6 ధన ధాన్యంబులు - దరగక మానవు = పని పాటలు మాయ - నిజముగ ||పరదేశుల||

7 పరువు ప్రతిష్ఠలు - పలు శాస్త్రంబులు = బిరబిర[6] నశియించున్ - నిజముగ ||పరదేశుల||

8 ఆటలు పాటలు - హర్షంబులు[7] నొక = నాటను[8] బోవు గదా - నిజముగ ||పరదేశుల||

9 కలిమి లేములు - కావటి కుండలు = వెలయంగా[9] మాయ - నిజ ముగ ||పరదేశుల||

---

1 అంగడిలోని అల్లరి 2 లోకము 3 అంతమగు 4 రీతిగా 5 నీడను 6 త్వరగా 7 సంతోషములు 8 రోజులో 9 స్పష్టముగా

10 తిన్నది తినవలె - గన్నది[1] గనవలె = విన్నది వినవలెగా - నిజ ముగ ॥బరదేశుల॥

11 ఎన్ని నాళ్ళు మన - మిలలో బ్రతికిన = మన్నై పోవునుగా - దేహాము ॥బరదేశుల॥

12 వచ్చితి మిచటికి - వట్టి హాస్తముల[2] = దెచ్చిన దెద్దియు - లేదు గదా ॥బరదేశుల॥

13 ఎట్లు వచ్చితిమి - యీ లోకమునకు = నట్లు వెళ్ళవలయున్ - మింటికి[3] ॥బరదేశుల॥

14 యేసునందు వి - శ్వాసం బుంచిన = వాసిగ నిను జేర్చున్ - బర మున ॥బరదేశుల॥

15 యేసే మార్గము - యేసే సత్యము = యేసే జీవముగా - నిజముగ ॥బరదేశుల॥

16 క్రీస్తువుండ లే - యేసు జేరుమా = క్రీస్తే మోక్షంబు - స్థిరముగ ॥బరదేశుల॥

---

## ఔదార్యము.

## 152 *O Lord of heaven and earth and sea.*

ఛాయ: నిరుత్సల్ల వృధగాక.

రా__అసావేరి. తా__జంపె.

స్తుతియు మహిమయు నీకె - క్షితికిన్[4] దివికిన్ నీటి - వితతికిన్[5] కర్తవె - వెలయు మా దేవా! = ప్రతి వస్తువును మాకు బహుమతిగా నిచ్చు - హితుడా మా ప్రేమ నీ - కెట్లు చూపుదుము? ॥స్తుతియు॥

1 చూచినది 2 చేతులతో 3 పరలోకమునకు 4 భూమికి 5 సముద్రమునకు

1 పసిడి వర్ణపు టెండ - భాగ్య ధారల వాన - వీసరు మంచి గాలి - విరియు[1] పుష్పములు = రస మొలుకు పండ్లు నీ - రమ్య ప్రేమకు చాటుకు - ప్రసరించు కోత లో - పల నుండు నీవు ॥స్తుతియు॥

2 నెమ్మది గల యిండ్లు - నిజ సౌఖ్య కాలములు - ఇమ్మహి ఫలియించు - నైశ్వర్యాదికముల్ = ఇమ్ముగ గలిగిన - హృదయులమై పొంద - నమ్మేలు ఋణపడి యు - న్నాము నీకు ॥స్తుతియు॥

3 దురితంబు లొనరించి - దౌర్భాగ్య స్థితి నున్న - ధరణికి నీ పుత్రున్ - ధర్మంబుజేసి = నరుల కీ ధర్మమున - కొరత దీర్చెదు సర్వ - వరము లమర్చిన - పరమోపకారీ ॥స్తుతియు॥

4 జీవంబు ప్రేమను - జీవము[2] గల్గించెదు - పావనాత్మను మాకై - పంపితివి = దీవన లేడు రెట్లావరింపను మమ్ము - నీ విమలాత్మ వా - నిని గుమ్మరించు ॥స్తుతియు॥

5 నరులకు విమోచ - నము గల్గె; పాపంబుల్ - పరిహార మాయె; కృ - పా సాధనములు = దొరకె; మోక్షాంశంబు[3] - స్థిరమాయె; మేము నీ - కొర కేమి తేగలము? - పరిపూర్ణ జనకా ॥స్తుతియు॥

6 మాకై వాడుకొనెడి - రూకల్ వ్యర్థం బగును - నీకై యప్పనగ నిచ్చు - నిఖిల[4] వస్తువులు = శ్రీకరంబగు నిత్య - శ్రేష్ఠ ఘన నిధియై పై - లోకంబునం దుండు - లోపంబు లేక ॥స్తుతియు॥

7 జీవంబు, వస్తువులు, - శ్రేయంబు, దాన స్వ - భావంబు, శక్తియు - భాగ్యంబులు = నీ వలననే లభ్య - మై[5] వెలయుచున్నవి[6] - నీ వాసమే మాకు - నిత్యానందంబు ॥స్తుతియు॥

---

1 వికసించు 2 శక్తిని 3 మోక్షమును గూర్చిన సంగతి 4 సమస్తమైన 5 కలిగినవై
6 ప్రకాశించుచున్నవి

## 153 Christian Giving.

క్రైస్తవ దాతృత్వము

రా—సౌరాష్ట్ర. తా—ఆది.

సంతోషముతో నిచ్చెడి వారి - నెంతో దేవుడు ప్రేమించున్ = వింతగ వలసిన దంతయు నొసగును - వినయ మనసు గల - విశ్వాసులను ||సంతోషముతో||

1 ఆత్మా సక్తితో నధిక ప్రేమతో - సంఘకార జను లందరును=సత్య సువార్తను చాటించుటకై - సతతము[1] దిరిగెడు - సద్భక్తులను ||సంతోషముతో||

2 ఆదిమ వాక్యము వేరు వేరు గ్రా - మాదుల నుండెడి బాలురను= సాధులుగా అది సతతము నేర్పెడి - సజ్జన క్రైస్త వో-పాధ్యాయులను ||సంతోషముతో||

3 దిక్కెవ్వరు లేకుండెడి దీనుల - తక్కువ లన్నిటి దీర్చుటకై = నిక్కపు[2] రక్షణ నీ ధరలో నలు - ప్రక్కలలో బ్రక-టించుట కొరకై ||సంతోషముతో||

4 ఇయ్యండి మీ కియ్యంబడు నని - ఇయ్యంగల ప్రభు యేసనెను= ఇయ్యెడ[3] మరువక యిది మది నిడికొని[4] - యియ్యవలెను మన - యీవుల నికను ||సంతోషముతో||

5 భక్తి గలిగి ప్రభు పని కిచ్చుట బహు - యుక్త మటంచు నుదారతతో=శక్తి కొలది మన భుక్తినుండి[5] యా - సక్తితో నిరత[6] మొ-సంగవలెన్ ||సంతోషముతో||

---

1 ఎల్లప్పుడు 2 నిజమైన 3 ఈ సమయమున 4 మనస్సునందుంచుకొని 5 ఆహారమునుండి 6 ఎల్లపుడు

## ఆరాధ నారంభము.

## 154 *Christian Worship.*

క్రైస్తవారాధన ప్రారంభము.

రా__సురటు. తా__ఆది.

కూడుకొని యున్నాము- సంఘ ప్రభో- కూడుకొని యున్నాము=
తోడ నుండెద వనుచు నమ్మిచు- దొడ్డదగు నీ పాద సన్నిధి ॥కూడుకొని॥

1 ఎచట నా ప్రియ భక్తు- లెలమి గూడియున్న - నచటికి
నే తెంతు- నని బల్కితి = విచట నుండు మమ్ము - వీక్షించి[1] కృపచేత -
నిపుడు దీవింపుమీ - యేసు క్రీస్తు నాథ ॥కూడుకొని॥

2 గత కాలమందున - గాని[2] చేతలచే[3] దు-ర్గతి నొంది యుండగా-
కనుగొంటివి = శత సంఖ్య గల పాప - చయ మీవు క్షమియించి - యతి
శాంతి నిడితివి - యాత్మ స్వరూప ॥కూడుకొని॥

3 నిరతము నీ ప్రేమ - నెనరున ధ్యానించి - పరమ ధర్మముల౦దు-
బరత[4] గల్గి = యరులకు[5] శుభములు - నిరతంబు జేయగ - దిరత మా కొసగుము - దేవుని ప్రియ తనయ ॥కూడుకొని॥

4 అన్ని శోధనముల - నన్ని విపత్తుల - నన్ని కాలములందు - నాదరించి = నిన్ను నమ్మిన జనుల - నీ సందిటను జేర్చి - పన్నుగ గా పాడు -
ప్రభు యేసు క్రీస్తు ॥కూడుకొని॥

5 అమలుడ నగు[6] న - న్ననుకరింపు[7] డనుచు - నాన తిచ్చి నాడ -
వాత్మజులకు[8] = నమల మార్గము న౦దు - నరుగంగ మా కీవు - విమలాత్మ
దయ సేయు - వేగంబు మా తండ్రి ॥కూడుకొని॥

---

1 చూచి 2 పనికిమాలిన 3 పనులచేత 4 ఆసక్తి 5 శత్రువులకు 6 పరిశుద్ధుడనగు
7 అనుసరించుడు 8 బిడ్డలకు

# ఆరాధన ముగింపు.

## 155 *Doxology.*

దీవెన కీర్తన.

రా—రేగుప్తి. తా—రూపకము.

దీవెనతో సెలవిమ్ము కర్తా - మాకు నీ - దీవెనతో సెలవిమ్ము కర్తా - దీవించి క్షేమంపు - టీవులను దయచేసి - జీవ పోషణవార్త - భావమున సమకూర్చి ||దీవెనతో||

1 లోకమున నిన్ను వేడుకొని - మేము ఈ - లోకమున కొనియాడుకొని = శ్రీకరంబగు దివ్య - లోకంబులో జేరి - యేకముగ స్తోత్రములు - నీకు చెల్లింతుము ||దీవెనతో||

2 స్తుతి పితృ పుత్ర శుద్ధాత్మ - శుభ మిచ్చు - స్తుతి పితృ పుత్ర శుద్ధాత్మ= స్తుతియించును సర్వ - క్షితి దివ్య సైన్యములు - అతులితంబగు[1] దేవుడని నిన్ను స్తుతియించు ||దీవెనతో||

---

## 156 *Benedictions and Doxologies.*

దేవా! దీవెనలతో మమ్ము పంపుము.

రా—శ్రీ. తా—అట.

పంపుము దేవా - దీవెనలతో - బంపుము దేవా=పంపుము దయచేత - బతిత[2]పావన నామ - పెంపుగ నీ సేవ - బ్రియ మొప్ప నొనరింప ||బంపుము దేవా||

1 మా సేవ నుండిన-మా వెల్తులన్నియు[3] - యేసుని కొరకే - వెసగ క్షమింపుచు ||పంపుము దేవా||

---

1 సాటిలేని 2 పాపములను 3 కొరత అన్నియు

2 వినిన సత్యంబును - విమలాత్మ[1] మది నిల్పి - దినదినము ఫలములు- దివ్యముగ ఫలియింప ||పంపుము దేవా||

3 ఆసక్తితో ని-న్ననిశము[2] సేవింప-భాసురంబగు నాత్మ - వాని కెక్కు-గా నిచ్చి ||పంపుము దేవా||

---

## 157 *Glory to God.*

త్రైక దేవునికి మహిమ.

రా—జంఝూటి. తా—ఏక.

మహిమ నొప్పు[3] జనక నీకు - మహిత సుతునకు = మహిమ గల్గు శుద్ధాత్మకును - మహా యుగములు ||మహిమ||

1 లోక సృష్టి మునుపు నిన్ను - నాక[4] సేనలు[5] = ప్రాకటంబుగా నుతించె - ప్రజ్ఞ మీరగ ||మహిమ||

2 సకల సృష్టి వలన దేవ - సకల యుగములు = సకల మహిమ గలుగు నీకు - సకల కాలము ||మహిమ||

---

## 158 *Adoration of Christ.*

క్రీస్తునకు మంగళార్చన.

రా—పంతువరాళి. తా—త్రిపుట.

మంగళము బాడరె - క్రీస్తుని జయ - మంగళము బాడరె - యో ప్రియులారా - మంగళము బాడరె = మంగళము బాడి మ - స్సంగతిని వీడి ప్రభు - సంగులను[6] గూడి మది-పొంగుచు జెలంగుచును[7] ||మంగళము||

1 రాజులకు రాజని - దూతల చేత - బూజ గొనువాడని = తేజమున నూర్యునికి - దీప్తి[8] నిడు[9] సద్గుణ వి - రాజితుని[10] సాధు జన - రక్షకుని పక్షముగ ||మంగళము||

---

1 శుద్ధాత్మ 2 ఎల్లప్పుడు 3 గొప్పతనముతో ప్రకాశించు 4 పరలోక 5 సైన్యములు 6 స్నేహితులను 7 సంతోషించుచు 8 కాంతిని 9 ఇచ్చు 10 మంచిగుణములచే ప్రకాశించువాని

2 కరుణ గలవాడని - పాపుల ద్రోహ - బిరుదు గొనినాడని = మరణ మను దాని బరి-మార్చు[1] ఘన శక్తిగల - పరమ గురు డితడె మన - పాలి వాడని శుభ ||మంగళము||

3 సంగీతము బాడుచు - సువిశేష ప్రి - సంగముల గూడుచు = నింగికిని[2] భూమికిని - నిత్యముగ నేల దగు - శృంగారపు రాజునకు - క్షేమ మగు నామే నని ||మంగళము||

---

## ప్రభువు దినము.

## 159 *The Lord's Day.*

ప్రభువుయొక్క దినము.

రా—యదుకుల కాంభోజి. తా—ఆది.

ఇది యెహోవా - కలిగించిన దినము - ఇది యెహోవా = సు దివసంబునను - జొప్పడు[3] గడియలు = కొదువ లేని దయ - గుల్కెడు వానిని ||ఇది యెహోవా||

1 మోక్షము భూమియు స - మ్మోద మంది నుతు = ల[4] క్షరు[5] గద్దె చుట్టు - నావరింతురు గాక|| ||నిది యెహోవా||

2 అతడీ దినమం - దంత మొందు నర = వితతి[6] నుండి వే-వేగమె వచ్చెను ||ఇది యెహోవా||

3 ఆ పిశాచ రా - జ్యంబు గూలినది = యా పరేశుడు[7] జ - యము లొందు నిందు ||ఇది యెహోవా||

4 సేవకులు వాని విల - సింపగ[8] జేసి యా = పావనాద్భుతముల - ప్రచురము జేయుదురు ||ఇది యెహోవా||

---

1 నశింపజేయు 2 ఆకాశమునకును 3 కలిగిన 4 స్తోత్రము చేయువారు 5 నిత్యుడైన దేవుని 6 సమూహము 7 శ్రేష్ఠుడైన ప్రభువు 8 ప్రకాశించునట్లు

5 దావీదుని వర - తనయుఁడై యభిషే = కావృతుడా[1] రా
జా - గ్రణికి[2] హోసన్నా[3] ||ఇది యెహోవా||

6 ఇమ్ముగ మాకు సాహాయ్య - మిలలోన మా దేవ = తెమ్ముగ నీ గద్దె
నుండి - దిగి సంరక్షణ ||నిది యెహోవా||

7 జనుల యొద్దకు యేసు - ఘన వార్తలతోడ = దన జనకు డంపగ -
ధరణి కేతెంచెను ||ఇది యెహోవా||

8 మన పాపపు జా - తిని రక్షించుటకుఁ = దను విడిన కర్త -
సన్నుతుడా[4] గాక ||ఇది యెహోవా||

9 భూమి మీది దే - వుని సభ దాని యు = ద్దామ[5] శక్త్యాను సార -
తన్[6] బలుకు హోసన్నా ||ఇది యెహోవా||

10 తా నేలెడి యున్న - తంబగు మోక్షము = దీని కంటెను మే - లౌ
నుతి నర్పించును ||ఇది యెహోవా||

---

## 160 *Christian Worship.*

క్రీస్తవారాధన.

రా—నాధనామ క్రియ. తా—అట.

యెహోవా భజన చేయుండి - పాప - హితులారా - ఈ రీతి
మరచి పోకుండి ||యెహోవా భజన||

1 యేసు పేరిటి ప్రార్థనంబు - మన - దోసములను పో - గొట్టను
వెరవు[7] - భాసుర పరలోక సుఖము - కోటి - బాధలు మన కున్న -
సంతోషకరము ||యెహోవా భజన||

---

1 అభిషేకము నొందిన వాడైనటువంటి 2 రాజులలో శ్రేష్ఠుడైనవానికి 3 జయము
4 బాగుగ స్తోత్రము చేయబడినవా డగును 5 గొప్ప 6 శక్తి కొలదిగ 7 ఉపాయము

2 యేసు క్రీస్తును గొలువుండి - యేసు - దాసులతో వా - దము లాడకుండి - మోసపు దారి విడువుండి - దోష - రాసుల నుర్విలో - జేసి కొనకుండి ॥యెహోవా భజన॥

3 జీవ రక్షకుని నమ్ముండి - నిత్య - సేవలో మెలగక - చెడిపోవ కండి - భావించి యాత్మఁ వేడుండి - దేవ - దేవుని యెడబాసి - తెరవు[1] విడకండి ॥యెహోవా భజన॥

4 మాయ లోకపు భ్రాంతు లొదచి - మను - ష్యాయువు భువిలోన - జెల్లుట[2] దలచి - మాయ మార్గము లెల్ల మరచి - మోక్ష - మార్గము మన మున - మరువక దలచి ॥యెహోవా భజన॥

5 కాయము నొసగిన ప్రభుని - యయిదు - గాయంబు లాత్మలో - గానంగరాదా - ఆయు వస్థిర మని తెలిసి - మీరు - కాయ మాత్మయు నిపుడు - కర్తకు నిచ్చి ॥యెహోవా భజన॥

---

ఉదయము.

## 161 *A Morning Hymn.*

ప్రాత స్తవము.

రా—కాంభోజి. తా—జంపె.

తెల్లవారిన వేళ - వెలి వొంది మన క్రీస్తు - దివ్యనామము బాడరె - యో ప్రియులార - దివసరక్షణ వేడరే = తల్లి రొమ్మున దాచు - పిల్ల రీతిని మనల - జల్లదనముగ రాతి - రెల్ల గాచిన విభుని ॥తెల్లవారిన వేళ॥

1 నిద్ర బోయిన వేళ - నిఖిలాపదల బాపి - నిశ లన్ని[3] గడుపు విభునిఁ = భద్రముగ వినుతించి - భయ భక్తితో మనము - ముద్రితాక్షుల[4] కేలు[5] మోడ్చి[6] మ్రొక్కుచును ॥తెల్లవారిన వేళ॥

1 మార్గము 2 గతించుట 3 అన్ని రాత్రులు 4 మూసిన కన్నులతో 5 చేతులను 6 ముకుళించి

2 భానుడు[1] దుదయంబయ్యె - బద్మములు వికసిల్లె - గానములు జేసె పక్షుల్ = మానసాబ్జము[2] లలర[3]- మనము కల్వరి మెట్టు - పై నెన్ను- నిను డనెడి[4]- ప్రభు జూచి వేడఁ ॥ తెల్లవారిన వేళ॥

3 దిట్టముగ మానసేం - ద్రియ[5] కాయ[6] శోధనలు - పట్టుకొని యుండు దినమున్ = దట్టముగ మన నాల్గు - తట్ల యేసుని కరుణ - జుట్టుకొని రక్షించు - శుభ మడుగు కొనుచుఁ ॥ తెల్లవారిన వేళ॥

4 పాప భారము మనము - ప్రభువు పై నిడి గురుని పాదముల- చెంత నొరగి = కొప్పు కర్త విశాల[7]- కరము[8] మాటున డాగి - యాపదలు తొలగించు - మని వేడుకొనుచున్ ॥ తెల్లవారిన వేళ॥

---

## 162 *A Morning Hymn.*

ప్రాత స్తవము.

రా—బంగాళారఘురి. తా—ఆది.

వేడెద నా దగు వినుతిని[9] గైకొన-వే జగదీశ ప్రభో=నేడు ప్రతి క్షణ మెడబాయక నా- తోడ నుండవె ప్రభో ॥వేడెద॥

1 ప్రాత[10] స్తవము[11] భవత్సన్నిధి[12] స-ర్వంబుననగు నాచే = చేతస్సున[13] ధర్మాత్మము[14] సంస్థితి[15]-జేయవె సత్కృపను ॥వేడెద॥

2 నే పాతకి[16] నజ్ఞానుడ ప్రభువా - నీవు కరుణ జేయు = పాపాచరణము[17] నందున చిత్తము - బాపుము నా కెపుడు ॥వేడెద॥

3 పాపము గని భీతుడనై శంకా - పరత[18] సతము నుండఁ = నాపై నుంచుము నీదగు సత్కరు - ణా దృష్టిని ప్రేమన్ ॥ వేడెద॥

---

1 సూర్యుడు 2 మనస్సు అనెడి పద్మములు 3 వికసించు రీతిగా 4 సూర్యు డనెడి 5 మనస్సు అను ఇంద్రియమునకు సంబంధించిన 6 శరీరమునకు సంబంధమైనట్టియు 7 గొప్పదైన 8 చేయి 9 స్తోత్రమును 10 ఉదయ 11 స్తుతి 12 నీ సన్నిధిని 13 మనస్సునందు 14 పరిశుద్ధాత్మను 15 ఉండు నట్లుగ 16 పాపాత్ముడను 17 పాపము చేయుట 18 సందేహించుట యందే మనస్సు నిలుపుట

4 నా దగు పాప భరం బంతయు నీ _ మీద నె యిడుచుందున్ = నీను మహాకృపనుండి యొసంగుము _ నిర్మల[1] గతి నాకున్ ॥వేడెద॥

5 అవిరత[2] మతి[3] నిటు లతులిత[4] గతి[5] నీ _ స్తుతి నతు లొనరింతున్[6] =భవదంఘ్రులపై[7] నా దగు భక్తిని - బ్రబలింపవె యేసు ॥వేడెద॥

---

# 163 *Morning Praise.*

ప్రాత స్తవము

రా___యమునా కళ్యాణి. తా___జుల్వా.

శ్రీ యేసు కర్తను _ సేవ చేయుటకు మేల్కొను ॥శ్రీ యేసు॥

1 శ్రేయముల[8] నెరింగి_ నీకు _ రేయి[9] బవ[10] లొసంగి _ యెడబాయని యంతరంగి[11] _ య _ పాయంబు ద్రోయ - సహాయంబు జేయ ॥శ్రీ యేసు॥

2 నిదురయందు నేడు _ క్షేమ _ మొదవ[12] గాచి నాడు _ సూర్యుడుదయ మాయె జూడు_నీ_హృదయమున సదమల _ పదవు లుదయింప ॥శ్రీ యేసు॥

3 అంధకార మణగన్ _ హృద _ యాంధకార మణగన్ _ ప్రభునందు తెలివి గలుగన్ - నిబంధనలు డెందమున - కందముగ గూర్చి ॥శ్రీ యేసు॥

4 కంటి పాప వలెను_నిను _ గాయు వాని దయను_కను _ గొంటివి స్తోత్రమును _ జేయు_ మింటికిని - మంటి క _ న్నింటికిని కర్త యని ॥శ్రీ యేసు॥

---

1 పరిశుద్ధమైన 2 విరక్తిలేని 3 మనస్సుచేత 4 సాటిలేని 5 రీతిగా 6 నమస్కారములు సమర్పింతును 7 నీ పాదములమీద 8 మేళ్ళను 9 రాత్రి 10 పగలు 11 మనస్సు గలవాడు 12 కలుగునట్లు

5 కలకల ధ్వని జేయు - పక్షి - గములు[1] లయను[2] గూయు - స్వర - ములు ప్రభు స్తుతిజేయు - నీ వలయక న్ సొలయక న్ - వెలయగ న్వాడు ||శ్రీ యేసు||

6 సేనయందు నీకు - మంచి యీవు లిడు పరాకు - గల - భావము బడబోకు - నేడు - కావవే కావవే కావవే యంచు ||శ్రీ యేసు||

7 పగటి వార మంచు - నిష్ఫలపు క్రియలు దుంచు - యుగ - యుగములు జీవించు పురి - కెగయ నీ దిగులు విడు - తగు నమ్మకమున ||శ్రీ యేసు||

8 మింటి నంట బాడు - నీ - యొంటి బలిమి నేడు ప్రభు - నంటి యుండు వాడు - ని - న్నొంటి నెన్నంటి కె - న్నంటికి న్విడడు ||శ్రీ యేసు||

---

## సాయంకాలము.

## 164 *All praise to Thee, my God, this night.*

ఛాయ : నిన్ను నేను విడువను.

రా—మధ్యమావతి. తా—ఆది.

దేవ! నీకు స్తోత్రము - ఈ రాత్రిలో - నీ వెలుగు దీవనకై = కావుము నన్నిప్పుడు - రాజుల రాజా! - ప్రోవు రెక్కల నీడలో ||దేవ||

1 పూని యేసుని పేరిటన్ - మన్నింపుము - కాని పనులను జేసి నన్ = నేను నిదుర పోవక - ముందే సమా - ధాన మిమ్ము నాకు ||దేవ||

2 చావు నొందుట కెన్నడు - భీతి లేక - జీవింప నేర్పింపుము = జీవ పునరుత్థానము - లో మహిమతో - లేవ మడియ నడ్పుము ||దేవ||

3 నేను చీకటి నిద్రను - రోయుచు ముద - లేని దినంబునందు = మానకుండగ దూతలన్ - గూడి చేయ - గాన మెప్పుడు గల్గునో ||దేవ||

---

1 పక్షులు 2 లయ (దరువు)తో

## 165 *Evening Praise.*

సాయంతన స్తవము.

రా—బంగాళా ఝరి. తా—ఆది.

వినవే నా వినుతి నివేదన[1] దయ - వెలయగ నో ప్రభువా = నిను శరణొందితి నను కుశలంబున - మనుపవే[2] యో ప్రభువా ॥వినవే॥

1 నిర్మల గతి[3] సంధ్యా కాలంబున - నీ స్తవమగు ప్రభువా = ధర్మ దీప్తి[4] నా కొసగి జేయుము - దీప్తవంతునిగ[5] నన్ ॥వినవే॥

2 నీ మహదాశ్రయ మొసగి దుర్గతిని - నే బడకుండగను = నా మది తన్వాది[6] సమస్తముతో - నను గావవె ప్రభువా ॥వినవే॥

3 ఎన్ని దినంబులు జగతి నున్న నీ - కన్న వేరు గలరా = పన్నుగ మది నీ పద సంగతమై[7] - యున్నది రేబగలు ॥వినవే॥

4 పాపకరుండను నేను సుకృతా - పాది[8] కర్మ మెఱుగ = నీ పాద సరోజము[9] నా కొసగుము - నాపై కృప జెలగ ॥వినవే॥

5 నీ కొరకై నా మనసు దృఢంబౌ - గాక యేసు ప్రభువా = నాకు పిశాచముచే భ్రమ జన్మము - గాకుండగ నేలు ॥వినవే॥

---

### కోత పండుగ.

## 166 *Sing to the Lord of Harvest.*

ఛాయ: గీతములు పాడుడీ.

రా—మారువా. తా—మిశ్రచాపు.

పాడుడీ గీతముల్ - పంటల నాథున్ - నేడు నుతియింపుడీ = పాడుడీ మీ కర్తను గొని - యాడుడీ మీ స్వరము లెత్తి - వేడుకలరగ హాల్లెలూయల[10] - తోడ స్తోత్రము సేయుచుండుడి ॥పాడుడీ॥

---

1 అర్పణము 2 ఉంచుము 3 పరిశుద్ధముగా 4 పవిత్రమైన వెలుగు 5 ప్రకాశము గలవానిగా 6 శరీరము మొదలైన 7 పాదములతో గూడుకొనినదై 8 మంచి కార్యములను కలుగజేయు నటువంటి 9 పద్మము 10 దేవుని స్తుతింపుడి

1 దేవుడే నడ్పును - దీవెన లొసగి - పోవు కాలంబులన్ = గావ
లయు ఫలంబు లిచ్చి - త్రోవలో దా ద్రిప్పుచుండును - గావునన్ మీ
పంట కర్తకు - భావ శుద్ధిని బాడు చుండుడి ||పాడుడీ||

2 ఆయనే పల్కగా - నాకాశములో - వేయు మేఘంబులు =
శ్రేయ మొప్ప నెడారి పండును - లోయ లన్నియు బాడుచుండును -
హాయిగా ధరలోని కొండలు - వేయుచుండును గంతు లెపుడు ||పాడుడీ||

3 ఇంపుగా సర్వము - నిలలో దండ్రి - నింపుచు నుండును = బంపు
నాయన వత్సరములో - సొంపుగా దన దీవెనలను - బెంపుగా సమృద్ధి
శాంతుల - దెంపులేక యొసంగుచుండును ||పాడుడీ||

4 దానముల నిచ్చెడు - దాతకు మీరు - కానుకల నియ్యుడి =
తాను రక్తము నిచ్చి ప్రోచిన[1] - మానవుల యాత్మలను దెచ్చి - పూనుకొని
మీ పంట మోపులు - మానుగా నర్పింపు డిచట ||పాడుడీ||

5 మీర లర్పింపుడీ - మీ మనముల - గోరి విభు సన్నిధిన్ = చారు
క్రీస్తుని పాదముల కడ - జేర నియ్యుడి వాని నిరతము - భూరి ప్రేమను
దనదు ప్రాణము - ధార బోసిన వాని గొల్వుడి ||పాడుడీ||

6 మేము కడు బాగుగా - నీ మహి నుండ - బ్రేమ నిడు తండ్రికి =
బామరుల రక్షింప రక్తము - భూమి కొసగిన యేసు స్వామికి - క్షేమ
మిచ్చెడు నిర్మలాత్మకు - నేమమున స్తోత్రంబు గల్గును ||పాడుడీ||

---

## 167 *Harvest Festival.*

కోత పండుగ.

యెహోవ సన్నిధిని - ఈ స్తోత్ర గానముతో।
మహోపకారునికి - మానుగ యర్పణ సమర్పించుడి ||యెహోవ||

1 ప్రభు కోరే యర్పణలు - ప్రేమ కృతజ్ఞతలు।
అభయ ప్రదానములు - విభునికి నియ్యుడి విరివిగను[2] ||యెహోవ||

---

1 రక్షించిన 2 ధారాళముగా

2 రిక్త[1] హస్తములతో - రావలదు సన్నిధికి।
భక్తవత్సలునికి - శక్తికొలది మీ రర్పింపుడి ॥యెహోవ॥

3 శృంగార ఆలయము - పొంగార[2] గట్టుటకు।
బంగారు వెండియును-బాగుగ నియ్యుడి ప్రభువు పేర ॥యెహోవ॥

4 వరుమానముల చేత - వాంఛింప వలదండి।
గురు నాజ్ఞ చొప్పున-విరివిగ హృదయము అర్పింపుడి ॥యెహోవ

5 యెహోవ జనులారా - యియ్యండి మనసార।
యెహోవ యిచ్చినది - యేసున కర్పణ చెల్లింతుము ॥యెహోవ॥

---

## 168 *Lord of the Harvest! once again.*

ఛాయ: యేసు నాథ కథా సుధారస మిదిగో పానము చేయరే.

రా—బిళహరి. తా—త్రిపుట.

కోత యజమానుండ! స్తోత్రము - కూర్మితో నొనరింతుము = ప్రీతి మీరగ మాదు పొలములు - పెరిగి పండెను గావున ॥కోత॥

1 నీదు సేవకులైన వారలు - నిండు మోదము నొందుచు = నీ దయను నొక యేటి గ్రాసము[3] - నీ దినంబున గాంతురు ॥కోత॥

2 విత్తుకాలము కోతకాలము - విమలమైన తలంపులు = చిత్తమున బుట్టించి మా కతి - క్షేమ మొసగితి[4] రక్షకా ॥కోత॥

3 వేసవిని భువి మేము నాటిన - విత్తనంబది రమ్యమై = భాసురం బగు పచ్చ మొక్కయి - బయలువడె నిది చిత్రము ॥కోత॥

4 జల సమాధిని వెడలి చక్కగ - బలముతో నీ గింజలు = బలుడగు[5] దేవుని శక్తి చేతను - బాగుగను ఫలియించెను ॥కోత॥

5 ఆ ప్రకారమె నీదు నామము - నందు కాలము చేసిన = యా ప్రజల దేహములు మహిమను - నంద జేయుము రక్షకా ॥కోత॥

---

1 వట్టి 2 బాగుగా 3 గాలబడి 4 అనుగ్రహించితివి 5 శక్తివంతుడైన

6 క్రొత్త కార్యము వల్ల గొంచెను - కూర్మిచే నీ బిడ్డలు = నీతులను నేర్చుకొన జేయుము - ప్రీతిగల మా రక్షకా ॥క్రొత్త॥

7 దూత లంత్య దినంబు నందున - క్రొత్త కోయుచు రంతెటన్ = ఆత్మరణమున గురుగు లన్నియు - నగ్నిలో బడవైతురు ॥క్రొత్త॥

8 లోకమందలి గాలి వానల-లోను మేమిక నుండక = ఆకసంబున తండ్రి కొట్లను - నేకముగ జీవింతుము ॥క్రొత్త॥

9 నీవు నేర్పిన యట్లె మే మిల - నిన్ను ప్రతి దినమందును = జీవనో పాధి యగు భుక్తిని - దేవ, వేడగ జేయుమీ ॥క్రొత్త॥

10 మేని నే[1] పోషించు నన్న - పానములనే వేడక = జానుగను[2] నాత్మలకు నా భో - జనము వేడను నీయుమీ ॥క్రొత్త॥

11 వసుధ నిను ప్రార్థించు జన జీ - వంపు రొట్టెవు నీవెగా = అసువు[3] నాదరణంబు భుక్తివి - యగుము మా కిల నెప్పుడున్ ॥క్రొత్త॥

---

# 168 - A.

వందనార్పణము.

రా__హరికాంభోజి. తా__ఆది.

నుతి సేయను లేవె - ఓ మనసా-నుతి సేయను లేవె-ఓ మనసా = క్షితినిన్ దివిని - హితమతి బోధించెడి - సుతుని జనకుని శు - ద్ధాత్మ ద్వియేకుని ॥నుతి సేయను లేవె॥

1 సూర్యుని కాంతి - సొంపగు పంటలు - సుకాల క్షేమముల్ - శోభిలు గేహముల్ = ఆర్య సాంగత్యము - నైశ్వర్యముల నిల - ననుభ వింపవె నీ వా - యాధ్యుని పేర్మిని ॥నుతి సేయను లేవె॥

---

1 శరీరమునే 2 బాగుగా 3 జీవము

2 దురితము లంటె - దుర్గతి నున్న నీ = కరుణతర ప్రేమను - పరమార్థ మీయను = వరపుత్రు నొసగెడె - వందనీయుడు ప్రభు - మరి మరి మ్రొక్క - మా - పరమోపకారిని ||నుతి సేయను లేవె||

3 జీవము జ్ఞానము - జీవయు నొసంగెడు - పావనాత్మను నీకై - పంపిన దేవుడు = కేవల దోష స్వ - భావము మార్చెడె - సేవ జేయుమ నీ వా - పావన మూర్తికి ||నుతి సేయను లేవె||

4 కరములు పదముల్ - కనకాము లన్నియు - స్వరమును చిత్తము - స్థిరమగు ప్రేమయు = మరి నీదు హృదయము - పరమాత్ము సేవకై - పరి పూర్ణముగ నిచ్చి - ప్రణుతించు మాయనన్ ||నుతి సేయను లేవె||

---

## వివాహము.

### 169 *God's blessing sought on Marriage.*

వివాహమునకు దేవాశీర్వాదము కోరుకొనుట.

రా—సురటు. తా—ఆది.

కోరికొని యున్నాము - యేసు ప్రభూ - కోరికొని యున్నాము = సార[1] కల్యాణ[2] గుణమణి[3] - సన్నిధి[4] నీ సన్నిధిని ||కోరికొని||

1 చారు[5] వివాహో - త్సవము ఘనముగ జేయ - గోరి దర్శన మిచ్చితివి గనుక = కూరిమితో నిది - గో యీ పెండ్లికి మాకు - గారాపు చుట్టము - గా నిన్ను యేసూ ||కోరికొని||

2 కరములు జోడించి - పరస్పర[6] ప్రమాణ - భరము[7] మోసిన యీ దంపతుల[8] మీద = వరదయా తదైక్యతకు[9] భ - వ దనుగ్రహా[10] కిరీటము రచించి[11] తద్బంధ - మును[12] నీవే దీవింప ||కోరికొని||

1 శ్రేష్ఠమయిన 2 మంచి 3 గుణము లనెడి మణులకు 4 గనియైన 5 సుందరమైన 6 ఒకరితో నొకరు చేయు 7 భారమును 8 భార్యాభర్తల 9 గొప్ప ప్రేమతో నిండినవారి యొక్క ఐక్యతను 10 నీ దయ అను 11 చేసి 12 వారి బంధుత్వమును

3 ఘన వొప్ప[1] వారు కైస్త - స్తవ జాగరూకత-లను తమతమ సంతో లనుభవించి - మొనసి[2] సంసార భారముల - జాలకన పర్చు - కొను తదాత్మల[3] మే - ళన[4] నీవు దయసేయ ||కోరికోని||

4 ఘన విశ్వాస ప్రార్థన కోరికలందు - దనర నొకరి కొకరు దయ జూపుచు = నొనర కుటుంబంబు - నురవు[5] నొందింపంగ - మనసార తత్సంత - తిని గాన దయచేయ ||కోరికోని||

5 మును నీసాకు రెబెక - యను వారి కారుణ్య - మునను బాతివ్రత్య మునను మచ్చు[6] = కనుపర్చి యున్నట్లు - గా నీ దంపతుల - ననుసృత[7] జీవము - లను ప్రేమ జతపర్చు|| కోరికోని||

6 పన్నుగ నిందున్న - ప్రతి యాత్మ మీద నీ - జెన్ను ముఖము ప్రకాశింప జేయ = నెన్న సకలకా - నన్నపానాముల కన్న - నున్నత[8] భవద్దయ[9] మా - యుల్లముల[10] నేద[11] దీర్ప ||కోరికోని||

---

## 170

మంగళార్చన.

రా—భైరవి. తా—రూపకము.

మంగళము క్రీస్తునకు - మహిత శుభవార్తునకు[12] - మంగళము త్రిత్వ - సమాన్వితునకు - మంగళము దూత జన - మకుటమగు[13]. ప్రభువు నకు - మంగళము వేదాంత - మాన్యతునకు[14] - జయ మంగళము - సదా శుభ మంగళము ||జయ మంగళము||

---

1 ప్రేమ అతిశయించు నట్లుగా 2 సిద్ధపడిన వారై 3 వారి ఆత్మల 4 ఐక్యమును 5 గొప్పది యగునట్లు 6 మాదిరి 7 అనుసరించిన 8 గొప్పదైన 9 నీ దయ చేత 10 మన స్సుల 11 అలసటను 12 గొప్ప సంతోష వార్తలు గలిగిన వానికి 13 దూతలకు కిరీటము వంటి వాడనబడ దగిన 14 పూజింప బడ దగిన వానికి

1 పరమ జనక కుమార - దురితతతి[1] సంహార[2]- నిరత మోక్షానంద-
పుర విహార[3]- పరభక్త భయదూర[4] - కరుణామృతాసార[5] - నరరూప
ధార మరి - యమ కుమారా ||జయ మంగళము||

2 కానాను జనుదెంచి - కళ్యాణమును మహిమ - గా నొనర్చను
నీరు - గాంచి ద్రాక్షా - పానముగ మార్చి నీ - ప్రగ మాద్భుత ప్రతిష్ఠ[6] -
భూనుతుడ[7] వెల్పితివి - మానితముగా[8] ||జయ మంగళము||

3 నీదు సంఘమునకు - నిత్యమైన వివాహ - మేకత్వమునకు దగు -
నెచ్చరికగా - గైకొనెడి నీ సేవ - క వరుల సంబంధ - మీ కలియుగంబున -
నిముడుగాక ||జయ మంగళము||

4 ప్రేమానుబంధమున - బెనగి[9] యీ దంపతులు - వేమారు[10]
నీ మహిమ - వెదకి భువిని - కామాదులను గెల్చి - కైవల్య[11] పురమునకు -
క్షేమ మగు కృప నిచ్చి - చేరనిమ్ము ||జయ మంగళము||

5 ఆదికాలము నా బ్రి - హాము శారా లెంతో - నీ దయలో బ్రతికి
యిల - నెగడినట్లు[12] - ఈ దీన దంపతులు - గాదిలి చే[13] బ్రతుకుటకు - నా
దయారస మొసగు - మత్షయుండా ||జయ మంగళము||

6 చారుతర[14] చరితుడ - కూరిమి భరితుడా - వారకిల పతిపత్ని[15]
గోరునట్లు - భూరి సంతానంబు - వీరికి నొసంగుమని - పేరోలగం బిచట[16]
జేరితి మయా ||జయ మంగళము||

7 సంతానమును గాంచి - సద్వృత్తిలో బుద్ధి - మంతులై క్రైస్తవ -
మతమునందు - అంత్య పర్యంతంబు - అణుకువగ బెంచ నా - ద్యంత[17]
రహితుండ[18] సహాయ మిమ్ము ||జయ మంగళము||

---

1 పాపముల రాసులను 2 నాశనము చేయువాడా 3 సంచరించువాడా 4 శ్రేష్ఠులయిన భక్తులయొక్క భయమును పోగొట్టువాడా 5 దయ యనెడి అమృతముయొక్క సారమైనవాడా 6 కీర్తి 7 ప్రసిద్ధి గలవాడా 8 గౌరవము నొందునట్లుగ 9 చుట్టుకొని 10. చాల సార్లు 11 మోక్ష 12 వర్ధిల్లినట్లుగా 13 ప్రేమతో 14 మెచ్చుకొనదగిన 15 తప్పక ఈ లోకములో భార్యాభర్తలు 16 ఇక్కడ పెద్ద సభగా 17 ఆది అంతము 18 లేనివాడా

8 భక్త జన స్తోత్రమా - ముక్తికి సుమార్గమా - యుక్త యీవుల సుప్ర-
యోగమునకు[1] - రక్తిగా[2] విజ్ఞప్తి[3] - రంజిల్ల జేయని - శక్తి హీనుల యా -
సక్తి దీర్పు ||జయ మంగళము||

9 కర్తయైన క్రీస్తు - కరుణయు దేవుని -పరమపూర్ణ ప్రేమ - ప్రబల
ముగను - సురుచిరంబగు[4] పరి - శుద్ధాత్మ యైక్యత - కలుగు గాక దంప-
తుల కనిశము[5] ||జయ మంగళము||

---

## 171 *Prayer for Christ's blessing on Marriage.*

వైవాహికాశీర్వాద ప్రార్థన.

రా—ఆనందభైరవి. తా—ఏక.

కానాను పురములో -గడు వింతగా నీరు - జానుగా[6] ద్రాక్షార-
సమును జేసి=పానముగ బెండ్లిలో-బాగుగా నిచ్చిన - దీన రక్షక పెండ్లి-
దీవింపుమీ ||కానాను||

1 రావయ్య పెండ్లికి - రయముగా[7] నో యేసు - ఈవు లియ్యగ
వచ్చు-హితుని బోలి= కావుమీ ద్వంద్వమును[8] - ఘనమైన కృపచేత -
భావమాలిన్యంబు[9] - బాపి యిపుడు ||కానాను||

2 దయ నుంచు మయ్య యీ - దంపతుల మీద స - దయుడవై
కాపాడు - తండ్రి పలెను =నియమంబుగా వీరు - నీ చిత్తమును జరిపి -
భయము లేకుండంగ - బ్రతుక నిమ్మ ||కానాను||

3 ఒప్పు మీరగ చేయు - నొప్పందమును వీర - లెప్పుడును మది
లోన - నిడికొనుచును = దప్పకుండగ దాని - నిప్పుడిమిలో నెప్పుడు -
గొప్పగా నెరవేర్ప - గూడ నుండు ||కానాను||

---

1 చక్కగా వాడుకొనుటకు 2 చక్కగా 3 ప్రార్థనను 4 మిక్కిలి ప్రకాశించు 5 ఎల్లప్పుడు
6 చక్కగా 7 త్వరగా 8 దంపతులను 9 హృదయములోని పాపమును

4 భాసురంబుగ[1] గద్దె - పైని గూర్చుండిన - యేసునాథుని కరుణ - నెపుడు జూపి = వాసికెక్కిన శక్తి - నసుగ్రహపై గనుపరచి - దోసంబులకు నెల్ల - దూరపరచు ||కానాను||

5 చక్కగా నెగడింప[2] - సంసార భారంబు - నెక్కునగు నీ యాత్మ - నిపుడొసంగి = నిక్కమగు సరణిలో[3] - నెక్కుడగ నడిపించి - గ్రక్కునను[4] దీవింపు - కరుణా నిధీ ||కానాను||

6 పిల్లలను నీ వొసగ - బ్రియముతో[5] నో దేవ - పెల్లుగా బోధింప - నెరవు[6] జూపు = మెల్ల వేళలలోన - నిరుకు మార్గమునందు - జల్లగా నడిపింప శక్తి నిమ్మి ||కానాను||

---

## 172 *Marriage Hymn.*

వైవాహిక కృత.

రా.—జంఝూటి. తా.—అట.

మానవుల మేలుకొరకు - జ్ఞానియైన దేవుడు - మానుగ[7] గళ్యాణ పద్ధతి మహిని[8] నిర్ణయించెగా ||మానవుల||

1 కానాను ఊరిలో మన - కర్త జూచె పెండ్లిని = బానముగను ద్రాక్ష రసము - దాన మొసగె బ్రీతిని ||మానవుల||

2 యేసూ వీరిద్దరిని - నేకముగ జేయుమీ = దాసులగను జేసి వీరి - దోసము లెడబాపుమీ ||మానవుల||

3 కర్తా వీరిద్దరికి - భార్యాభర్త స్నేహము = బూర్తిగ నిచ్చి వీరి - బాంధుగాను నడుపుమీ ||మానవుల||

4 భక్తియు విశ్వాస ప్రేమలు - భావమందు వ్రాయుమీ = ముక్తి త్రోవ వెనుక వీరి - భక్తి మిగుల జేయుమీ ||మానవుల||

---

1 ప్రకాశించునట్లు 2 వర్ధిల్లజేయుటకు 3 త్రోవలో 4 శీఘ్రముగ 5 ఎక్కు- 6 ఉపాయము 7 బాగుగా 8 లోకమందు

## 173 *Prayer for Christ's blessing on Marriage.*

వైవాహి కాశీర్వాద ప్రార్థన.

మంగళము! మహిమ! ప్రభావ - మంగళుడ! శృంగార ప్రభువ! యెహోవా! = సంఘమున కీకు[1] నా - సంగమును[2] సూచించు - మంగళ వివాహంబు - మహిని నిలిపిన తండ్రి ‖మంగళము‖

1 నరు డొంటరిగ నుంట నీవు - తగదంచు - నారీమణిని జేసి నావు = నరనారు[3] లికను ని - ద్దరు గాక నేకమౌ - స్మరణతో[4] జీవింప వరము లిడితివి తండ్రి ‖మంగళము‖

2 కానాను పురి వివాహాన - రుచ్యమౌ - పానమును గావించి దీన = మానవుల కొరతను - మరి దీర్చి పెండ్లికి - మానితంబుగ గొప్ప - మహిమ నిడితివి యేసు ‖మంగళము‖

3 వాసి కలుగగ దాసద్వయము[5]-కోరుచు - నీసు మందిరమునను శుభము = భాసురంబుగ నిన్ను - భక్తితో బిలువంగ - యేసు రక్షక వీరి - నేకముగ జేయవే ‖మంగళము‖

4 ఒప్పు మీరగ వధూవరులు - చేసిన-యొప్పందములలోని విధులు = తప్పకుండగ సలిపి - ధరణి వర్ధిల్లంగ - తప్పిదంబుల ద్రోసి - తనుపవే[6] మా తండ్రి ‖మంగళము‖

5 ఎంతో యాశీర్వాదకరము - పెంపొందు - వింతగా నీ వుండు గృహము = సంతోష జనకమై - సంసార మొదవంగ[7] - నంత లెల్లను[8] దీర్ప - చెంత నుండవె తండ్రి ‖మంగళము‖

6 మంగళంబగు దంపతులకు - ముమ్మారు - మంగళము మరియు సభికులకు = నింగి భూములలోన - నిరతంబు దూతజన - సంగీతముల నొప్పు[9]-సత్య సంధుడ! నీకు ‖మంగళము‖

---

1 నీకు 2 స్నేహమును 3 భార్యాభర్తలు 4 జ్ఞాపకముతో 5 ఇద్దరు సేవకులు 6 తృప్తి పొందింపుము 7 యేర్పడగా 8 దుఃఖము లన్నిటిని 9 సంగీతములచే నుతింపబడునట్టి

## 174 *"Marriage is honourable in all"*

అన్నిటిలోను పెండ్లి ఘనమైనదిగా నుండవలెను హెబ్రీ 13: 4.

రా—శంకరాభరణము. తా—ఆది.

దేవర నీ, దీవెనలు, ధారాళముగను వీరలపై = బాగుగ, వేగము, దిగ నిమ్ము, పావన యేసుని ద్వారగను ॥దేవర॥

1 దంపతులు, సంపూర్తిగా, ధాత్రిలో వెలయుచు[1] సంపదలన్ = సొంపుగా నింపుగా బెంపగుచు, సంబరముగను సుఖించుటకై ॥దేవర॥

2 ఈకవను[2], నీ కరుణన్, ఆఖరు వరకును లోకములో = శాఖలు లేకను, ఏకముగా, ప్రాకటముగ నీవు చేకొనుము ॥దేవర॥

3 ఇప్పగిదిన్[3], ఎప్పుడును, నొప్పగు[4] ప్రేమతో నొప్పుచు దా = మొప్పిన, చొప్పున తప్పకను, మెప్పుగ బ్రతుకను బంపు కృపణ్ ॥దేవర॥

4 తాపములు, పాపములు, మోపుగ వీరిపై రానుండగ = కాపుగ ప్రాపుగ, దాపునుండి, మరాపద లన్నియు బాపుచును ॥దేవర॥

5 సాధులగన్, చేయుటకై, శోధనలచే నీవు శోధింపగా = కద లక, వదలక, ముదమున నీ, పాదము దాపున పాదుకొనన్ ॥దేవర॥

6 మెండుగ భూ, మండలపు, గండములలో వీరుండగను = తండ్రిగ దండిగ, నండనుండి, వెండియు వానిని ఖండించవే ॥దేవర॥

7 ఇద్దర, వీరిద్దరను, శుద్ధులై మిమ్ము సేవించుటకై = శ్రద్ధగ, బుద్ధితో సిద్ధపడన్, దిద్దుము నీ ప్రియ బిడ్డలగాన్ ॥దేవర॥

8 వాసిగ నీ, దాసులము, జేసిన ఈ మొరల్ దీసికొని = మా సక, లేశ్వర, నీ సుతుడౌ, యేసుని పేరిట బ్రోవు మామెన్ ॥దేవర॥

---

1 ప్రసిద్ధి కెక్కుచు 2 జతను 3 ఈరీతిగా 4 మంచిదైన

## 175 *Marriage Relation.*

వివాహ సంబంధము కనుపర్చుట.

రా — సురటు. తా — ఆది.

మంగళము - మంగళము - యేసున - జయా - మంగళము - మంగళము

1 సుందరంబగునట్టి - సుదతిగా సభికులను - నూచించి నిత్యమగు - సుప్రధానం = బంధురంబుగ[1] జేసి - బ్రతుకు పర్యంతంబు - బహుగా ప్రేమించిన భర్త యగు యేసూ ||మంగళము||

2 నిత్యమైన ప్రధాన - నిర్ణయము విడిపోయె - నీచక్రియలయందు నిల్వ సతి = సత్యవాగ్దత్తంబు - సర్వాంతఃకరణము చే - పదవి[2] నేర్చిన - స్వామియగు క్రీస్తూ ||మంగళము||

3 నిన్ను విడచి పెట్టి - నిజము పరులను బట్టి - నిందపాలై మరల - నిన్ను జేర = కన్న తండ్రి ప్రేమ - కన్న మించి దాని - కౌగలించుకొనెడి - కర్త యగు యేసూ ||మంగళము||

4 సంఘ మనెడి సతి-సకల కష్టము లొందు-సర్వసిద్ధమై యుండు-సమయమందు = అంగద లెడబాప[3]- అవని కే తెంచి నీ - యసువు[4] నిచ్చి నట్టి - ఆర్త బంధువుడా[5] ||మంగళము||

5 అవని కే తెంచి నీ - యసువు నిచ్చుట వింత - అత్యంత ప్రేమ కే - మాధారము = ఎవరు ఎన్ని దినము - లెంత యోచించిన - యెరుగ తరము గాదు - యేసు నాధుండా ||మంగళము||

6 ఎంత వింతను ప్రేమి - కెంతి యనంతంబు[6] - ఎంత యగాధ మి - వెంత శ్రేష్ఠ = మంత యింతన లేమ - మూల్యమైన ప్రేమ - అమలుండా[7] నిత్యుండా - వ్యంత రహితుండా ||మంగళము||

7 నిశ్చితార్థమునకే[8] - నిత్య సహవాస - నిర్వాహకము[9] మెందు - నిలిచియున్న = ఆశ్చర్యకరమైన - ఆనందంబున పెండ్లి - కందగలిగిన సతికి - ఆనంద మెంతో ||మంగళము||

---

1 బాగుగా 2 దక్కగా 3 ఆపదలు పోగొట్టుటకు 4 ప్రాణము 5 కష్టములలో నున్నవారిని ఉద్ధరించువాడా 6 తెంపులేనిది 7 పరిశుద్ధుడా 8 ప్రధానమునకే 9 కలిగియుండుట

8 నిన్ను గూడిన సతికి – నెన్నతరముగాని – అన్ని విధముల మేలు లమరియుండు= మున్ను గూడిన సతికి – ముక్తి పదవి నిచ్చె –సుదతులార రండి – సదయు సన్నిధికి ||మంగళము||

9 సభను నీ కున్నట్టి – సంబంధ మిల దెల్ప – సరసమైన పాట – సొలొమోను = విభవంబుగా బాడె – వినుతి కెక్కిన పేర – విజయంబు విజయంబు – నజరేత్వీహారా[1] ||మంగళము||

10 ఇపుడు సంబంధించు – నీ దంపతుల దత్త – మీ దేర్చి కృప నధిక – మిచ్చి భువిని = సఫలముగ దీవించు – సంబంధ మిహమందు – సార వంతుడ నిన్ను – సన్నుతించుటకు ||మంగళము||

11 సర్వోన్నతంబైన – సకలంబులో నీకు – సన్నుతి భువియందు – సమ్మతింపు = సర్వజనులయందు – సరగ కటాక్షంబు – సంపూర్ణమగు గాక – సత్కృప చేత ||మంగళము||

---

## 176 *Seeking God's Blessing.*

దైవాశీర్వాదము వెదకుట.

ప్రభు మార్గములయందు – భయ భక్తి నిందు – శుభ రీతి నడిచే – పురుషుండే ధన్యుండు ||ప్రభు||

1 అపుడు నీచే కష్టం – బారగించుదువు – ఎపుడు ధన్యుడవు నీ – కిల మేలౌ గాక ||ప్రభు||

2 నెలవు ప్రక్కల నున్న – సఫలమౌ ద్రాక్ష – తీగెల పోలి నీ భార్య – ఫలమిచ్చునుగాక ||ప్రభు||

3 పిల్ల లిప్ప మొక్క – పెంపువలె నీదు – బల్ల జుట్టుకొని శో – భిల్లు దురుగాక ||ప్రభు||

---

1 నజరేతునందు తిరిగినవాడా

4 ప్రభున కిదిగో భీతి - పడువా డీ రీతి - విభవంపు దయ[1] నొంది - వికసించును గాక ॥ప్రభు॥

5 ప్రభువు సియోన్ను నుండి - ప్రశస్తానుగ్రహము[2] - ప్రబలంబుగా నిచ్చి - బ్రతికించును గాక ॥ప్రభు॥

6 అరయు[3] బ్రతికెడి రోజు - లన్నిట నీవు-యెరుషలేము క్షేమంబు-నెపుడు జూచెదవు ॥ప్రభు॥

7 నీదు పిల్లల పిల్లలు - నిజ మిశ్రాయేలు- మీది క్షేమము జూచి-మోద మొందెదరు ॥ప్రభు॥

8 తండ్రి కుమార - శుద్ధాత్మునకు మహిమ- మెండై యుగ యుగము లం - దుండు గాక ఆమెన్ ॥ప్రభు॥

---

## నిత్యజీవము—మరణము, భూస్థాపనము.

## 177 *With years opprest, with sorrow worn.*

ధాయ : ఉన్నపాటున వచ్చుచున్నాను.

రా—అసావేరి. తా—చాపు.

ఎంతో కాలము తీరి - చింతా క్రాంతుడనై నీ - చెంత జేరితి రక్షకా = వంత లణుమగ[4] - వ్యాధి కలుగగ - వెడలి పోయిన[5] హస్తములతో - చింత నిండిన నేత్రములతో - చెంత జేరితి జేర్చుకొనుమయా ॥ఎంతో॥

1 దయతోడ నా చిన్న - తనమందు నా మొరల - రయముగ విని యుంటివి = ప్రియ జనని క - న్నను నధికముగ - ప్రేమతో నను బెంచి నాడవు - వయసులో నుండగను నీ భయ - భక్తులను నన్నుంచి నాడవు ॥ఎంతో॥

---

1 గొప్పదగు దయ 2 మిగుల మంచిదైన దయను 3 విచారించగా 4 కష్టము లణచి వేయగా 5 బలహీనమైన

2 ఘనుడా, వేయ్యేం డ్లొక్క - దినము వంటివి నీకు - గనబడు నిన్నటివలె నే= దినము లిటు తరిగినను నీవును - ఘనముగల నీ కృపయు దరుగుట - విన గనంగను రాదు ప్రభువా - వికృత మది[1] నీయందు లేను ||ఎంతో||

3 బలహీనమైన నా - స్వర మెత్తి నే నింత - సరకు ననుభవించిన= నెల యెఱంగని - ప్రేమ బాడుదు - వలయ కుంచెగ తుదను మూతల-కల[2] స్వరంబులతోడ నా శృతి - కలియు పర్యంతంబు బాడుదు ||ఎంతో||

4 నేను వృద్ధుడై లేని - పోని చింతలు గలుగ - నీ నామ బలమే నాకు = పూనికయు బల - మును నొసంగును - మోకరింపను శక్తి నిచ్చును- నీ నిమిత్తము పాట బాడుదు - నిశ్చయంబుగ సంతసముతో ||ఎంతో||

---

## 178 *Vanity of Vanities.*

లోకము మాయ యనుట.

రా__యదుకుల కాంభోజి. తా__ఆది.

మాయలోని మాయ సర్వము - మాయ లోక మాయెగ = కాయము[3] సముపాయము నా-దాయ[4] మెల్ల మాయెగ ||మాయలోని||

1 మంటిలో సర్వంబు పుట్టి- మంట గలసి పోవుగ = ఒంటిగా వచ్చెడి యాత్మ - యొంటిగానె పోవుగ ||మాయలోని||

2 పుట్టుచుండు నొక్కడు మృతి - బొందుచుండు నొకడుగ = ఇట్టి మార్పులు గల్గుచుండు - నెల్ల వేళల నిజముగ ||మాయలోని||

3 ఎంత సంపద్భోగము కా - సంతలో నే వీడుగ = సంత గొల్లు దీరినట్లు - సర్వ ముడిగి పోవుగ||మాయలోని||

4 రూపులు వీక్షించు[5] కంటికి - చూపు తృప్తి లేదుగ=మాపు రేపు లేని చోటు - జూపు జూపే చూడుము ||మాయలోని||

---

1 చంచలించు బుద్ధి 2 ఘనుడమైన 3 శరీరము 4 సంపాద్యము 5 చూచు నట్టి

5 డెందమానందంబు నిండు - బొంద దీ జగమందున = అందము గను క్రీస్తు పాద - మందు భక్తి నిల్పుమి ||మాయలోని||

6 ఆస లెల్ల గాలి మూట - లట్లు గా కేమబ్బెను=యేసు నామా మృతము గ్రోలు[1] - మింతియే సారంబుగ[2] ||మాయలోని||

---

## 179 *Christ's Love before everything.*

క్రీస్తు సాటికి లోకము తుచ్ఛమైనది

రా—మారువా. తా—అట.

ఏమి లేదు సుమీ జగములో యేసుని - ప్రేమ సారము కన్నను - సోదరులార - ప్రేమ సారము కన్నను = పామరం[3] బేటికి వృథా కను - దామరలు[4] మాయగనె చీకటి - యా మనంబున నెల్ల సత్యము - గామి[5] గని సర్వంబు విడువు ||డేమి లేదు||

1 దార[6] పుత్రాది బంధు శ్రేణిపై[7] మమ - కార భావము జెందుచు - దద్విషయమై - కోరి దుఃఖము లొందుచు - భ్రమ గుందుచు = భూరి మాయా జాల బంధా - కార[8] మిది యని తెలియ కీ సం - సార మంతయు నాది నాదని - యూరకే చెడి పోవ నేటికి ||నేమి లేదు||

2 ఈ దేహమునకు ప్రాణమునకు సంబంధ - మించుకైన గలదా - దేహాత్మలకు - భేదము గనవలదా - బుద్ధి గొనవలదా = ఆది నే దేహమున నాత్మ స - మాదరంబున[9] నుండు నా తను - వీ ధరిత్రిని విడిచి చనునపు- డే దయామృత వార్ధి[10] దిక్కగు ||నేమి లేదు||

---

1 త్రాగుము 2 ముఖ్యమైనది 3 మోహము 4 పద్మములవంటి కన్నులు 5 కాకపోవుట 6 భార్య 7 సమూహముపై 8 వల త్రాళ్ళవంటిది 9 మిక్కిలి ఆదరణయందు 10 దయారసమునకు సముద్రమువంటివాడు

3 జాయ[1] పుత్రోద్యాన గృహ విత్త[2] ట్టాలక[3] _ సకల వస్తు
జాలము - ప్రతిష్ఠాను[4] - భూతి[5] విధేయులు - నఖిల సంపదలు = నీ
యనని లోపల సమర్పణ - జేయగా బడు గాని యించుక - తోయమును[6]
గొనిపోవ శక్యము - లేయవా భ్రమ నొంద నేటికి ॥నేమి లేమ॥

---

## 180 *The Believer's Old Age.*

భక్తుని వృద్ధాప్యము.

రా___కాంభోజి. తా___జంపె.

సకలేంద్రియములారా - చాల మీ పని దీరె-యిక మీరు నా జోలి
విడువ వేళాయెన్ = చకిత[7] మృగశాబకము[8] పోలిక _ నకట మీచే
జిక్కి-తిని మీ - రిక దొలంగుడు యేసు నా ర - క్షకుడు వచ్చెను నన్ను
గావను ॥సకలేంద్రియము॥

1 పంచేంద్రియములారా - బల ముడిగె మీ కిపుడు _ వంచన[9] సేయ
మీ వశముగా దికను = మించి మీ రెగిరింప లేరు ద - లంచి చూడుడు
దేవ కృపలో - నుంచి నను గదిలింప మీ శది - కొంచెమగు పనికాదు
సుండి ॥సకలేంద్రియము॥

2 శ్రవణేంద్రియమా[10] నీకు - శక్తి తగ్గుచు వచ్చె - వివిధ వార్తలు
దగిలి వినుచుంటి వెంతో = చెవుడు నీ కిపు డనుసరించెను _చేవ[11] దరిగెను
జరిగిపొమ్మిక _సవినయంబుగ నేను క్రీస్తుని_శబ్ద మాలించెదను సుఖ
మని ॥సకలేంద్రియము॥

3 కనులారా మీ వెల్గు - క్రమముగా క్షీణించె_మును జూచు
చూడ్కి-లో[12] ముసుగయ్యె నికను =ఘనము గల దేవుని కుమారుడు_తన
కృపాసన మపుడు జూపను - మనసు లోపల కన్ను విప్పెడి-దినము లివె
జనుదెంచె చూడుడు ॥సకలేంద్రియము॥

---

1 భార్య 2 ధనము 3 కోటబురుజు 4 కీర్తి 5 అనుభవము 6 జలమును
7 బెదరిన 8 లేడి పిల్ల 9 మోసము 10 ఓ చెవి 11 బలము 12 చూపులో

4 రసనేంద్రియమా[1] నీ నీ - రస[2] కాల మిదె వచ్చె - విసుకని మాటలను వెదజల్లినావు = పస[3] దరిగి ముదివైతి విపుడో - రసనమా యిక దీరె నీ పని - వెసను[4] నే నిదె యేసు కరుణా - రసము గ్రోలుచు ప్రొద్దు బుచ్చెద ||సకలేంద్రియము||

5 తను వాద్యంతము[5] మూయు - దగిన త్వగింద్రియమా[6] - నిను సోకు నట్టివన్నియు గ్రహించితివి = మునుపుగల నీ జిగి[7] బిగియు[8] నణ - గెను గదా ప్రేలాడె తిత్తులు - జనుము నీ వెంద్వైన నే నే - సుని స్వరూపము దాల్ప బోయెద ||సకలేంద్రియము||

6 ఘ్రాణేంద్రియమా[9] నీవు - కడు వాసనల దగిలి - ప్రాణానిలము[10] చేత ప్రబలితి వికను = నాణెమైనవి విడును దుర్గం - ధముల పొల్పడబోను విక నా - ప్రాణపతి[11] యగు క్రీస్తుచేతను - ప్రాణ మర్పింతును సుఖింతును ||సకలేంద్రియము||

7 కడు దవ్వు[12] పయనంబు - నడిచి వచ్చితి నింక - నిడుపు[13] లేదా త్రోవ నికటమై[14] వచ్చెన్ = నడుమ నడుమను నడ్డుపడియెడి - నిడుమలన్నియు గడచి పోయెను - జడుతునా మృతి నదికి నా ర - క్షకుడు వచ్చెను నన్ను గావను ||సకలేంద్రియము||

8 వెనుక దీరిన మార్గ - మున కంటె ముందుండి - కనుపించు నా త్రోవ కఠినమై యుండు = ఘన తరంగ ధ్వనులతో భీ - కర మరణ నది పారుచున్నది - క్షణము మాత్రమె దాని పనియా - వెనుక నావలి యొడ్డు జేరెద ||సకలేంద్రియము||

9 ఈ సంసారంబునం - దేమి సౌఖ్యము గలదు - ఆస మాత్రమె గాని యది చిరముగాదు = యేసు క్రీస్తుడు తండ్రి దేవుడు - భాసురంబగు

---

1 ఓ నాలుకా ! 2 బలహీన 3 సారము 4 శీఘ్రముగా 5 శరీరము మొదటినుండి చివరి వరకు 6 ఓ చర్మమా ! 7 కాంతి 8 గట్టితనమును 9 ఓ ముక్కా ! 10 ప్రాణవాయువు 11 రక్షణాధికారి 12 దూరమ్ము 13 దీర్ఘము 14 కష్టమైనదై

నిర్మలాత్మయే - దాసులకు దమ దివ్యమగు కృప - జేసి నిత్య నివాస
మిత్తురు ॥సకలేంద్రియము॥

---

## 181 *The Believer's Life-Journey.*

భక్తునియొక్క జీవిత ప్రయాణము

రా—ముఖారి. తా—ఆది.

పైనమై యున్నానయ్య నీ - పాదాంబుజముల[1] సన్నిధికి - ప్రభు
యేసు నాతో నుండవే నీవు = దీనుడ భవ దాధీనుడ[2] నను కృప - తో
నడిపించు మెదుట నదె సింహ - ధ్వానముతో[3] మృతి వచ్చుచున్నది -
దాని భయోత్పాతము[4] దొలగింపవె ॥పైనమై॥

1 సరణిలో[5] నే బోవునపుడు - శ్రమ లెన్నెన్నో చనువెంచి నా -
పరుగు కడ్డముగా నిలుచును ఏమో = మరణపు ముండ్లను విరుచుటకును
త - ద్దురవస్థలు వెసదొలగించుటకును - కరుణానిధి నా సరస నుండుమీ -
శరణాగతునకు[6] మరి దిక్కెవ్వరు ॥పైనమై॥

2 దేవా నీ దక్షిణ హస్తముతో[7] - దీనులను బట్టెద వెరవకుడను నీ -
వాగ్దత్తంబున కిది సమయంబు = ఆ వచనము నా జీవాధారము - దైవము
తల్లియు తండ్రియు దాతవు - నీవే సర్వము నిను నమ్మితి నా - త్రోవ
ప్రయాణము తుద ముట్టించుము ॥పైనమై॥

3 పొందుగా నీ భక్తి యందు - డెంద మానందించు నపుడు - సంది
యము లెన్నెన్నో చనుదెంచి = తొందర నిడు[8] నా త్రోవను దగ్గా -
ఢాంధత[9] మిశ్రము లణగించుటకై - సుందరమగు రవి[10] చందంబున నా -
ముందట నడువవె ముదమున ప్రభువా ॥పైనమై॥

---

1 పద్మములవంటి పాదములయొక్క 2 నీకు లోబడినవాడను 3 సింహ గర్జనముతో 4 భయమువలన కలుగు ఉపద్రవములు 5 త్రోవలో 6 శరణు జొచ్చినవానికి 7 కుడిచేతితో 8 కలిగించును 9 ఆ గొప్ప కటిక చీకటియందుండు 10 సూర్యుని

4 కాలం బయ్యేను రా రమ్మనుచు - నీల మేఘాకృతితో[1] వచ్చి - కాల దండము[2] జిరజిర[3] ద్రిప్పుచు = చాల భయానక[4] లీలన్[5] మృత్యువు - మ్రోల[6] న్నిలిచిన వేళను తాలిమి[7] - దూలి చనుం గాబోలు భవత్కరు - ణా లింగన సుఖ[8] మత్తరి[9] నొసగవె ||పైనమై||

5 నీ దివ్య రూప ధ్యానంబు-నిర్మలాత్మాంతర సౌఖ్యంబు-నా దేవుని[10] ప్రేమామృత సారంబు = నీ దాసుని కవి నిరతి మొసంగుచు - నా దారిని గల సేదలు దీర్పను - నాదియు మధ్యము నంతము లేని పు - నామలు గల నీ సౌధము[11] జేర్పవె ||పైనమై||

6 ఎండమావుల కీడైనట్టి[12] - ఇహ సౌఖ్యములు త్వరగా బోవు నీ - నిండు దరుగని నిత్యానందంబు = దండిగ నీయం దుండిన వారి క - ఖండామృత సౌఖ్యము లిచ్చెదవట - తండ్రీ నీ ప్రియమగు వారిని నీ - వుండిన చోటనె యుంచుము చాలును ||పైనమై||

---

## 182 *Comfort in Trouble.*

కష్టకాలపు ఓదార్పు.

రా—ముఖారి. తా—జుల్వా.

జడియకుము నేనే యున్నానని - కడు సెనరా[13] మా టిచ్చిన యేసుని - అడుగుజాడలు వెంబడించి - నడుచుకొనరాదా - జీవా - ఇడుమ లధికము గలిగిన ప్రభువు - కడకు జేరరాదా ||జడియ||

1 ఇప్పుడు నిన్ను బాధపరచెడి - ముప్పులం దలపోసి తప్పక - గొప్ప ప్రేమార్థంపు శిక్షకు - నొప్పియుండరాదా - నీ - తప్పులన్ విడి ప్రభువునందు - మెప్పు బొందరాదా ||జడియ||

---

1 కారుమబ్బుల ఆకారముతో 2 యముని చేతికర్రను 3 గిరగిరమని 4 భయమును కలిగించునట్టి 5 రీతిగా 6 ఎదుట 7 ధైర్యము 8 నీ కరుణచేత నన్ను కౌగలించు కొనగా గల్గు సౌఖ్యమును 9 ఆ సమయమునకు 10 దేవునియొక్క 11 గృహమును 12 సమానమైనట్టి 13 దయగల

2 ఘనమౌ ధనము సౌఖ్యంబు బోయి వ్య-సనము శోధన మున్న యోబు -మనసు దృఢము చేసి ప్రభుని-మహిమ పరచలేదా- నీ మనసు దృఢం బటుల జేసి-మహిమ పరచరాదా ||జడియ||

3 బీద లాజరుండు భువిని-బాధ నొందిన సాదృశ్యంపు[1] -బోధన నీ మానసమున[2] - పొనుకొనలేదా - అతి -డాదరించబడిన విధము మోద మియ్యలేదా ||జడియ||

4 మున్ను స్తెఫనును రాళ్ళతో గొట్టు-మన్న పగతుల కొరకు దేవుని-మిన్ను వైపున జూచి యోర్చి-మన్న నడుగలేదా-నీ-మన్న శ్రమ లటు లోర్చ ప్రభువు-తెన్ను[3] జూపలేదా ||జడియ||

5 భక్త జనులను ఖైదుగ నిడ్చి - బాధలు గావించినప్పుడు - శక్తి హీనుల మంచు యేసుని-శక్తి నమ్మలేదా-ఆ- యుక్తసాయము దొరకు దనుక నా-సక్తి నుండలేదా ||జడియ||

---

## 183 *Burial of a Child.*

శిశువుయొక్క భూస్థాపనము.

రా—మారువా. తా—ఆట.

శోక మేల-శిశువు కొరకు-శోక మేల-శిశువు కొరకు= నాకమున[4]-నుండు దగ-లోకేశుని[5] గొల్చుచును ||శోక||

1 యేసు క్రీస్తు - తీసికొనియె = దాసు డగు-బాలకుని - నాసచె గాచుటకు ||శోక||

2 క్షేమముగను-జేర్చుకొనియె = ప్రేమ గల-రక్షకుడు-ప్రేమచే బాలకుని ||శోక||

3 కడిగివేసె-జెడుగు లెల్ల=గడిమి[6] గల-రక్షకుం-డిడును గడు భాగ్యములు ||శోక||

---

1 ఉపమానములోని 2 మనస్సులో 3 మార్గము 4 పరలోకమందు 5 లోకమునకు ప్రభువైన వానిని 6 శక్తి

4 తొలగిపోయె - బాధ లెల్ల = నిలను కల - శోకంబులు - క్షితి
పాలయి పోయె[1] నిక ॥శోక॥

5 చనియె శిశువు - కనియె సుఖము = చనువుతో[2] - నుండు నిక -
ఘనుని కడ నెప్పుడును ॥శోక॥

---

## పునరుత్థానము.

## 184 *Jesus coming in glory.*

యేసు మహిమతో వేంచేయుట.

రా—ఘంటా. తా—ఛాప్.

మహిమతో మన యేసు - ఇహమునకు[3] వేంచేయున్ = సహో
దరులారా మన మా - మహిమలో వెలుగుదుము ॥మహిమతో॥

1 మంటి పురుగుల మమ్ము - కొంటివి నీ రక్తముతో = నంటు నా
మహిమలో - నంటి నుతియించెదము ॥మహిమతో॥

2 మోములు వంచి యేసు - నామము నుతియించి = పామరులమైన
మనల - ప్రేమతో గప్పినాడే ॥మహిమతో॥

3 పాత్రులమా మేము - శత్రులమే కాదా = మిత్రులఁ జేసిన వి-
చిత్రము తెలియ లేము ॥మహిమతో॥

4 శిరములపైన జీవ - కిరీటములతోను = పరమ దేవుని వరములు -
మురియుచు మరువలేము ॥మహిమతో॥

5 వీణెలతో మనము - నాణెమైన పాట = ఋణము చెల్లింప లేమని -
యణగి మణగి పాడుదము ॥మహిమతో॥

---

1 నశించి పోయెను 2 ప్రేమతో 3 ఈ లోకమునకు

## 185 I'm but a stranger here.

ఛాయ: ఆనందమగు ముక్తియే నా మందిరము.

రా—సురటు. తా—ఆది.

పరలోకమే నాదు - స్థిరమైన గృహము - ధరమీద పనియింతు - పరదేశి వలెనే ‖పర‖

1 ధర భీకరంబౌ నెడారియై యుండి - వెరపు చేసెడి[1] వెతల[2] - కిరవై[3] యున్నదిగా = పరలోక రాజ్యముతో - బహుగ నా స్వంత - పురమును నా తండ్రి - భూమిపై వెలయు ‖పర‖

2 ఇల నెన్ని గాలి వా - నలు చుట్టుకొన్నన్ - కొలది కాలమె యాత్ర - గలను; భయమేమి? = పలు కష్టములు వేగ - తొలగి నా యిల్లు - కొలది కాలములోనే - వెలయ చేరుదును ‖పర‖

3 పరమందు రక్షకుని - ప్రక్కనే నిలచి - కర[4] మహిమ నొందు దును - గలిసి భక్తులను = వర రక్షకా, నేను - పరగృహము చేరి - నిరతంబా ప్రియులతో - నిలువంగ నిమ్ము ‖పర‖

4 క్షితిపైన నేనెట్టి - స్థితియందునున్న - వెతలేని సంతుష్టి - మతి నిచ్చి గావు = మతలంబు[5] విడ నీదు - కుడి చేతి ప్రక్క - నతిమోద మిమ్ము నా - గతివైన యేసూ ‖పర‖

---

## 186 Looking Heavenwards.

పరమ భాగ్యము కనిపెట్టుట.

రా—శ్రీ. తా—ఆట.

యేసును జూచుట యెన్నటికో - పరవాసుడ నగుట యెన్నటికో = భాసురముగ నా పరమ జనకు సిం - హాసనమున దూతాలిల మధ్యను ‖యేసును‖

---

1 భయము కలిగించు 2 దుఃఖముల 3 స్థానమై 4 గొప్పదగు 5 ఈ లోకము.

1 బలితంబగు[1] పైశాచిక[2] బంధన - పాశము[3] వదలుట యెన్నటికో = సలలితముగ[4] నా సద్గురు పాద - స్థలమున నెరుగుట[5] యెన్నటికో ||యేసును||

2 ధాత్రి కష్ట దుఃఖాబ్ధిని[6] మన మిక - ధాటిగ దాటుట యెన్నటికో = మైత్రితోడ పరమాత్ముని చెంతను - మనసు తీర మను[7] టెన్నటికో ||యేసును||

3 కాంచన[8] మకుటము[9] కనకపు వీణయు - ఘనముగ దాల్చుట యెన్నటికో = అంచితముగ హల్లెలూయా పాటల - నానందించుట యెన్నటికో ||యేసును||

4 శోధన బాధల నీ ధర బొందక - శోకము గెల్చుట యెన్నటికో = సాధూత్తమ జన సాంగత్యమ్మున - సంతస మొందుట యెన్నటికో ||యేసుని||

5 నీతి రహిత పైశాచిక భట గణ[10] - నిందలు బాయుట యెన్నటికో = ఖ్యాతిగ శ్రీ పరమాత్ముని కొలువున - గట్టిగ కుమురుట యెన్నటికో ||యేసును||

6 జరయు[11] వ్యాధి సంశోక[12] మరణములు - జొరని చోట నుండుట యెన్నటికో = పరిశుద్ధతయును బరమానందము - ప్రబలు పదము జేరు టెన్నటికో ||యేసును||

7 భూనభః[13] ప్రభు విచ్చేడి ఫలములు - బొంగి భుజించుట యెన్నటికో = జానుగ[14] నిత్యము జీవ జలమ్మున - సంతుష్టుడ నగు టెన్నటికో ||యేసును||

---

1 మిగుల బలమైన 2 పిశాచి సంబంధమగు 3 కట్టుత్రాళ్లు 4 చక్కగా 5 నమస్కరించుట 6 దుఃఖమను సముద్రము 7 జీవించుట 8 బంగారపు 9 కిరీటము 10 సైతానుకు సంబంధించిన సేవక సమూహముల వలన కలుగు 11 ముసలితనమును 12 దుఃఖముతో గూడిన 13 భూమికిని ఆకాశమునకును 14 బాగుగ

## 187 *The Day of Resurrection.*

పునరుత్థాన దినము.

రా—పంతువరాళి. తా—ఝాప్.

లేచు దినము వచ్చును - మృతులెల్ల నిక - లేచు దినము వచ్చును = లేచి యిల నున్నట్టి - విమలు[1] లెల్ల నపుడు - లేచి ప్రభుని నెదురు - కొందు రానందముతో ॥లేచు దినము॥

1 యేసు మేఘా రూఢుండై - యిలకు దిగ - వాసిగా దూతలపుడు = భాసురంబుగ బాకా - పైని నాదము సేయ - భూ సమాధుల నున్న - భూరి[2] జనులు లేతురు ॥లేచు దినము॥

2 కడ బూర ధ్వని సేయగ - మడిసిన[3] వారు - తడవు సేయక లేతు రే = యెడతెగక ప్రభువు నొద్ద - గడు సంతసంబుతో - విడనాక యుందు రా - విమల లోకమందు ॥లేచు దినము॥

3 ఘన మహిమన్ ప్రభువు రాగా - గడలి[4] యపుడు - తన యందుండెడి శవములన్ = ఘనముగ గాననము[5] - దనయందుండెడు మృతులన్ - వినయంబుతో దెచ్చి - విభుని కప్పగించు ॥లేచు దినము॥

4 అరయంగ నీతిపరు - లానందమున న - క్షయ దేహులై[6] వెల యుచుగా = జిరతరానందంబు[7] - బరలోకమున నెప్పుడు - స్ఫురిత[8] జీవను లగుచు - బరమ సుఖ మొందుదురు ॥లేచు దినము॥

5 కరుణలేని సమాధీ! నిరతము నన్ను - జెరబట్టి యుంచగలవే = వరదుండు[9] క్రీస్తుండు - వరదూత సేనలతో - బరివేష్టితుడై[10] యదిగో - పరతెంచుచున్నాడు[11] ॥లేచు దినము॥

6 మరణమా! నీ ముల్లేదే - నరులను నింక - వెరపించు[12] చుండ గలవే = మరణ సంహారుండు - మహిమతో నరుదేరన్ - మరణం బడుగు బడి య - మరత్వం[13] బిక నుండున్ ॥లేచు దినము॥

---

1 పరిశుద్ధులు 2 అనేకులగు 3 చనిపోయి నటువంటి 4 సముద్రము 5 అడవి 6 నాశనము పొందనట్టి శరీరము గలవారు 7 నిత్యానందము 8 ప్రకాశించెడి 9 వరముల నిచ్చువాడు 10 చుట్టుకొనబడినవాడై 11 వచ్చుచున్నాడు 12 భయపెట్టు 13 చావులేని స్థితి

7 మరణ మొందలేదా - ప్రభు యేసు నీ - చెరలో నుండ లేదా = పరమేశు తనయుడు - మరణ సమాధులన్ - బరిపూర్ణముగా గెల్చి - చెరను జెరగను బట్టె ||లేచు దినము||

8 చేరి యేసుని పజ్జను[1] - మరియొక సారి - చెరపట్ట కల దానవే = ఘోరమగు నీ బారు[2] - లన్ని మా రారాజు - పారగొట్టె నిన్ను - గాళ్ళ మట్టెను[3] గదా ||లేచు దినము||

9 మంగళములు పాడరే - క్రీస్తుని జయ - మంగళములు పాడరే = మంగళములు పాడి - మంగళ ప్రదుడైన[4] - శృంగార రాజునకు - సంగీతంబులతోడ ||మంగళములు పాడరే||

---

## న్యాయపు తీర్పు.

## 188 *Christ's glorious Advent.*

క్రీస్తుయొక్క ప్రకాశమైన రాకడ

రా—ముఖారి. తా—ఆది.

నాడు వచ్చినట్లు గాదు - నేడు వచ్చుట = తేరి - చూడరాదు క్రీస్తు నింక - జొత్తు[5] మెచ్చుట ||నాడు||

1 మొదట గొఱ్ఱెపిల్ల రీతి - నొదిగి[6] వచ్చెగ = నిపుడు - కొదమసింహ మయ్యె మనకు - గుండె దిగులుగ ||నాడు||

2 దాసుని వలెను దొల్లి[7] - జూచినాముగ = నిపుడు - దోసము లెంచి దండింపగ[8] - దొరయై నాడుగ ||నాడు||

3 ఏ తట్టు బోయిన మనకు - నెదురు వచ్చెగా = పిడుగు - రీతి వాని యుగ్రమైన - దృష్టి హెచ్చెగ ||నాడు||

4 కొండ పండ[9]లందు డాగి - యుండలేముగ = వాని - యంపనుండి మండు నగ్ని - యదిగో వచ్చెగ ||నాడు||

---

1 చెంత 2 సమూహములు 3 త్రొక్కెను 4 శుభముల నిచ్చువాడు 5 ప్రవేశింతుము 6 లొంగి 7 పూర్వము 8 శిక్షించుటకు 9 బండలు గుహలు

5 దిక్కుగా నున్నట్లు నితర - దేవతలను నమ్మి = వట్టి - పుక్కిటి[1] పురాణములకు - బోయి చెడితిమి ॥నాడు॥

6 వీధుల బోధించు వారి - వినక పోతిమి = ఇపుడు - బాధ బొంది నరకాగ్నిలో - బడ బాలైతిమి ॥నాడు॥

---

## 189 *The Last Day.*

అంతమునాటి భీకరత్వము.

రా—పంతువరాళి. తా—ఆది.

అయ్యో యిది యెంత దుఃఖము - ప్రభు తీర్పు వేళ నయ్యో యిది యెంత దుఃఖము = సయ్యన[2] యెహోవా సింహా - సనము చుట్టు వహ్ని[3] మండు - నయ్యెడ విశ్వాసులను దు - రాత్మల కగు నిత్యభేద ॥మయ్యో॥

1 తల్లి పిల్లలు గూడుదు రచట - తండ్రి తాత లచట కలియుదు = రెల్ల కాల ములకు నుండ - కేడబడి[4] మరి యెప్పుడు చూడ ॥రయ్యో॥

2 అన్నదమ్ము లచట గూడుదు - రక్క చెలియ లందు గలియుదు = రెన్నడు మరి చూడరాని - యెడగల స్థలములకు బోదు ॥రయ్యో॥

3 భార్య భర్తలు గూడుదు రచట - బంధు మిత్రులు కలియుదు రందు = గార్య భేదము వలన సార్వ - కాలము మరి కూడ జాల ॥రయ్యో॥

4 క్రీస్తు మత ప్రబోధకులు స - మస్త శిష్యులు కూడుదు రచట = వాస్తవ స్థితు లెరుగ బడిన - వల్లనె విడబడుదు రంద ॥రయ్యో॥

5 శిష్టులు[5] దుష్టులు కూడుదు రచట - స్నేహ వంతు లందు గలియుదు = రిష్టము గాని భిన్ను లగుచు[6] - నిక మరియెన్నటికి గూడ ॥రయ్యో॥

6 అల పిశాచి పాపు లందరు - నపుడు కర్తకు భిన్నులగుచు = పలు గోరుకుల[7] నిత్య నరక - బాధల పాల్ బడకపోరు ॥అయ్యో॥

---

1 అబద్ధపు 2 శీఘ్రముగా 3 అగ్ని 4 ప్రత్యేకింపబడి 5 మంచివారు 6 వేరైనవారై 7 వళ్ళు కొరుకుటలతో

7 సాధు సజ్జనంబు లెల్ల - సకల దూతలతోడ గూడి = మోదముతో ప్రభుని వెంట - ముక్తి కేగి నిత్యు లగుదు ॥రావా॰ యిది యెంత విజయము - ప్రభు తీర్పువేళ - నావా॰ యిది యెంత విజయము॥

---

## మోక్షానందము.

## 190 *Heaven is my home.*

మోక్షము విశ్వాసుని గృహము.

రా___సురటు. తా___అట.

ఆనంద మగు ముక్తి_యే నా మందిరము = జ్ఞాని మానుగ జూచు - దాని సుందరము ॥ఆనంద॥

1 పరదేశి వలె దేహ - వరణమం[1] దుందున్ - ధరణి కానన ముగా[2] దర్శింపు చుందున్ - నెరి దుఃఖ సుఖములు - సరిగా భావింతున్ = పరిశుద్ధాత్ముని వేడి - పరితృప్తి[3] నుందు ॥నానంద॥

2 బహు శోధనలు నాపై - బడి వచ్చునపుడు - నహితాంధతమము[4] న-న్నడ్డుకొన్నపుడు - నిహ బాధ లన్ని న - న్నెదిరించి నపుడు = నహహా యేసునివల్ల - నమృతుఁడ[5] నెపుడు ॥నానంద॥

3 ముందు నా మనసు దే - వుని కప్పగింతు - నందరి నస్మత్తుల్య ముగా[6] బ్రేమింతున్ - సందేహ రాహిత్య[7] - సరణిలో[8] నిల్తుం = బొంద బోయెడి ముక్తి - భువియందె గాంతు ॥నానంద॥

---

1 శరీరమను యింటియందు 2 అడవి 3 సంతుష్టితో 4 కీడు కరమగు చీకటి 5 జీవించు వాడను 6 నాతో సమానునిగా 7 సందేహము లేమియు లేని 8 మార్గములో

# 191 *God will wipe away all tears from our eyes.*

నీతిమంతుల ప్రకాశము.

రా—మారువా. తా—త్రిపుట.

పరిశుద్ధ పరిశుద్ధ-పరిశుద్ధ యని విన-బడు పుర మదిగో-పద
పదరె ప్రియులారా = పరమేశ్వరుని చేత-బరి పాలనము గల్గి-చిరమై[1]
భాసురమై[2] సు-స్థిరమై సుందరమైన ||పరిశుద్ధ||

1 రవి[3]తోను కుముద బాం-ధవు[4]తోను మరి దీప-చ్ఛవి[5]తోను
దాని-కవసర మింత లేదు = అవిరతము[6] క్రీస్తు-డందుండు ప్రభతో[7]
సం-స్తవమై[8] వైభవమై[9] యు-త్సవమై వెల్గుచు నుండు ||పరిశుద్ధ||

2 గోద[10]యైన మరి యే యా-పద యైన దగయైన-మొదలే
లేకుండు నప్పుర వాసులందు = ప్రేమ జీవోదకము ల-ర్మిలి[11] నిరంతర
మిచ్చు-గుదురుగ నెదురుగ-గూర్చుండి యువరాజు ||పరిశుద్ధ||

3 ప్రభు కృపాసనము లో-పలి నుండి ప్రవహించు-శుభమైన
నది యుండి-సుఖ మిచ్చు నచట = నుభయ తీరములందు-నుండు వృక్ష
ములు సౌ-రభ దీప్తి[12] శుభములై-రక్షా ఫలము లిచ్చు ||పరిశుద్ధ||

4 జననంబు మరణంబు-సంసార సుఖ బాధ-లనుభవించుట
గల్గ-దా పురము నందు = మును నీతి కొరకు కొప-దను బొందు తన వారి-
కను నీరంతయు తుడుచు-మన దేవు డందుండి ||పరిశుద్ధ||

5 వెల కందరాని[13] ని-శ్చలమైన ఘన జీవ-విల సత్కి-రీటము[14]-
ల్గల వప్పురమున-బిలిచి నప్పుడె విభుని-పెండ్లి విందున కేగు-కుల
బంధువులకు ని-చ్చల నిచ్చు దేవుండు ||పరిశుద్ధ||

---

1 ఎల్లప్పుడు ఉండునది 2 ప్రకాశించునదై 3 సూర్యుని 4 చంద్రుని 5 దీపము యొక్క కాంతి 6 ఎల్లప్పుడు 7 కాంతితో 8 స్తోత్రములతో నిండినదై 9 భాగ్యము గలదై 10 ఆకలి 11 ప్రేమ 12 పరిమళ కాంతులతో 13 విలువతో కొనుటకు వీలుకాని 14 ప్రకాశమానములగు కిరీటములు

## 192 *Heavenly Joy.*

పరలోకానందము.

రా—నీలాంబరి. తా—అట.

మన మహిమ కొరకై - కొన దిన మే తెంచునట - ఘన మహిమతో యేసు - విను నే తెంచునట ||మన||

1 వినయంపు భక్తులను విందులట - అనయంపు రక్షణ్యా మనుదురు నట - కనకంపు పట్టణమున గందురట - మనములను వినుతులను - ఘనముల గ చేతురట ||మన||

2 ఆ పట్టణమున నానందమట - పాప రహితాత్ములు బతుకురట - మాప శక్యముగాని మహ్మానట - చూపులకు రూపములు - యేసు మీరిన ప్రేమట ||మన||

3 రక్షింపబడిన రాజ్యస్థులట - సక్షేమమున సంచరింతురట - మోక్ష కాంతిని నామోగింతురట - పక్షమగు రక్షకుని - మోక్షమున గాంతురట ||మన||

4 ధగ ధగ యను మకుటము దాల్తురట - యుగ యుగములు నేలుచుందురట - సొగసైన వీణల సారములట - ముగియకను భగవంతుని - మిగుల స్తుతియింతురట ||మన||

---

## 193 *Heaven.*

మోక్ష వర్ణన.

రా—శహాన. తా—త్రిపుట.

దేవ దేవుని గొప్ప పురము=యా పురము ||దేవ||

1 దేవుని పురము—దేదీప్యకరము=జీవమందిరము—జేగియకరము ||దేవ||

2 పరిశుద్ధ పురము - పరమార్ధ కరము = పరమ మందిరము - పరాసైన పురము ||దేవ||

3 ఆనంద పురము - నది నిరంతరము = కౌన దుస్తరము - గల మనోహరము ||దేవ||

4 శృంగార పురము - సుర చిర కరము = బంగారు మెరుము - పర మార్థ కరము ||దేవ||

5 నైషిప పురము - వంద్య మప్పురము[1] = సౌభాగ్య కరము - స్ఫటిక మందిరము ||దేవ||

6 కెంపు పాండురము[2] - కీర్తి బంధురము = ఇంపౌ నగరము - ఇది యేసు స్థిరము ||దేవ||

7 క్షుధ[3] లేని పురము - సుక్షేమ కరము = ముదము విస్తరము - రొదలు[4] దుస్తరము ||దేవ||

8 ఆశ్చర్య పురము - ఆశ్రయ కరము = నిశ్చయ పరము - నిజ దేవ పురము ||దేవ||

9 మాణిక్య పురము - మణుల గోపురము = వీణెల స్వరము - విన మనోహరము ||దేవ||

10 సూర్య భాసురము[5] - చొరనట్టి పురము = కౌర్య మబ్బురము[6] - గావించు గరము ||దేవ||

11 సీయోను పురము - శ్రేయ సాగరము[7] = మాయ విధురము[8] - మరి సంపత్కరము[9] ||దేవ||

12 ఇచ్చు నిబ్బరము - యెరూషలేంపురము = మెచ్చు నబ్బురము - మెరయు నా పురము ||దేవ||

13 ఈ విశ్వంభరము[10] - ఇంగలహారము[11] = జీవోప నిష్కరము[12] - చేరు వేగిరము ||దేవ||

---

1 ఆ పట్టణము కొనియాడబడ దగినది 2 ఎరుపు, తెలుపు, వర్ణములు గలది 3 ఆకలి 4 కిలకిల ధ్వనులు 5 సూర్య కాంతి 6 ఆశ్చర్యము 7 శుభములతో గూడిన సముద్రము 8 మాయ లేనిది 9 భాగ్యము కలుగజేయునది 10 భూమి 11 అగ్నిచే కాల్చివేయ బడునది 12 జీవ మార్గము

## 194 *Heavenly Feast.*

పరమ విందు.

రా—యమునాకళ్యాణి. తా—జాల్వా.

విందు పరమందు పెండ్లి - విందు పరమందు = పొందు జనుల డెందము లానందము నొందు ||విందు||

1 సత్య సంధుడైన యేసు - స్వామికి సభను = నిత్య ప్రధానము యెహోవా - నిర్ణయించెను రండు ||విందు||

2 నీతి కనికరముల తోడ - నిను ప్రధానము = ప్రీతిగా నొనరించితి నని - బిలచె సత్యము రండు ||విందు||

3 ఎన్నడు విడనాడను నే - నెంత మాత్రము = నిన్నెడ బాయ నను మాట - నిజము దత్తము రండు ||విందు||

4 తలచినట్టి నాదు తలపు - తప్ప దంచును = బలికి నా ప్రతిజ్ఞను స్థిర - పరచితి ననెను రండు ||విందు||

5 నిర్ణయించ బడిన యది - నీచ క్రియలను = పూర్ణముగా జేసె నికను - పొసగ దసకను[1] రండు ||విందు||

6 పరమ నగ రలంకరింప - బడెను బోల్పను = తరముగాని చిద్విలాస[2] - కరము తోడను రండు ||విందు||

7 పరమ నగరి ద్వారములు - తెరువబడినవి = గురుతరమణి[3] తోరణములు - గూర్చబడినవి రండు ||విందు||

8 నిత్య జీవ పదార్థములు - నిండి యున్నవి = సత్య మచట మనము జేర - సర్వము మనవి రండు ||విందు||

9 దూత లంత యేసు ప్రభుని - ప్రీతి జేయను = నూతన సంగీతములను - జేతురు వినను రండు ||విందు||

---

1 కలుగదు అని అర్థః 2 సంతోషము 3 గొప్పవైన మణులతో చేయబడిన

## 195 *Blessedness of the Heavenly State.*

పరలోక భాగ్యము.

రా—నాట. తా—ఝాప.

పరములోన బరములోన–బాప మేమి లేదుగా–నరయుదాని గోరువారి – కాశ యిందు లేదుగా ॥బరములోన॥

1 వృద్ధ సర్ప మనెడు వాని–సుద్దు[1]లందు లేవుగా–సద్దులేని చోట నెపుడు–స్వామి సేవ గల్గుగా ॥బరములోన॥

2 ఎల్ల రోగ శ్రమలు మాకు–నీ స్థలంబులోనెగా–గల్ల గాదు క్రీస్తు మనకు–గంటి నీళ్ళు దుడుచుగా ॥బరములోన॥

3 అంధకారమైన కార్యము–లా స్థలాన లేవుగా–సందె వెలుగు వెలుగు నట్లు–స్వామి సన్నిధి యుండుగా ॥బరములోన॥

4 దొంగవాని వలన మనకు–దోపు లేమి లేవుగా–నంగలార్పు దీర్చి క్రీస్తు–ఆశ్రయముగ నిల్చుగా ॥బరములోన॥

5 అన్నపానములందు నీకు–నాశ యేమి లేదుగా–గన్న తండ్రి కన్న మిగుల–ఘనుని ప్రేమ గల్గుగా ॥బరములోన॥

---

## 196 *Lift up your heads, O ye gates,*

మోక్ష ప్రవేశము.

రా—ముఖారి. తా—ఆది.

ఎంతో–శృంగారమైనది–యేసుని చరిత–మిది యెంతో వేడ్క–యున్నది–మోక్ష ప్రవేశము = అంతట దేజో–వంతుడు క్రీస్తుడు–చెంతను దూతా–శ్రిత జన పఙ్క్తులు[2]–వింతగ నడువగ–సంతత[3] నవ్య వ–సంతము[4] గల్గి య–నంత జీవరస[5]–కాంత ఫలోప వ–నాంతరములు[6]

1 పలుకులు 2 దూతల యొక్కయు, నమ్ముకొనిన వారియొక్కయు వరుసలు 3 నిత్యమైన 4 నూతనమైన వసంత ఋతువు 5 రుచి 6 ఫలవృక్షములు గల తోటలు మొదలగునవి

ద - ప్రాంతంబున[1] గల - పరమ పురమునకు = సంతసమున జనె - జయ
శబ్దముతో ||నెంతో శృంగార||

1 తెరచి - ముయ్యంగ రానట్టి - ద్వారములార మీ - శిరము లెత్తు
కొని యుండుండి - అనాదిగ నుండు - వర కవాటములారా[2] మీర - లెత్తంగ
బడుడీ = సురుచిర[3] మహిమ - స్ఫురణలు[4] గల బం - ధురతర పరిశు - ద్ధుని
కరులగు[5] భీ - కర దురితాత్ముల - మరమున[6] జదిపి[7] య - పరిమిత బల జయ
బిరుదాంకితుడై - చిరముగ నూతన - యెరుషలేము పుర - పరిపాలన
త - త్పరుడై[8] యిదిగో = నెరవుగ[9] వచ్చెను - నిజ భక్తులతో ||నెంతో||

2 సుందర - మందా నిలమంచు[10] - జీవ సంజీవా[11] - నంద సౌఖ్య
ప్రదమై[12] యుండ - రేబగ లంటని - మందిర వాసు లప్పుడు - జయ జయ
శబ్దముల = బొందుగ క్రీస్తుని - బొగడుచు బాడుచు - నందరు పరమా -
నందంబున మీ - రందుచు నందరి - కిందగు రాజుగ - ఘన వందనములు -
వరుస నొనర్చుచు - వందముగా ప్రభు - జెందిన భక్తుల - బృందము[13] లకు
దగు - విందు లొనర్చిరి = పొందిక కలిగెను - భూమికి ముక్తికి ||నెంతో||

3 వెల కం - దరానట్టి పసిడి[14] - కిరీటములు - చెలిమిన్[15] బరిశుద్ధ
వంతుల - శిరములపై బెట్టి - కళలీను[16] ధవళ వస్త్రములు - గట్టంగ నిచ్చి =
చెలువుగ[17] మరి వా - రల చేతుల లో - పల విజయాంకిత - పర్ణము[18]
లొసగి స - కల దూతలు భ - క్తులతో గూడి వి - మల[19] పీఠము ముం - దట
నిలువంబడి - పొలుపుగ[20] దమ దే - వునకును క్రీస్తుని - కెలమిని[21]
స్తోత్రము - బల ఘన మనిశము[22] = గలుగును గాకని - పలికి నుతించిరి
||ఎంతో శృంగార||

---

1 ఆ ప్రదేశమునందు 2 తలుపులు 3 సుందరమైన 4 కాంతి 5 విరోధులగు 6 యుద్ధమునందు 7 సంహారించి 8 మిక్కిలి ఆశగలవాడై 9 చక్కగా 10 చల్లగాలి 11 జీవము గలిసి జీవము నిచ్చునట్టి 12 ఇచ్చునది 13 సమూహములు 14 బంగారు 15 చక్కగా 16 ప్రకాశమిచ్చు 17 బాగుగా 18 జయమును కనపర్చెడి ఆకులు 19 పరిశుద్ధమైన 20 చక్కగా 21 సంతోషముతో 22 నిరంతరము

4 పరి శు – ద్ధవంతు లప్పుడే – శాశ్వతానందా – భరితులై వీణలు ధరి
యించి – పాటలు బాడుచును – గురు రాయడైన[1] తమ ప్రభుని – గుణములు
వర్ణించి = కరుణను నీ ర – క్తముచే మము నం – దరి ధరణిం గల – వర
వంశస్థుల – తరములలో నుం – డి రహిగా[2] దేవుని – కొరకు గదా మము –
కొనియుంటివి మరి – మురువుగ[3] నిక దే – వుని సముఖంబున – దొరలను
అర్చక – వరుల[4] జేసితివి = నర యేలును మిక – సరియని ప్రమొక్కిరి ॥ఎంతో॥

---

## పిల్లలకొరకైన కీర్తనలు.

## 197 *Around the throne of God in Heaven.*

బాలురయొక్క మోక్ష కాలక్షేపము.

రా—ఆనందభైరవి. తా—ఆది.

మహిమ మహిమ మహిమ యనుచును – శిశులు ని – ర్మల[5] వినోద
ధ్వనుల నిలుతురు = అహాహా మా యఘంబు[6] లెల్ల – నణచె వీని నామ
మనుచు – బహు విధంబులైన పాట – ల్పాడుచు నాడుచు వేడుచు
గూడుచు ॥మహిమ॥

1 శత సహస్ర[7] సంఖ్య మించిన – బాల సం – చయము[8] ప్రభువు
గద్దె చుట్టున = నతులితంబులైన[9] కాంతి – గతుల[10] నమర మింట బాడ –
నీ తీరు నెవరు దెచ్చి రచటి – కే గతి ని గూడి మోక్షగ పాగిరి ॥మహిమ॥

2 విమలమైన మతుల[11] జేయగా – నెవడు తనదు – విలువలేని నల్ల[12]
జల్లగ = సమసెనో[13] యఘంబు లట్టి – జనకుడైన ప్రభువు నెదుట – నమల
కోమలంబు[14] లైన – యాటల పాటల మీటుచు జాటుచు ॥మహిమ॥

---

1 గురువులలో శ్రేష్ఠుడు 2 ప్రియముగా 3 చక్కగా 4 శ్రేష్ఠులైన యాజకులు 5 మంచి మనస్సుతో 6 పాపములు 7 లక్షలకొలది 8 సమూహము 9 పోల్ప శక్యముగాని 10 స్థితులయందు. 11 మనస్సుగల వారిని 12 రక్తము 13 నాశనమాయెను 14 పరిశుద్ధమును, మృదువు

3 తాము ప్రభువు కృపను మిగులను - జూచి యతని - దయను లోకమందు వేడ్కను = ప్రేమ జెంది యిపుడు గోరె - పిల్లయైన ప్రభువు నెదుట - దాము మోద మలర[1] నిలిచి - వేమారు[2] దా మెల్ల నా మోము శ్రేమించి ||మహిమ||

---

# 198 *A Child's Prayer.*

బిడ్డయొక్క ప్రార్థన.

రా—ముఖారి. తా—ఛాప్.

పిల్లనైన నన్ను జూడుమీ - ప్రియమైన యేసు - పిల్లనైన నన్ను జూడుమీ = చల్లని రక్షకుడ వనుచు - సత్యవార్త దెలుపుచుండ - నుల్లమందు[3] నిన్ను నమ్మి - కల్ల లేక వేడుకొందు ||పిల్లనైన||

1 నేను తెలివి లేని వాడను - నా రక్షకుండ - జ్ఞాన మిమ్మి సరగ నిప్పుడు = దీన జనుడ నైన నన్ను - దినదినంబు దీవించి - నాన[4] బడక నిన్ను జేరి - నయము మీర బ్రతుకునట్లు ||పిల్లనైన||

2 నిన్ను నమ్మి యున్నాడను - ఘన దేవ తనయ - నన్ను దాచు నీ నీడను = చిన్నని హృదయంబు నాకు - జెన్నుగా నొసంగి యిపుడు - సన్నుతింప నిమ్మి నన్ను - సాధువైన నిన్ను దలచి ||పిల్లనైన||

3 ప్రేమచేత నొప్పుచుంటివి - ప్రేమా స్వరూప - ప్రేమలోన నడుచు చుంటివి = ప్రేమ లేని నన్ను బ్రోవ[5] - ప్రేమచేత బ్రాణ మిచ్చి - ప్రేమ జూపు మనుచు నన్ను - బ్రీతిచేత బోధింప ||బిల్లనైన||

4 పరమ జనకు చిత్త మెప్పుడు - పరమేశ పుత్ర - బిరబిరగను జేయ నిమ్మి = కరుణ మీర నాత్మచేత - వరవరంబు లొసగి నాకు - నరులలోన నిన్ను గొలువ - ధరణిమీద నన్ను నిలుప ||పిల్లనైన||

---

1 సంతోషము కల్గునట్లుగా 2 అనేక సార్లు 3 హృదయమునందు 4 సిగు 5 రక్షించు
రమిత్తము

5 బలము మీరఁ నన్ను నిలుపుము - తుల[1] లేని పాపి - బలము గల్గు నీ చేతుల = నిలను నీకు ఫలము లిచ్చి - యొలమి[2] నన్ను గొప్పజేయు - సల లితముగ[3] నడువ నియ్యు - జక్కని నీ మార్గమందు ॥పిల్లనైన॥

---

## 199 *Children's Praise.*

చిన్న పిల్లల స్తోత్రము.

రా—ముఖారి. తా—ఆట.

పిల్లనే చిన్న పిల్లనే - ఓ యేసు నాథ - పిల్లనే చిన్న పిల్లనే = తల్లిదండ్రులు తాత ముత్తవ - లెల్ల బొమ్మల పూజ జేయుచు - కల్ల మార్గమునందు విడిచిరి - తల్లడిల్లుచు నిన్ను జేరిన ॥పిల్లనే॥

1 ఒల్లనే[4] యిక నది యొల్లనే - ఓ యేసు నాథా - యొల్లనే యిక నది యొల్లనే = చల్లని శుభవార్త బోధ - లెల్ల మానసమందు జొచ్చెను - తొల్లి జేసిన నేరములు నీ - వల్ల బోనని[5] నమ్మియున్న ॥పిల్లనే॥

2 ముల్లెనే పాపపు ముల్లెనే - ఓ యేసు నాథా - ముల్లెనే పాపపు ముల్లెనే = పొల్లులును దుర్వాంఛలును మది - నెల్ల గూర్చిన దుష్టులకు నే - తుల్లిపడుచు భయమున సొమ్మ - సిల్లి నిన్ను జేరియున్న ॥పిల్లనే॥

3 చెల్లదే నిన్విడ జెల్లదే - ఓ యేసు నాథా - చెల్లదే నిన్విడ జెల్లదే = అల్లిబిల్లిగ[7] నిన్ను నే - నల్లన[8] వెంబడించుటచే - నుల్లసంబులు గల్గ జడియక - తల్లిదండ్రి వటంచు నమ్మిన ॥పిల్లనే॥

---

## 200 *Children's Prayer.*

పిల్లల ప్రార్థన.

రా—ముఖారి తా—ఆది.

చిన్న పిల్లను - నీ సన్నిధికి వచ్చితి - నే-నిన్నే నెర నమ్మితి॥చిన్న

---

1 సమానము 2 ప్రేమతో 3 మనోహరముగా 4 ఇష్టపడను 5 పోవునని 6 మూట
7 నెమ్మదిగా 8 చక్కగా

1 చిన్న పిల్లల దయతో - సన్నిధికి రావించి - మున్న యాశీర్వ
దించి - యున్న నా యేసన్న ॥చిన్న॥

2 చిన్న పిల్లలందు నీ - కున్న ప్రేమను గాంచి - సన్నిధికి వచ్చి
యున్న - నన్నేలు మేసన్న ॥చిన్న॥

3 దిక్కు - నీవే యటంచు - మ్రొక్కి ప్రార్థించు వారి - యక్కర
లను గడిపినట్టి - చక్కని నా యేసన్న ॥చిన్న॥

4 ఎన్న శక్యముగాని - ఎన్నో గండముల నుండి - నన్ను విడిపించు
చు - నున్న నా యేసన్న ॥చిన్న॥

5 నిన్ను ప్రేమించుటందు - నిన్ను సేవించుటందు - నన్ను బలపరచ్చు
చుంచు - నిన్నడిగెద నేసన్న ॥చిన్న॥

6 బాల ప్రాయము నాడే - జాలిగల పిలుపు నాకు - మేలుకై విని
పించినట్టి - జాలిగల నా యేసన్న ॥చిన్న॥

7 దిన దినము నా నడ - తను క్రొత్త జేసి నీ - ఘనమునకై బ్రతికించు -
కొనుము నా యేసన్న ॥చిన్న॥

---

## 201 *Children's Love.*

పిల్లల అన్యోన్య ప్రేమ.

రా — ముఖారి. తా — ఝాప్.

వారు ధన్యులైన పిల్లలు - భూలోకమందు - వారు ధన్యులైన పిల్లలు = కోరి విచారమున ప్రభుని - సార వాక్య మెదను[1] బెట్టి - వారి వారి కితరులైన - వారికిని విధేయులైన ॥వారు ధన్య॥

1 అన్నదమ్ములందు నెటులను - తనతోటి యాడు - చున్న యితరు లందు నటులను = భిన్న[2] మెంచ కొక్క రీతి - దన్ను బోలె ప్రియ మొనర్చి - తిన్నని బరియందు నేర్చు - చున్న వార లెవ్వరో ॥వారు ధన్య॥

1 హృదయము నందు 2 వేరుగా దలంచక

2 ఒకడే తండ్రి యతడు దేవుడు - మన కందరకును - సకల సుఖము లిచ్చు నెప్పుడు = అకట మన మికను జగడము - లాడ దగదు ప్రభువు రీతి - నొకని నొకడు ప్రియము చేసి - యుండుద మని దలచుచుండు ||వారు ధన్యు||

3 మంచి మేలు లనుభవింపగ - గరుణించి దేవు - డెంచి మనల నిచట గూర్చెగ = వంచనల[1] త్యజించి[2] కనిక - రించి యొకని నొకడు మది స - హించి మంచి క్రియలతో న - టించ[3] నిశ్చయింతు రెవరో ||వారు ధన్యు||

4 ఆకసమున నున్న దేవుడు - మన మనసు రాక - పోక లన్ని జూచు నెప్పుడు - ఏకముగా హృదయములు వి - వేకమున వెలుంగజేసి - ప్రాకటముగ ప్రభుని యాజ్ఞ - గైకొనియెడి వార లెవరో ||వారు ధన్యు||

---

## 202 *Thou art my Father.*

నీవు నాకు తండ్రివి.

రా—ఆనందభైరవి. తా—ఆది.

గొప్ప దేవ నాకు దండ్రివి - యాకాశమందు - గొప్ప దేవ నాకు దండ్రివి = తప్పకుండ వత్తు నీ - దరికి యేసు నామమందు - గొప్ప కరుణ చేత న - న్నిప్పుడు తగ జేర్చికొనుము ||గొప్ప దేవ||

1 నీవు మిగుల గొప్ప వాడవు - నా సృష్టి కర్త - యీవు లెపుడు నిచ్చువాడవు = భావమందు నన్ను దలచి - పావనాత్మ నాకు నిచ్చి - జీవ మార్గమందు నిలిపి - కావు మనుచు వేడికొందు ||గొప్ప దేవ||

2 చిన్న వాని నంగి[4] ప్రార్థన - నీ లోకమందు - మున్ను దయను విన్న వాడవు = సన్నుతు డగు యేసు నీ - సన్నిధి నున్నాడు గాన - నన్ను గనికరింపు మనుచు - నిన్ను నమ్మి వత్తు నిపుడు ||గొప్ప దేవ||

1 మోసపు పనులను 2 విడిచిపెట్టి 3 ప్రవర్తించుటకు 4 వచ్చిరాని మాటలతో

3 విలువ గల్గు నీదు నాజ్ఞలు - నా హృదయమందు - బలు విధముల దలచుచుందును = బలుకులందు బనులయందు - బలము జూపి నిన్ను గొలచి - యిలను నిన్ను బ్రీతి పరతు - నలయక నీ కరుణ మెయిని[1] ॥గొప్ప దేవ॥

4 మీది రాజ్యమందు జేర్పుము - కరుణా సముద్ర - బీదనైన నన్ను గరుణచే = సోదరులను గూడికొనుచు - మోద మొప్ప నీదు సేవ - జేయు కొనుచు నుందు నీ - పాద పద్మములను బట్టి ॥గొప్ప దేవ॥

---

1 విదముగా

# కీర్తనల ప్రారంభ వాక్యముల సూచిక.

—:O:—

CHRISTIAN LYRICS—LIST OF AUTHORS



*N. B. Numbers marked with * indicate translations from English.*